## ఉపసంఘ సభ్యులు

### రాజ్య సభ

శ్రీ గోవింద వల్లభ పంత్
శ్రీ పురుషోత్తమ దాస్ టండన్
శ్రీ కె. పి. మాధవన్ నాయర్
శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు
ప్రొఫెసర్ డాక్టర్ రఘువీర
సర్దార్ బుధ్ సింగ్
శ్రీ భగీరథి మహాపాత్ర
డాక్టర్ ఏ. రామస్వామి మొదలియార్
శ్రీ పేరాత్ నారాయణన్ నాయర్
శ్రీ ప్రఫుల్ల చంద్ర భంజ్ దేవ్

### లోక్ సభ

శేత్ గోవింద దాస్
శ్రీ పి. టి. తాను పిళ్లై
స్వామి రామానంద తీర్థ
శ్రీ బి. ఎస్. మూర్తి
పండిత ఠాకూర్ దాస్ భార్గవ
శ్రీ హిఫ్‌జుర్ రహ్‌మాన్
శ్రీ బి. భగవతి
శ్రీ యు. శ్రీనివాస మల్లయ్య
శ్రీ ఫ్రాంక్ ఆంతోనీ
శ్రీ మథుర ప్రసాద్ మిశ్ర
శ్రీ మాణిక్య లాల్ వర్మ
శ్రీ భక్త దర్శన్
శ్రీ శ్రీపద్ అమృత్ డాంగే
శ్రీ హరిష్‌చంద్ర శర్మ
కుమారి మణిబెన్ వల్లభ్‌భాయి పటేల్
శ్రీ జి. ఎస్. ముసాఫిర్
శ్రీ అతుల్య ఘోష్
శ్రీ దేవ్‌రావ్ యశ్వంతరావ్ గొహోకర్
శ్రీ హరీంద్ర నాథ్ ముఖర్జి
శ్రీ ప్రమథనాథ్ బెనర్జి

## ఉపసంఘ కార్యకర్తలు

శ్రీ ఆర్. ప్రసాద్, ఐ.ఏ.ఎస్., సెక్రటరి
శ్రీ ఎస్. ఎల్. మధురియా, డిప్యూటి సెక్రటరి
శ్రీ ఆర్. పి. శర్మ, అండర్ సెక్రటరి
శ్రీ ఎమ్. బి. లాల్, సెక్షన్ ఆఫీసర్

# విషయ సూచిక

# పార్లమెంటు అధికార భాషోపసంఘ నివేదిక

## ఒకటవ అధ్యాయం

## పీ ఠి క

1. రాజ్యాంగంలోని 344-వ ఆర్టికలు 1-వ క్లాజు ననుసరించి, రాజ్యాంగం అమలులోకి వచ్చిన ఐదు సంవత్సరాలు గడచిన మీదట, అలాగే పది సంవత్సరాలు గడచిన మీదట రాష్ట్రపతి తన ఉత్తరువు మూలకంగా ఒక విచారణ సంఘాన్ని నియమించాలి. ఆ విచారణ సంఘంలో ఒక అధ్యక్షుడు, రాజ్యాంగంలోని ఎనిమిదవ అనుబంధంలో నిర్దేశింపబడిన వివిధ భాషలకు ప్రతినిధులుగా రాష్ట్రపతిచే నియమింపబడిన సభ్యులు ఉండాలి. ఆ విచారణ సంఘ కార్యక్రమాన్నికూడా ఉత్తరువులో విశదీకరించాలి. "ఆ విచారణ సంఘం ఈ దిగువ విషయాలను గురించి రాష్ట్రపతికి సలహాలీయా"లని, ఆ ఆర్టికిలులోని 2-వ క్లాజు సూచిస్తున్నది.

రాజ్యాంగములో 344-వ ఆర్టికల్‌లోని విధులు, అధికార భాషా విచారణ సంఘ విధులు.

(అ) కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో క్రమేపి హిందీ భాష ఉపయోగం;

(ఆ) కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలన్నింటిలోగాని, కొన్నింటిలోగాని ఇంగ్లీషు వాడుకపై కట్టుబాటులు;

(ఇ) 348-వ ఆర్టికిలులో పేర్కొన్న వ్యవహారాలన్నింటిలో లేక కొన్నింటిలో ఉపయోగింపదగిన భాష;

(ఈ) కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో నిర్దిష్టమైన ఏ వ్యవహారంలోగాని, వ్యవహారాలలోగాని ఉపయోగింపదగిన అంకెలు;

(ఉ) కేంద్ర ప్రభుత్వ అధికార భాషను గురించి, కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వానికి నడుమ నడిచే వ్యవహారాలలో ఉపయోగింపదగిన భాషను గురించి. లేక ఒక రాష్ట్ర ప్రభుత్వం మరొక రాష్ట్ర ప్రభుత్వంలో జరుపు వ్యవహారాలలో ఉపయోగింపదగిన భాషను గురించి విచారణ సంఘముయొక్క అభిప్రాయములు కోరుతూ రాష్ట్రపతి నిర్దేశించిన ఇతర అంశాలు.

2. అలాగే, 1955 జూన్ 7-వ తేదీన రాష్ట్రపతి ఒక విచారణ సంఘాన్ని నియమించారు. స్వర్గీయ శ్రీ బి. జి. ఖేర్ ఆ విచారణ సంఘాధ్యక్షులుగాను, ఎనిమిదవ అనుబంధంలో సూచింపబడిన భాషలకు ప్రాతినిధ్యం వహించగల మరి 20 మంది సభ్యులుగాను నియుక్తులయారు. ఈ సభ్యుల పేర్లను, ఈ సంఘం విచారించవలసిన అంశాలను, సంఘం పనిచేయవలసిన విధానమును వివరించే ప్రకటన పత్రం నకలు ఈ నివేదికలో 1-వ అనుబంధంగా చేర్చబడింది. పైన పేర్కొన్న 2-వ క్లాజులో (అ) మొదలు (ఈ) వరకు ఉన్న సబ్ క్లాజులు ఆ సంఘ విచారణీయాంశాలలో చేర్చబడినవని దానినిబట్టి తెలుసుకోవచ్చును. 2-వ క్లాజులోని సబ్ క్లాజు (ఉ) ను అనుసరించి కేంద్ర ప్రభుత్వ వ్యవహార భాషగాను, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య నడిచే వ్యవహారాలలో ఉపయోగించే భాషగాను, వివిధ రాష్ట్ర ప్రభుత్వాల నడుమ పరస్పర వ్యవహార భాషగాను ఇంగ్లీషు భాష స్థానంలో హిందీ భాషను ప్రవేశపెట్టడానికి తగిన కాల కార్యక్రమాలను, విధాన క్రమాన్ని తయారు చేసే విషయంలోకూడ ఆ విచారణ సంఘం సలహా ఈయాలని సూచింపబడింది. ఈ విచార సంఘ కార్యక్రమాన్ని నిర్ణయించుకొనే అధికారం ఆ సంఘానికే వదలబడింది.

విచారణ సంఘ నియామకం— విచారణీయాంశాలు— విధానం.

విచారణ సంఘ నివేదికా సమర్పణ

3. ఆ విచారణ సంఘం ఒక ప్రశ్నావళిని తయారుచేసి, విరివిగ పంపకం చేసి, మొత్తం 1094 వ్రాత మూలకమైన సమాధానములను, లేక విజ్ఞప్తి పత్రాలను సేకరించింది. వీటిలో పార్టు "ఎ", పార్టు "బి" రాష్ట్రాలు, సుప్రీం కోర్టు, హై కోర్టులు, కేంద్ర రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమీషన్లు, విశ్వ విద్యాలయాలు, సాహిత్య విద్యా సంస్థలు వగైరా పంపిన సమాధానాలు కూడా ఉన్నవి. మొత్తం 930 మంది వ్యక్తులను, వివిధ సంస్థల ప్రతినిధులనుకూడా వారు విచారించారు. చివరకు ఈ విచారణ సంఘం ఒక నివేదిక తయారుచేసి రాష్ట్రపతికి సమర్పించింది. ఆ నివేదికను అచ్చొత్తించి, 1957 ఆగస్టు 12-వ తేదీన పార్లమెంటు ఉభయ సభలలో సభ్యులందరికి అందజేశారు.

పార్లమెంట అధికార భాషోప సంఘం—రాజ్యాంగ సిద్ధ విధులు—సభ్యుల ఎన్నిక.

4. లోక్ సభ సభ్యులు 20 మంది, రాజ్య సభ సభ్యులు 10 మంది, మొత్తం 30 మంది సభ్యులు గల ఒక ఉపసంఘాన్ని ఏర్పాటు చేయాలని 344-వ ఆర్టికిల్‌లోని 4-వ క్లాజు సూచిస్తున్నది. ఈ సభ్యులను ఉభయ సభలు నిష్పత్తి ప్రాతినిధ్య పద్ధతిని, సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ వోటింగుతో ఎన్నుకోవాలనికూడా నిర్దేశింపబడింది. ఈ ఉపసంఘం లోగడ విచారణ సంఘం చేసిన సూచనలను పరిశీలించి, వాటిపై తన అభిప్రాయాలను రాష్ట్రపతికి నివేదించాలని 5-వ క్లాజు నిర్దేశిస్తూంది. తదనుగుణంగా, 1957 సెప్టంబరు 3-వ తేదీన దేశీయ వ్యవహార మంత్రి ప్రతిపాదనపై ఈ దిగువ పేర్కొన్నవారు ఈ ఉపసంఘ సభ్యులుగా ఎన్నిక అయ్యారు.

రాజ్య సభ — ఎన్నిక జరిగిన తేదీ 11–9–57

శ్రీ గోవింద వల్లభ పంత్
శ్రీ పురుషోత్తమ దాస్ టండన్
శ్రీ కె. పి. మాధవన్ నాయర్
శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు
ప్రొఫెసర్ డాక్టర్ రఘువీర
సర్దార్ బుధ్‌సింగ్
శ్రీ భగీరథి మహాపాత్ర
డాక్టర్ ఏ. రామస్వామి మొదలియార్
శ్రీ పేరాత్ నారాయణన్ నాయర్
శ్రీ ప్రఫుల్ల చంద్ర భంజ్ దేవ్

లోక్ సభ — ఎన్నిక జరిగిన తేదీ 13–9–57

శేఠ్ గోవింద దాస్
శ్రీ పి. టి. తాను పిళ్లై
స్వామి రామానంద తీర్థ
శ్రీ బి. ఎస్. మూర్తి
పండిత ఠాకూర్ దాస్ భార్గవ
శ్రీ హిఫ్‌జుర్ రహమాన్
శ్రీ బి. భగవతి
శ్రీ యు. శ్రీనివాస మల్లయ్య
శ్రీ ఫ్రాంక్ అంటోనీ
శ్రీ మథుర ప్రసాద్ మిశ్ర
శ్రీ మాణిక్య లాల్ వర్మ

శ్రీ భక్త్ దర్శన్
శ్రీ శ్రీపద్ అమృత్ డాంగే
శ్రీ హరిశ్చంద్ర శర్మ
కుమారి మణిబెన్ వల్లభ్‌భాయి పటేల్
శ్రీ జి. ఎస్. ముసాఫిర్
శ్రీ అతుల్య ఘోష్
శ్రీ దేవ్‌రావ్ యశ్వంతరావ్ గొహోకర్
శ్రీ హరీంద్ర నాథ్ ముఖర్జి
శ్రీ ప్రమథనాథ్ బెనర్జి

వీరిలో శ్రీ జి. బి. పంత్, సర్దార్ బుధ్‌సింగ్‌ల రాజ్య సభా సభ్యత్వం 1958 ఏప్రిల్ 2-వ తేదీతో ముగిసిపోయినందువల్ల వారిరువురు ఈ ఉపసంఘ సభ్యత్వాన్నికూడా కోల్పోయారు. అయితే, వారు తిరిగి వెంటనే రాజ్య సభకు ఎన్నిక అయారు. వెంటనే ఈ ఉపసంఘ సభ్యులుగాకూడా తిరిగి ఎన్నుకొన బడ్డారు.

5. ఈ ఉపసంఘం 1957 నవంబరు 16-వ తేదీన జరిపిన తొలి సమావేశంలో అధ్యక్షులుగా శ్రీ గోవింద వల్లభ పంత్ ఏక గ్రీవంగా ఎన్నుకొనబడ్డారు. ఈ ఉపసంఘ కార్య కలాప నిర్వహణకు, తగిన నిబంధనావళిని తయారు చేయడానికిగాను ఒక నిబంధన రచనోప సంఘాన్ని ఈ సమావేశంలో ఏర్పాటు చేశారు. డాక్టరు ఏ. రామస్వామి మొదలియారు, శ్రీ ఫ్రాంక్ అంతోనీ, డాక్టర్ రఘువీర, శ్రీ ఎస్. ఏ. డాంగే, పండిత ఠాకూర్ దాస్ భార్గవ, శ్రీ శ్రీనివాస మల్లయ్య ఈ నిబంధన రచనోప సంఘ సభ్యులుగా ఎన్నిక అయారు. ఈ ఉప సంఘం ఆమోదించిన నిబంధనావళి ఈ నివేదికకు రెండవ అనుబంధంగా చేర్చబడింది. అధ్యక్షుని ఎన్నిక—విధానం—నిబంధనావళి.

6. ఈ భాషా సమస్య జాతీయ జీవనానికి, కృషికి సంబంధించిన అనేక రంగాలలోనికి చొచ్చుకొనిపోయి శాఖోప శాఖలుగా ఉన్నదనీ, ఏ అంశాన్ని విడివిడిగా తీసుకొని పరిశీలించరాదనిన్ని అధికార భాషా విచారణ సంఘం అభిప్రాయ పడింది. అందువల్ల విచారణకై నిర్దిష్టములైన అంశములేగాక, ఇంకా చాలా విషయాలను గురించి ఆ సంఘం విచారించింది. తమ విచారణకై నిర్దిష్టములైన అంశములపై వారు ప్రకటించిన ఉద్దేశ్యములను 'సలహాలు'గను, అట్లు నిర్దిష్టముకాని అంశములపై వారి ఉద్దేశ్యములను 'అభిప్రాయములు'గను ప్రత్యేకముగా "అభిప్రాయాలు, సలహాల సంక్షిప్త వివరణ" అనుశీర్షికలో చేర్చి నివేదిక చివర 1-వ అనుబంధముగా ముద్రించారు. లోగడ చెప్పినట్లు ఆ విచారణ సంఘం ఏయే విషయాలను గురించి సలహా లీయవలసినదీ రాజ్యాంగంలోనే స్పష్టం చేయబడి ఉంది. "ఆ విచారణ సంఘం సలహాలను పరిశీలించడం, వాటిపై తన అభిప్రాయాలను రాష్ట్రపతికి నివేదించడం పార్లమెంటు ఉపసంఘ విధి" అని కూడా వివరించారు. ఈ నిర్దేశక సూచనల దృష్ట్యా, విచారణ సంఘంవారి "సలహాలను" మాత్రమే తాను పరిశీలింప దగునని, "అభిప్రాయాల"లో కూడా సలహాలతో ప్రత్యక్ష సంబంధం గల విషయమేదైనా ఉంటే, దానిని కూడా పరిశీలించాలనీ ఉపసంఘం నిశ్చయించింది. అయితే, ఆ అభిప్రాయాలలో దేనినీ పరిశీలింప నక్కరలేదని చివరకు నిశ్చయించడంవలన, కేవలం సలహాలపైననే తన అభిప్రాయాలను ప్రకటిస్తున్నది. విచారణ సంఘ సూచనలు, నిర్ణయాలు—ఉపసంఘం యొక్క బాధ్యతలు.

ఉపసంఘ సమావేశాలు— కార్యనిర్వహణ విధాన నిర్ణయం— తొలి చర్చలు— వివిధ సూచనల పరిశీలన

7. ఈ ఉపసంఘం 26 సమావేశాలు జరిపింది. ఈ సమావేశాలు ఏయే తేదీలో జరిగినది. ఏ సమావేశానికి ఎందరు సభ్యులు హాజరయినది వివరించే పట్టిక ఈ నివేదిక చివర చేర్చబడినది. (అనుబంధం 3.)

విచారణ సంఘం చాలా విషయాలను గురించి సలహాలిచ్చింది. ఆ విషయాలు భారత దేశ భవిష్యత్తుకి చాలా ముఖ్యమైనవేకాక చాల సంశ్లిష్టమైనవి, సంకీర్ణ స్వభావం గలవి అయినందువ, మొదట అన్ని విషయాలపై సమగ్రమైన చర్చ జరిపి, ఈ సమస్యలో ప్రధానాంశాలను అవగతం చేసుకోవడం ఉచితమని నిశ్చయింపబడినది. ఈ చర్చలో ఇంచుమించు సభ్యులందరు పాల్గొన్నారు. వివరాలకు సంబంధించిన చిన్న చిన్న విషయాలలోను, ఈ సమస్యలోని కొన్ని విషయాలపై పట్టుదలల విషయంలోను అభిప్రాయ భేదాలు కని పించినప్పటికి, ఆశయాల విషయంలోను, సమస్యా పరిష్కార పద్ధతిని గురించి స్థూలంగాను ఏకీభావం ఉన్నదని ఈ చర్చలలో తేలింది. పిమ్మట విచారణ సంఘం సలహాలను విడివిడిగాను, వీలును బట్టి సామూహికంగాను చర్చించాము.

ఉపయుక్తమైన దోగట్టా— స్వీకారము.

8. అధికారా భాషా సమస్యకు సంభంధించిన వివిధ విషయాలను గురించి విచారణ సంఘ నివేదికలో పేర్కొన్న విషయాలు, వాటికి సంబంధించిన (ప్రకటిత) పత్రాలే గాక, వివిధ స్థలాలలో విచారణ సంఘం సేకరించిన వాఙ్మూలాలు, లిఖిత పత్రాలుకూడా సన్నద్ధమై ఉండటం ఉపసంఘానికి విశేషంగా ఉపకరించింది. అధికార భాషా విచారణ సంఘ నివేదికపై చెన్నరాష్ట్ర ప్రభుత్వం పంపిన బహు యుక్తి యుక్తమైన విజ్ఞాపన పత్రము, ఈ విషయాన్ని గురించి చెన్న రాష్ట్రంలో ఉభయ శాసన సభలలో జరిగిన వాదోపవాదాల వివరణకూడా ఉపసంఘానికి అందినవి. ఈ అధికార భాషా సమస్యను గురించి పశ్చిమ బెంగాలు రాష్ట్రంలో ఉభయ శాసన సభలలో జరిగిన చర్చల పూర్తి పాఠం, వివిధ సంస్థలు, వ్యక్తులు పంపిన అనేక విజ్ఞాపన పత్రాలు, తీర్మానాలు, లేఖలుకూడా ఈ ఉపసంఘానికి చేరినవి.

నివేదికా రచనా ప్రణాళిక.

9. అధికార భాషా సమస్యను గురించి ఈ ఉపసంఘ స్థూల దృక్పథం, రాజ్యాంగంలోని తత్సంబంధమైన సూత్రాలూ రెండవ అధ్యాయంలో వివరింపబడినవి. విచారణ సంఘం సలహాలకు సంబంధించిన విషయాలన్నింటిపైన ఈ ఉపసంఘాభిప్రాయాలు మూడవ అధ్యాయంలో వ్యాస రూపంలో వివరింపబడినవి. విచారణ సంఘం సలహాలను, వారి నివేదికలో ఉన్న క్రమంలోనే ఉంచి ఆ ప్రక్కనే వాటిపై ఉపసంఘం అభిప్రాయాలుకూడా మూడవ అధ్యాయంలో పట్టిక రూపంలో చూపబడినవి.

---

## రెండవ అధ్యాయం

# సమస్యా స్వరూప స్వభావాలు

10. అధికార భాషకు సంబంధించిన నిర్దేశాలు రాజ్యాంగం 17-వ భాగంలో ఉన్నవి.

రాజ్యాంగంలో అధికార భాషను గురించిన ఆదేశాలు-కేంద్ర ప్రభుత్వ అధికార భాష.

కేంద్ర ప్రభుత్వ అధికార భాష దేవనాగరి లిపియుక్తమైన హిందీ భాషగా ఉండాలి అని, అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న భారత దేశపు అంకెలనే కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో వాడాలి అనీ రాజ్యాంగంలోని 343-వ ఆర్టికిల్ 1-వ క్లాజు ఆదేశిస్తున్నది. అయినప్పటికి, రాజ్యాంగం అమలులోకి వచ్చినప్పటినుండి పదిహేను సంవత్సరాల వరకు, అంతకు పూర్వం కేంద్ర ప్రభుత్వం ఇంగ్లీషు భాషను వాడుక చేస్తూన్న అన్ని వ్యవహారాలలోను ఇంగ్లీషు భాష వాడుతూ ఉండాలి. అయితే, భారత ప్రభుత్వ వ్యవహారాలలో దేనిలో అయినా, ఇంగ్లీషు భాషకు తోడు హిందీని కూడా ఉపయోగించాలనీ, అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న ప్రాచీన భారత దేశపు అంకెలకు తోడు దేవనాగరి అంకెలను కూడా ఉపయోగించాలని రాష్ట్రపతి ఉత్తరువు చేయ వచ్చుననీ ఈ 2-వ క్లాజులో ఉన్నది. ఇంగ్లీషు భాషగాని, దేవనాగరి అంకెలుగాని ఈ పదిహేను సంవత్సరాల అనంతరం (అనగా 1965 జనవరి పిమ్మటకూడా) ఉపయోగించ వచ్చునని శాసన మూలకంగా నిర్ణయించే అధికారం 3-వ క్లాజు ద్వారా పార్లమెంటుకు లభిస్తున్నది. వాటిని ఏయే విషయాలలో వాడవలసినది ఆ శాసనంలో వివరింప బడాలి.

క్రమేపి హిందీని వాడుకలోకి తీసుకొని రావడం, ఇంగ్లీషు ఉపయోగంపై ఆంక్షలు విధించడం మొదలైన విషయాలను గురించి సలహాలిచ్చే నిమిత్తం ఒక విచారణ సంఘాన్ని, ఆ సలహాలను పరిశీలించే నిమిత్తం ఒక పార్లమెంటు ఉపసంఘాన్ని ఏర్పాటు చేయాలని రాజ్యాంగం లోని 344-వ ఆర్టికిలు నిర్దేశిస్తున్నదని లోగడ వివరించాము. రాష్ట్రపతి ఈ ఉపసంఘ నివేదికను పరిశీలించిన మీదట, పూర్తిగా ఆ నివేదిక నంతటినీ అనుసరించిగాని, అందులో కొంత భాగాన్ని అనుసరించిగాని ఉత్తరువులీయాలి. ఈ ఉత్తరువులు 343-వ ఆర్టికిల్‌లోని విష యాలకు మాత్రమే పరిమితమై ఉండనక్కరలేదు.

11. ప్రతి రాష్ట్రం ఆ రాష్ట్రంలో వాడుకలో ఉన్న ఏ భాషనుగాని లేక భాషలనుగాని, హిందీ భాషనుగాని ఆ రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలన్నింటిలోగాని, కొన్నింటిలోగాని వాడాలని నిర్ణయించ వచ్చు. ఈ అధికారం 345-వ ఆర్టికిలు రీత్యా ఆయా రాష్ట్ర శాసన సభలకు లభిస్తూంది. రాష్ట్ర శాసన సభ శాసనం ద్వారా అట్టి నిర్ణయం చేసేవరకు, రాజ్యాంగానికి పూర్వం ఇంగ్లీషు భాషలో జరుగుతున్న ఆ రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలన్నీ ఇంగ్లీషులోనే సాగుతూ ఉండాలి. ఏ రాష్ట్రంలో అయినా తగినంత మంది ప్రజలు వారు మాట్లాడే భాషను ఆ రాష్ట్ర అధికార భాషగా గుర్తించాలని కోరుతున్నట్లు రాష్ట్రపతికి సంతృప్తి కలిగితే, అట్టి అభ్యర్థనపై రాష్ట్రపతి ఆ రాష్ట్రంలో అంతటాగాని, కొంత భాగంలోగాని ఆ భాషనుకూడా గుర్తించాలని, తాను నిర్దేశించిన వ్యవహారా లన్నింటిలో ఆ భాషనే వాడకం చేయాలని ఆదేశించవచ్చునని 347-వ ఆర్టికిలు సూచిస్తూంది.

రాష్ట్రాలలో అధికార భాష.

346-వ ఆర్టికిలు ప్రకారం, కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో ప్రస్తుతం వాడుకలో ఉన్న భాషనే, రాష్ట్రానికి—రాష్ట్రానికి మధ్యను, రాష్ట్రానికి—కేంద్ర ప్రభుత్వానికి మధ్యను నడిచే వ్యవహారా లన్నింటిలోను వాడవలసి ఉంది. రెండుగాని, అంతకన్న ఎక్కువగాని రాష్ట్రాలు ఆ రాష్ట్రాల మధ్య నడిచే వ్యవహారాలలో హిందీ భాషను ఉపయోగించాలని ఒప్పందం చేసుకోవచ్చు.

రాష్ట్రానికి రాష్ట్రానికి, రాష్ట్రానికి—కేంద్ర ప్రభుత్వానికి మధ్య నడిచే వ్యవహారాలలో వాడవలసిన భాష.

శాసన భాష, హైకోర్టులలో వ్యవహార భాష.

12. పార్లమెంటు శాసన రీత్యా అన్యథా నిర్ణయించే వరకు, సుప్రీం కోర్టులోను, అన్ని హై కోర్టులలోను నడిచే వ్యవహారా లన్నింటిలో, శాసనా లన్నింటిలో ఇంగ్లీషు భాషనే వాడాలని 348-వ ఆర్టికిలు నిర్దేశిస్తున్నది. ఏ రాష్ట్రంగాని ముందుగా రాష్ట్రపతి అనుమతి పొందిన మీదట, రాష్ట్ర అధికార భాషనుగాని, హిందీనిగాని ఆ రాష్ట్రపు హై కోర్టు వ్యవహారాలలో వాడవచ్చును. అయితే, తీర్పులు, డిక్రీలు, ఉత్తరువులు మాత్రం ఇంగ్లీషులోనే ఉండాలి. రాష్ట్రంలో బిల్లులు, శాసనాలు మొదలైన వాటిలో ఇంగ్లీషు కాక మరొక భాషను వాడాలని నిర్ణయించే అధికారం రాష్ట్ర శాసన సభకు ఉంటుంది. అయితే, వాటి అంగ్లాను వాదాలను ఆ ప్రభుత్వపు గజెట్‌లో ప్రకటించాలి. ఆ ఇంగ్లీషు భాషానువాదం అధికార పాఠంగా పరిగణింప బడుతుంది.

ముందుగా రాష్ట్రపతి అనుమతి పొందకుండా పైన తెలిపిన నిర్దేశాలను సవరించడానికి 1965 వరకు పార్లమెంటు ఉభయ సభలలో ఏవిధమైన బిల్లుగాని, సవరణగాని ప్రతిపాదన చేయడానికి వీలులేదని 349-వ ఆర్టికిలు సూచిస్తుంది. అధికార భాషా విచారణ సంఘం సలహాలను, పార్లమెంటు అధికార భాషా ఉపసంఘ నివేదికను పరిశీలించిన మీదటనే రాష్ట్రపతి అట్టి అనుమతి ఈయవచ్చును.

ప్రత్యేకాదేశాలు

13. ఏ వ్యక్తి అయినా కేంద్రంలోను రాష్ట్రాలలోను వాడుకలలో ఉన్న ఏ భాషలో అయినా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వోద్యోగులలో ఎవరికైనా అర్జీ పెట్టుకోవచ్చునని 350-వ ఆర్టికిలు సూచిస్తుంది. భాషా విషయక అల్ప సంఖ్యాక వర్గాలకు వారి మాతృ భాషలోనే ప్రాథమిక విద్యాభ్యాసానికి తగు సౌకర్యాలు కలుగజేయడానికి ప్రతి రాష్ట్రం, ప్రతి స్థానిక సంస్థ ప్రయత్నిం చాలని 350-వ ఆర్టికిలులోని (అ) సబ్ క్లాజు ఆదేశిస్తుంది.

హిందీ భాషా వ్యాప్తికి ఏర్పాట్లు చేయడం వైవిధ్య పూర్ణమైన భారతీయ సంస్కృతికి సంబంధించిన సర్వ వ్యవహారాలలో వాడదగిన భాషగా దానిని రూపొందించడం కేంద్ర ప్రభుత్వ విధులని 351-వ ఆర్టికిలు నిర్దేశిస్తుంది.

రాజ్యాంగ పరిష్కారంలోని ప్రధానాంశాలు.

14. రాజ్యాంగంలో చేయబడిన పరిష్కారంలో గమనింప దగిన ప్రధానాంశాలు:

(1) కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలోను, రాష్ట్రాలకు కేంద్రానికి మధ్య నడిచే వ్యవహారాలలోను, రాష్ట్రానికి రాష్ట్రానికి మధ్య వ్యవహారాలలో మాత్రమే ఇంగ్లీషు భాషకు బదులు హిందీని వాడుకలోకి తీసుకు రావాలి. రాష్ట్రంలో వాడుకలో ఉన్న భాషనుగాని, భాషలనుగాని ఆ రాష్ట్ర ప్రభుత్వ వ్యవహార భాషగా, లేక భాషలుగా నిర్ణయించే అధికారం రాష్ట్ర శాసన సభకు ఉన్నది. ఈ నిర్ణయం శాసన రీత్యా జరగాలి.

(2) హిందీని అధికార భాషగా వాడుకలోకి తీసుకొని రావడం క్రమేపి దశలవారీగా జరగాలని రాజ్యాంగం స్పష్టంగా సూచిస్తుంది. ప్రథమ దశలో రాష్ట్రపతి ఉత్తరువు ప్రకారం అందులో నిర్దేశించిన వ్యవహారాలలో ఇంగ్లీషుతో పాటు హిందీనికూడా వాడుకలో పెట్టాలి. అనంతర దశ, ఇంగ్లీషు వాడకంపై ఆంక్షలు విధించి క్రమంగా కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో ఇంగ్లీషు స్థానంలో హిందీని వాడుకలోకి తీసుకు రావడం. రాజ్యాంగం అమలులోకి వచ్చినది మొదలు 15 సంవత్సరాలలోగా, అనగా 1965 లోపున, ఒక అధికార భాషా విచారణ సంఘం, పార్లమెంటు ఉభయ సభల ఉపసంఘం ఈ సమస్యను పరిశీలించిన మీదటే అట్టి ఆంక్షలు విధించాలి. ఈ మార్పు ఎంత శీఘ్రంగా

జరగ వలసినది నిర్ణయించేటప్పుడు భారత దేశ పారిశ్రామిక, సాంస్కృతిక, వైజ్ఞానికాభ్యుదయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. ప్రభుత్వోద్యోగాల విషయంలో హిందీ వాడకంలో లేని ప్రాంతాలలోని ప్రజల సమంజసమైన కోర్కెలను, వారి యోగక్షేమాలను విచారించాలి.

(3) 1965 లోగా హిందీ కేంద్ర ప్రభుత్వ అధికార భాష కావాలని నిర్దేశించిన ప్పటికీ, తదనంతరం కూడా ఇంగ్లీషును వాడకంలో ఉంచడం అవసరం కావచ్చును అనే భావంతో, అలా వాడుకలో ఉంచడానికి పార్లమెంటుకు అధికారం ఈయబడింది. ఏయే వ్యవహారాలలో ఇంగ్లీషును వాడుకలో ఉంచ వలసినదీ పార్లమెంటు శాసనం ద్వారా నిర్ణయిస్తుంది.

(4) న్యాయనిర్ణయములోను హైకోర్టులలోను ఇంగ్లీషుకు బదులు హిందీని, ఇతర జాతీయ భాషలను ప్రవేశపెట్టడంలో చిక్కులున్నవని గుర్తించి, ఈ వ్యవ హారాలలో మాత్రం ఈ మార్పు ఫలానా తేదీ లోగా జరగాలని నిర్దేశించ లేదు. 1965 లోగా ఈ నిర్ణయాలను సవరించాలంటే, ముందుగా రాష్ట్రపతి అనుమతి పొందనిదే అందుకోసం పార్లమెంటులో ఏవిధమైన బిల్లును ప్రవేశ పెట్టరాదనీ, అధికార భాషా విచారణ సంఘం సలహాలను పార్లమెంటు ఉప సంఘ నివేదికను పరిశీలించిన మీదటనే రాష్ట్రపతి అట్టి అనుమతి ఈయ తగునని మరొక రక్షణకూడా కల్పించబడింది.

(5) ఏ వ్యక్తి అయినా తన కష్ట సుఖాలను తెలుపుతూ కేంద్ర ప్రభుత్వాధికారుల కెవరికైనా కేంద్రంలోను, ఆ రాష్ట్రంలోను వాడుకలో ఉన్న ఏ భాషలోనయినా దరఖాస్తు చేసుకోవచ్చును. భాషా విషయక అల్ప సంఖ్యాక వర్గాలవారి పిల్లలకు మాతృ భాషలోనే ప్రాథమిక విద్యాభ్యాసానికి తగిన సౌకర్యాలు కలిగించాలని వివిధ రాష్ట్రాలు, స్థానిక సంస్థలు ఆదేశింపబడినవి.*

(6) హిందీ భాషా వ్యాప్తికి తగు ఏర్పాట్లు చేయడం, బహుముఖవికాసంగల భారతీయ సంస్కృతికి సంబంధించిన సర్వ వ్యవహారాలలో వాడదగిన భాషగా దానిని రూపొందించడం కేంద్ర ప్రభుత్వ విధి అని నిర్దేశింపబడింది.

15. పై పేరాలలో సూచించిన రాజ్యాంగ పరిష్కార మార్గం ఒక సమగ్రమైన, సర్వ వ్యాప్తమైన ప్రణాళిక. రాజ్యాంగ పరిషత్తు నిశిత పరిశీలనానంతరం దీన్ని రూపొందించింది. దేశంలోని వివిధ భాషా వర్గాల అభిప్రాయాలను ఈ ప్రణాళిక సాధ్యమయినంతవరకు సమన్వయ పరుస్తూండటం వలన రాజ్యాంగ- పరిషత్తులో ఈ పరిష్కారానికి వ్యతిరేకంగా ఎవ్వరూ వోటు చేయలేదు. ప్రభుత్వ వ్యవహారాలలో హిందీని, ఇతర జాతీయ భాషలనుకూడా వాడుక చేయడానికి ఈ ప్రణాళికలో అవకాశ మీయ బడింది. ఇంగ్లీషు స్థానంలో హిందీని కేంద్ర ప్రభుత్వ అధికార భాషగా వాడుకలోకి తీసుకు రావడానికి సూచించిన క్రమ విధానము మార్పులకు, కూర్పులకు వీలుగా రూపొందింపబడింది. ఆ విధంగా అన్ని వర్గాల అభిప్రాయాలకు ఉచితమైన గౌరవం లభించింది. ఈ సూచనల ననుసరించి కేంద్ర ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వాలు అప్పుడే కొన్ని చర్యలు తీసుకొన్నవి. అందువలన ఈ పరిష్కార మార్గాన్ని అనుసరించడమే, శ్రేయోదాయకమైన, సుసాధ్యమైన పద్ధతి అని సమస్యను గురించి క్షుణంగా చర్చించిన మీదట ఈ ఉపసంఘం గట్టిగా అభిప్రాయ పడుతున్నది.

రాజ్యాంగ పరిష్కారం—సమగ్రమైన ప్రణాళిక.

* 1956-లో చేయబడిన రాజ్యాంగ సప్తమ సంస్కరణ శాసనంలో 21-వ సెక్షనునుండి ఉదాహృతం.

ఇంగ్లీషు స్థానంలో హిందీని, ఇతర జాతీయ భాషలను వాడవలసిన అగత్యం.

16. ప్రభుత్వ వ్యవహారాలలో ఇంగ్లీషు భాష వాడకాన్ని తగ్గించి వేయాలనే రాజ్యాంగ పరిషత్తు సూచించిన ఈ పరిష్కార మార్గం యొక్క తాత్పర్యం. ప్రజా స్వామిక ప్రభుత్వం ప్రజానీకంలో బహుకొద్ది మందికి మాత్రమే బోధపడే భాషలలో చిరకాలం వ్యవహరించ జాలదు. శ్రేయో రాజ్య లక్ష్యాలను, సమాజవాద పద్ధతిని అనుసరించే మన దేశంవంటి ఏ దేశంలోనయినా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు ఇంచుమించు పౌర జీవనంలోని సర్వ విషయాలతో ప్రమేయం ఉంటుంది. అందువల్ల ప్రభుత్వ వ్యవహారాలు సమర్థతతో సాగాలంటే, ప్రజల్లో ఎక్కువ మందికి అర్థమయ్యే భాషలో వ్యవహరించడం అవసరం. కనుక, ప్రజలలో ఎక్కువ మందికి పరిచితమైన భాషను అధికార భాషగా స్వీకరించడం అవసరం. ఆ విధంగా, ప్రభుత్వ కార్య కాలాపాలు ప్రజలలో సాధ్యమయినంత ఎక్కువ మందికి అర్థమయ్యే భాషలో సాగించాలి. రాష్ట్రాలలో ఇంగ్లీషుకు బదులు ఆయా ప్రాంతీయ భాషలకు సముచిత స్థానం ఇవ్వాలి. అదే విధంగా, భారతీయ భాషలలో ఏదో ఒకటి కేంద్ర ప్రభుత్వ అధికార భాషగాను, అంతరాష్ట్రీయ వ్యవహార భాషగాను ఏర్పాటు కావాలి. ఈ దేశ జనాభాలో ఎక్కువ మందికి హిందీ మాతృ భాష. ఇతర భాషలు మాట్లాడే ప్రాంతాలలోకూడా చాలా ప్రదేశాలలో హిందీ అర్థమవుతుంది. ఇంచుమించు దేశంలో సర్వత్ర, యాత్రా స్థలాలలోను, బజారులలోను హిందీ భాష అర్థ మవుతుంది. హిందీ భాష మాతృ భాషగా లేని ప్రాంతాలకుకూడా హిందీ వ్యాప్తమవుతూండడం చరిత్రలో జరుగుతూన్న విషయము. ఇటీవల జాతీయోద్యమ కాలంలో హిందీ విశేషంగా వ్యాప్తి అయింది. యాత్రా, వాణిజ్య వ్యవహారాలలో జరుగుతూన్న పరిణామాల వల్ల, ప్రజానీకానికి మనోరంజకములైన రేడియో, సినిమాల వల్లను హిందీ భాషే ప్రాంతాలలోను ఇతర ప్రాంతా లలోనూ గల పాఠశాలలలోను, కళాశాలల్లోను హిందీ భాషను ప్రవేశ పెట్టడం వల్లను, ఈ భాషా వ్యాప్తికి మరికొంత దోహదం జరుగుతున్నది. సాంస్కృతిక, సాంప్రదాయిక సామరస్యం వల్లను, ఇతర కారణాలవల్లను, భారతీయ భాషల నడుమ సన్నిహిత సంబంధ బాంధవ్యాలు ఏర్పడి ఉన్నవి. హిందీ శబ్దాలు, శైలి, అక్షర సమామ్నాయము ఇతర భారతీయ భాషలకు ఇంగ్లీసు కన్న చాలా సన్నిహితమైనవి. ఈ సౌకర్యం ఏ విదేశీయ భాషకు ఉండదు. అందువల్ల హిందీ భాష వాడుకలో లేని ప్రాంతాల ప్రజలు హిందీ నేర్చుకోవడం చాలా సులభం.

ఇంగ్లీషును శాశ్వతంగా నిలపడానికి వీలు లేదనడానికి హేతువులు— జాతీయ భావము.

17. స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి, దేశ మంతట హైస్కూళ్లలో ఇంగ్లీషుకి బదులు భారతీయ భాషలలో విద్యాభ్యాసానికి ఏర్పాట్లు చేస్తున్నారు. కొన్ని విశ్వవిద్యాలయాలలోకూడా ఇంగ్లీషుకు బదులు హిందీలోను, ఇతర భాషలలోను విద్యాభ్యాసానికి ఏర్పాట్లు జరిగినవి. మాతృ భాషలోగాని, ప్రాంతీయ భాషలోగాని విద్యా బోధనకు ఏర్పాటు చేయడంవల్ల, విద్యాభ్యాసం చాలా సుకరమవుతుంది. ఈ విధంగా ప్రస్తుతం విద్యాభ్యాసం చేస్తున్న తరం వారిలో ఇంతవరకు వెనుకటి తరాల వారిలోకన్న ఇంగ్లీషు భాషా జ్ఞానం చాలా తక్కువగా ఉంటుంది.

ఇప్పటికి ఏడు రాష్ట్రాలలో ఇంగ్లీషు భాష స్థానే ఆయా ప్రాంతీయ భాషలే అధికార భాషలుగా వాడుక చేయబడుతున్న సంగతి ఈ ఉప సంఘం గుర్తించింది. దేశంలో ప్రజాభిప్రాయ ధోరణినిబట్టి, మిగిలిన రాష్ట్రాలుకూడా త్వరలోనే వాటిని అనుసరించగలవని గట్టిగా నమ్మవచ్చు. కడచిన పది సంవత్సరాలలో ఈ దేశంలో ఇంగ్లీషు భాషా జ్ఞానం క్రమంగా సన్నిగిల్లుతూ రావడం వల్ల, ప్రభుత్వ కార్యకలాపాలను ఇంగ్లీషులో సమర్థతతో నిర్వహించగల ఉద్యోగులు దొరకడం ఇప్పటికే కొంతవరకు కష్టంగా ఉన్నది. మరికొంత కాలం గడచి, విద్యా సంస్థలలోను, రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలలోను ఇంగ్లీషుకు బదులుగా భారతీయ భాషలు ఇంకా ఎక్కువగా వాడుకలోకి వచ్చినప్పుడు ఈ సమస్య మరింత తీవ్రరూపం దాలుస్తుంది.

రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలలోను, పాఠశాలలలోను, కళాశాలలలోను క్రమంగా ఇంగ్లీషు స్థానంలో ఆయా ప్రాంతీయ భాషలు వాడుకలోకివస్తే, వివిధ భాషా ప్రాంతాల నడుమ జరిగే వ్యవహారాలలో ఇంతవరకు వాడుకలో ఉన్న ఇంగ్లీషు భాష, ఆ పనికి ఏ మాత్రం సక్రమంగా ఉపయోగపడలేనిదవుతుంది.

కనుక, ఇంగ్లీషు బదులు హిందీని, ఇతర భారతీయ భాషలను వాడుక చేయడం అవసరం. అయితే వ్యక్తిగతంగాను, జాతీయ జీవనంలోను పౌరుల అభిరుచులకు కొంత ప్రాధాన్యం ఉంది. అభిరుచి ఉత్సాహశక్తిప్రేరకం. అంతర్రాష్ట్రీయ వ్యవహారాలలోను, అఖిల భారత వ్యవహారాలలోను ఇటీవల కొంతకాలంగా ఇంగ్లీషు పరస్పర వ్యవహార భాషగా వినియోగపడుతున్న మాట వాస్తవం. అందులో కొన్ని సౌకర్యాలుకూడా లేక పోలేదు. అయినా, ఇంగ్లీషు స్థానంలో ఎక్కువ మంది ప్రజలకు బోధపడే భారతీయ భాషను కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వాలకు మధ్య నడిచే వ్యవహారాలలోను, కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలోను అధికార భాషగా ప్రవేశ పెట్టడం జాతీయాభిరుచికి అనుకూలతరమైన పని. భారతీయులు ఒకే విధమైన సంప్రదాయాలు, సంస్కృతి, నాగరకతగలవారు గనుక భారతీయ భాషనే ఉమ్మడి వ్యవహార భాషగా వాడుక చేయడం వల్ల విభిన్న భాషా వర్గాల నడుమ ఇతోధిక సాన్నిహిత్యం ఏర్పడుతుంది. విశిష్టమైన చరిత్ర, విలక్షణమైన సంస్కృతిగల భారత దేశం దీర్ఘకాలం విదేశ భాషలో వ్యవహరించ జాలదు.

పైన తెలిపిన హేతువుల దృష్ట్యా ఈ ఉపసంఘం ఈ విధంగా అభిప్రాయపడుతున్నది. హిందీ భాషను కేంద్ర ప్రభుత్వ అధికార భాషగా ప్రవేశపెట్టే కార్యక్రమం పరిస్థితుల అనుకూల్యాన్ని మించిన వేగంతో సాగకూడదు. అయితే హిందీ భాష, ఇతర జాతీయ భాషలు ఆయా రంగాలలో సహజ పరిణామ క్రమంలో ఇంగ్లీషు స్థానం ఆక్రమించడానికి తగు సమర్థమైన చర్యలు తీసుకొనక పోవడమూ యుక్తం కాదు. ఈ మధ్య కాలంలో ప్రతిష్టంభన పరిస్థితి మాత్రం ఏర్పడకుండా జాగ్రత్తపడాలి.

18. హిందీ భాష, ఇతర జాతీయ భాషలు ఇంగ్లీషు స్థానంలో అధికార భాషలుగా వినియోగపడటానికి తగినంత సటిష్ఠమైనవి కావన్న విమర్శ అప్పుడప్పుడు వినపడుతూంది. పూర్వం ఈ దేశంలో ఈ భాషలన్నీ సర్వవ్యవహారాలలో అధికార భాషలుగా ఉపయోగపడినవనీ, గ్రామాలలోను, తహశీల్లలోను, కొంతవరకు జిల్లా స్థాయిలోను ఇప్పటికీ ఉపయోగపడుతూన్నవనీ తెలియచెప్పవలసిన అవసరం లేదు. ఇటీవలివరకు స్వదేశ సంస్థానాలుగా ఉన్న ప్రాంతాలలో భారతీయ భాషలే అధికార వ్యవహారా లన్నిటికీ ఉపయోగపడుతూ ఉండేవి. ఈ భాషలకు ఉన్నతాధికార వ్యవహారాలలో ఉపయోగపడదగిన యోగ్యత సహజంగా లేదని చెప్పడంకూడా భావ్యంకాదు. ఈ భాషలు ఉన్నతాధికార వ్యవహారాలకు ప్రస్తుతం అశక్తంగా కనబడడానికి కారణం, నూరేండ్లకు పైగా కేంద్రంలోను, రాష్ట్రాలలోను ఇంగ్లీషే అధికార భాషగాను, ఉన్నత విద్యా భాషగాను, వాడుక చేయబడుతూండటం. అందువలన, ఈ భాషలు ఆ వ్యవహారాలలో వాడుకలో లేక వెనుక పడినవి. వాడకంవలన భాష వృద్ధి అవుతుంది; నవీనాభిప్రాయాలు, భావాలు, భావనా పద్ధతులు అలవరచు కొనవలసిన అగత్యం ఉంటే, ఇతర భాషలనుండి గ్రహించడంద్వారాను, కొత్తగా సృజించుకొవడం ద్వారాను, భాషా మడికారాలు, పారి భాషిక పదావళి అభివృద్ధి అవుతవి. కనుక, హిందీ భాషలోను, ఇతర భాషలలోను ఇప్పుడున్న లోపాలు ఆ భాషలను కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలలోను, ఇతర జాతీయోద్యమాలలోను వాడుకలో పెట్టడం వల్లనే సవరింపబడుతవి.

ప్రభుత్వ వ్యవహారాలలో ఇంగ్లీషు స్థానే ఉపయోగపడగల హిందీభాష—ఇతర భారత జాతీయ భాషలు.

భారత దేశ సంకీర్ణ సంస్కృతికి అనువైన భాషగా హిందీ అభివృద్ధి.

19. భారతీయుల సంకీర్ణ సంస్కృతికి చెందిన సర్వవ్యవహారాలలో ఉపయోగపడగల భాషగా హిందీని పెంపొంద చేయాలని సూచిస్తూన్న 351 వ ఆర్టికిలుకి ఈ ఉపసంఘం తను ప్రాముఖ్యం ఇస్తున్నది. హిందుస్థానీ భాషలోను, ఎనిమిదవ అనుబంధంలో పేర్కొనబడిన ఇతర భారతీయ భాషలలోనుగల రూపాలను, శైలిని, నుడికారాలను హిందీ భాషలోకి స్వీకరించాలని, అవసరమైనప్పుడు, ఉచితమని తోచినప్పుడు సంస్కృత శబ్దాలను, ఇతర భాషల శబ్దాలను గ్రహించాలనీ స్పష్టంగా నిర్దేశింప బడింది. సంస్కృత భాషనుంచి, ఇతర భారతీయ భాషలనుంచే కాక, పెర్షియన్, అరబిక్, ఇంగ్లీషు భాషలనుంచి అనేక పదాలను స్వీకరించి హిందీ భాష చిరకాలంగా అభివృద్ధిచెందింది. హిందీ వ్యాకరణ స్వరూపంకూడా ఇతర భాషా సంపర్కం వల్ల చాలా మార్పుచెందింది. ఇంగ్లీషుతో సహా ప్రపంచ మహా భాషలన్నీ ఇట్లే ఇతర భాషలలో రూపొందిన విలక్షణ నుడికారాలను, పదాలను విశేషంగా స్వీకరించినవి. భారత దేశం బహు భాషా భరితమయినది. కనుక, హిందీ సమర్థమయిన అంతరాష్ట్రీయ వ్యవహార భాషగాను, దేశంలోని వివిధ భాషా ప్రాంతాల ప్రజల నడుమ సముచితానుబంధంగాను ఉపయోగపడాలంటే, మార్పులు, కూర్పులు, ఎదుగుబొదుగులు లేకుండా వైదొలగి ఉండటానికి వీలులేదు. ఇటీవల కొన్ని సంవత్సరాలుగా హిందీ భాషలో క్లిష్టమైన పదబంధాల వాడుకవలన హిందీ భాషా వ్యాప్తికి, వివిధ కార్యకలాపాలలో దానిని ఎక్కువ వాడుకలోకి తీసుకొని రావడానికీ కొంత అంతరాయం కలిగింది. క్లిష్టమైన భావాలను వ్యక్తం చేయవలసి వచ్చినప్పుడు భాషాక్లిష్టతకూడా కొంతవరకు అనివార్యం అని ఒప్పుకోక తప్పదు. కాని ఏ భాషలోనయినా కొందరు మహారచయితలు సులభ రూపాలనే వాడుతూ ఉంటారు. ఒక పదంగాని, పదజాలంగాని మంచిది అనడానికి సరియైన పరీక్ష అది ఎంత ఎక్కువమందికి అర్థం అవుతుందో పరిశీలించడమే అనాలి. కేంద్ర ప్రభుత్వ అధికార భాషగాను అంతరాష్ట్రీయ వ్యవహార భాషగాను వాడుకచేయడానికి హిందీకిగల యోగ్యత కూడా ఆ భాష తేలికగా అర్థమయేది, దేశంలో ఎక్కువ మంది వాడుతూన్నది అవడమే. ఏదో ఒక భారతీయ భాషనే ఈ దేశపు అధికార భాషగా చేయాలని వాదిస్తూన్న వారందరు ఆ భాష సాధ్యమయినంతవరకు ప్రజా సామాన్య భాషగా ఉండాలనికూడా ప్రతిపాదిస్తున్నారు. అందువల్ల, హిందీ సామాన్య ప్రజానీకంతో సంబంధాన్ని సడలించు కొనకుండా, స్పష్టమైన సులభమైన శైలినే ఎక్కువగా ప్రోత్సహించాలి.

హిందీకి, ఇతర జాతీయ భాషలకు స్పర్థ లేదు.

20. హిందీకి ఇతర జాతీయ భాషలకు స్పర్థ ఏర్పడడం అసంభవం. భారత దేశం సంకీర్ణ సంస్కృతి గలది గనుక, ఆ వైవిధ్యం ఆయా ప్రాంతాలలో వాడుకలో ఉన్న వేఱువేఱు భాషల ద్వారా వ్యక్తం కావడమే ఉచితం. అయితే వాటిలో అంతర్గతంగా ఉన్న సమతా సామరస్యాలు అఖిల భారత వ్యవహారాలలోను అంత రాష్ట్రీయ వ్యవహారాలలోను ఉపయోగపడే ఒక ఉమ్మడి భాష ద్వారా వ్యక్తం కావాలి. నూరేండ్లకు పైగా విద్యా సంస్థలలో ప్రధాన బోధన భాషగాను, ప్రభుత్వ వ్యవహార భాషగానూ ఉంటూ వచ్చిన ఇంగ్లీషు భాషను ఆ స్థానంనుంచి తొలగించివేసిన పిదప అన్ని రంగాలలోను హిందీ భాష, ఇతర భారతీయ భాషలు పూర్తిగా వాడకంలోకి రాక తప్పదు. అందువల్ల ఈ భాషలన్నింటికీ నూతన వికాసం కలుగుతుంది. పరస్పర సంబంధం వల్లను, సామరస్యం వల్లను ఒక భాషకు కలిగిన వికాసం, ఇతర భాషలకు కూడా సంక్రమిస్తుంది.

కొన్ని రంగాలలో ఇంగ్లీషుకు ప్రత్యేక స్థానం.

21. ప్రభుత్వ కార్యకలాపాలలో ఇంగ్లీషు స్థానంలో క్రమేపి హిందీని ఇతర ప్రాంతీయ భాషలను ప్రవేశ పెట్టినప్పటికి నిజానికి ఇంగ్లీషు భాషతో మనం పూర్తిగా తెగతెంపులు చేసుకొన బోవడం లేదు. వైద్య, వైజ్ఞానిక శాస్త్ర రంగాలలోను, అంతర్జాతీయ సంబంధ బాంధవ్యాల లోను ఇంగ్లీషు ఇప్పుడు వాడుకలో ఉన్నట్టే ఇక ముందుకూడా ఉంటుంది. అందుకోసం, ప్రస్తుత స్థితి యథాతథంగా శాశ్వతంగా ఉండ నవసరం లేదు. విజ్ఞానశాస్త్రాభివృద్ధి, సాంకేతిక

పరిణామాలు అతివేగంగా సాగుతున్న రోజులివి. ఇక ముందు ఈ విజ్ఞాన శాస్త్రం, సాంకేతిక నైపుణ్యం క్రమేపి ఇంకా ఎక్కువ చురుకుగా సాగవచ్చు. ఇవి మన జాతీయ జీవితంలో చాలా ప్రముఖ స్థానం ఆక్రమించ బోతున్నవి. ఈ విషయాలను గురించిన గ్రంథజాలం అపారంగాఉన్నది. వాటిలో ముఖ్యమైన గ్రంథాలను, వ్యాసాలను అన్నిటినీ అనువాదం చేసుకొనడం సాధ్యం కాక పోవచ్చు. అందువల్ల విజ్ఞాన శాస్త్రం, సాంకేతిక శాస్త్రం అభ్యసించే పండితు లందరికి విదేశ భాషా పరిచయం అవసరం. ఇంగ్లీషు భాషలో అపార సారస్వతం ఉన్నది. పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులతో ఆ భాషకు సన్నిహితానుబంధం ఉన్నది. విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలకు ప్రస్తుతమది ఆటపట్టు. పైగా, నేడు ప్రపంచంలో భాగా విస్తృతంగా నాడుకలో ఉన్నది. అందువల్ల, ఇంగ్లీషు భాషకుగల ప్రాధాన్యం, ప్రయోజనం, ఆ భాషతో మనకు ప్రస్తుతంగల పరిచయం దృష్ట్యా విదేశ భాష లన్నిటిలో ఇంగ్లీషే మనకు ఉపయుక్తమైన భాష. కనుక, మన పాఠశాలలలోను, కళాశాలలలోను, బోధన భాషగాను, కేంద్రంలోను రాష్ట్రాలలోను, ప్రభుత్వ అధికార భాషగాను ఇంగ్లీషు ఇక ఎక్కువ కాలం ఉపయోగపడక పోయినప్పటికీ, ఆ భాష మనకు విశేష సహకారిగాను, ముఖ్యంగా విజ్ఞాన శాస్త్రంలో ఉన్నత విద్యాభ్యాసం చేసేవారు ప్రత్యేకంగా అభ్యసించే భాషగాను ఉంటుంది.

శాస్త్రీయ, సాంకేతిక పారిభాషిక పదాల సంఖ్య ఇప్పటికే లక్షలలోకి పెరిగింది. ఏటేట వేలకొలది క్రొత్త పదాలు సృష్టి అవుతున్నవి. మన శాస్త్రవేత్తలకు, సాంకేతిక నిపుణులకు ఇంగ్లీషు పారిభాషిక పదాలతో పరిచయం ఉన్నది. ఈ శాస్త్రీయ సాంకేతిక పారిభాషిక పదాలను భారతీయ భాష లన్నిటిలోకి అనువదించడం పెద్ద పని. అట్టి అనువాదాలు కృత్రిమంగాను, అసమర్థమైనవిగాను, నేటి శాస్త్రవేత్తలకు సాంకేతిక ప్రవీణులకు దురవగాహములుగాను తయారయ్యే ప్రమాదం కూడా ఉన్నది. కనుక, ఈ విషయంలో చాలా జాగరూకత అవసరం. భారతీయ భాషలలో దేనికి దానికే వేరువేరుగా పారిభాషిక పదాలు తయారు అయితే అయోమయ స్థితి ఏర్పడి, దేశంలో శాస్త్ర సాంకేతిక విజ్ఞాన వినిమయం దుష్పాదం కావచ్చు. అందువలన, శాస్త్ర సాంకేతిక పరిభాష, భారతీయ భాష లన్నింటిలో ఒకే విధంగా ఉండడం మంచిది. విశ్వవిద్యాలయ విద్యను గురించిన రాధాకృష్ణన్ విచారణ సంఘంకూడా ఈ సమస్యను పరిశీలించి, ఈ అభిప్రాయమును వెలువరచినది.

> "అన్యభాషా పదాలను స్వీకరించడాన్ని గురించిన ఈ చర్చ పారిభాషిక పదాలను ముఖ్యంగా ప్రాకృతిక శాస్త్రాలలోని పదాలను గురించిన సమస్యకు దారి చూపుతుంది. ఇది విలక్షణమైన సమస్య. ఈ సమస్య ఆధునిక రాష్ట్రీయ భాష లన్నిటికీ ఉన్నది. కనుక, అన్నిటికీ ఉమ్మడిగా ఒకే పరిష్కార మార్గం సాధించ గలిగితే ఎంతో శ్రమ తగ్గించడం, వివిధ రాష్ట్రీయ భాషలను పరస్పరం సన్నిహితం చేయడంకూడా జరుగుతుంది."

కనుక, హిందీలోను ఇతర జాతీయ భాషలలోను శాస్త్ర సాంకేతిక పారిభాషిక పదాలు మన దేశంలో శాస్త్ర సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి సహకారులుగాను, అంతర్జాతీయ శాస్త్ర సాంకేతిక విజ్ఞానంతో మనం సన్నిహిత సంబంధం ఏర్పరచుకొనడానికి ఉపకరించేవిగాను ఉండాలి. ఇందుకోసం హిందీలోను, ఇతర జాతీయ భాషలలోను ఈ పారిభాషిక పదాలన్నీ ఇంగ్లీషు పదాలకుగాని, అంతర్జాతీయ పరిభాషకుగాని సాధ్యమయినంత సన్నిహితంగా ఉండాలని ఈ ఉపసంఘం సూచిస్తున్నది. శాస్త్ర సాంకేతిక పరిభాష ఆదినుంచి సక్రమమైన పద్ధతిలో రూపొందించబడడం చాల అవసరం. అందుకోసం, శాస్త్ర వేత్తలతోను, సాంకేతిక ప్రవీణులతోను నిండిన ఒక

స్థాయీ సంఘాన్ని ఏర్పాటు చేయడం మంచిది. ఈ సంఘం ఆయా రంగాలలో జరిగిన కృషిని పర్యవేక్షిస్తూ, సమన్వయ పరస్తూ, అప్పటివరకు జరిగిన పనిని సమీక్షిస్తూ భారతీయ భాష లన్నిటిలో ఉపయోగింప దగిన శాస్త్ర సాంకేతిక పరిభాషా సట్టికలను ప్రచురిస్తూ ఉండాలి.

ఈ మార్పు జరుపవలసిన విధానం.

22. ఇంగ్లీషు స్థానే హిందీని ఇతర ప్రాంతీయ భాషలను వాడుక చేయవలసిన ఆవశ్యకతను, అనివార్యతను గుర్తిస్తూ, ఈ మార్పు జరగడానికి దగిన విధానాన్ని ఇక జాగ్రత్తగా పరిశీలించాలి.

కేంద్ర ప్రభుత్వ కార్యకలాపాలు అనేక విషయాలకు సంబంధించి, శాఖోపశాఖలుగా విస్తరించి ఉండి, అనేక స్థాయిలలో నిర్వహింప బడుతున్నవి. వాటిని నిర్వహించే ఉద్యోగులు వేలువేలు భాషా ప్రాంతాలకు చెందినవారు, సహజంగా భిన్న భిన్న స్థాయిల భాషా జ్ఞానంగలవారు అయి ఉన్నారు. పైగా, కేంద్ర ప్రభుత్వ కార్యకలాపాలలో ప్రజలకు సంబంధించిన వ్యవహారాలూ, రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించినవీకూడా ఉండటం వలన, విడివిడిగాను, సమష్టిగాను దేశంలోని వివిధ భాషా ప్రాంతాలతో వ్యవహరించ వలసి వస్తుంది. కనుక, కేంద్ర ప్రభుత్వంలో నూతన అధికార భాషను వాడుకచేసే ఉద్యమానికి, రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలలో ఒక క్రొత్త భాషను అధికార భాషగా చేయడానికి విస్తృతిలోను, స్వరూపంలోనుకూడా చాల వ్యత్యాసం ఉంది. కేంద్ర ప్రభుత్వ వ్యవహార భాషగా ఇంగ్లీషు స్థానంలో హిందీని వాడుకలోకి తీసుకువచ్చే కార్యక్రమం జాగ్రత్తగా ఎక్కడా అవ్యవస్థ స్థితి ఏర్పడకుండాను అమలుజరపబడాలి. ఈ మార్పుకు కార్య కాల క్రమాలు నిర్ణయించేటప్పుడు, అమలు జరిపేటప్పుడు, అడుగడుగునా హిందీ భాషా ప్రాంతాలుకాని ప్రదేశాలలో హిందీ భాషా వ్యాప్తి ఎంతవరకు సాగినదీ. ప్రభుత్వోద్యోగాలు చేస్తున్న వారిలో ఆ భాషా జ్ఞానం ఎంతవరకు వచ్చినదీ మొదలగు విషయాలు గమనిస్తూ ఉండాలి. ఈ మార్పు జరుగుతూన్న కాలంలో ఉద్యోగాలలోకి కొత్తవారిని ఎంచు కొనడంలో ఏ భాషా ప్రాంతం వారికీ అసంతృప్తి కలుగకుండా చూడాలి.

1965-లోగా పూర్తిగా హిందీని వాడుక చేయడం సాధ్యంకాదు.

23. ప్రథమ దశలో ఇంగ్లీషుకు తోడుగా హిందీనికూడా వాడుకలో పెట్టాలి. వివిధ, కార్యకలాపాలలోనుండి క్రమంగా ఇంగ్లీషును తొలగించివేసే రెండవ దశకు తగిన సన్నాహాలుకూడా ఈ దశలోనే చెయ్యాలి. ఇంగ్లీషుకు బదులు హిందీ భాష పూర్తిగా వాడుకలోకి వచ్చే తేదీ ఈ కార్యక్రమపరాకోటిని సూచిస్తుంది. అంతేగాని అది మరొక దశకాదు. కనుక ఆ తేదీని ఈ కార్యక్రమానికి అవధిగా పరిగణించకూడదు, ఈ సమస్యను పరిష్కరించే విధానం ఆచరణ సాధ్యమయినది, మార్పు కూర్పులకు అవకాశం గలదీ కావాలి. 1965 వరకు కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో ఇంగ్లీషే ప్రధాన అధికార భాషగాను హిందీ రెండవ అధికార భాషగాను ఉంటుంది. 1965 తరువాత హిందీ ప్రధాన అధికార భాషగాను, ఇంగ్లీషు రెండవ అధికార భాషగాను ఉంటుంది. ఏయే కార్య కలాపాలలో ఇంగ్లీషును వాడవలసినది, పార్లమెంటు శాసనం ద్వారా నిర్ణయిస్తుంది. ఆ విధంగా అవసరమయినంతకాలం ఇంగ్లీషు వాడకంలో ఉంటుంది.

కార్యక్రమ నిర్ణయావశ్యకత.

24. ఈ మార్పు క్రమ క్రమంగాను, దశలవారీగాను జరగవలసి నప్పటికీ, ఈ మార్పుకు అవసరమైన సన్నాహ చర్యలలో అశ్రద్ధగాని, కాలవిలంబనంగాని జరగనీయకూడదనే విషయం ముఖ్యమైనది. సక్రమంగా యోచించి తయారుచేసిన కార్యక్రమం ప్రకారం పని సాగిస్తూ ఉంటే, మధ్యలో చిన్న చిన్న ఇబ్బందులు ఏర్పడినా, తేలికగానే పరిష్కరించుకోవచ్చు. విచారణ సంఘం సలహాలపై ఈ ఉపసంఘం తెలుపుతున్న అభిప్రాయాలు, అట్టి ఆచరణీయమైన కార్యక్రమానికి ప్రాతిపదిక కాగలవని ఈ ఉపసంఘం ఆశిస్తున్నది.

---

# మూడవ అధ్యాయం

## విచారణ సంఘం సలహాలపై ఉపసంఘం అభిప్రాయాలు

అధ్యాయంలోని విషయం.

25. ఈ అధ్యాయంలోని ప్రథమ భాగం : విచారణ సంఘం తన విచారణీయాంశాల వారీగా ఇచ్చిన సలహాలలో ప్రధానమైన అంశాల వివరణ. దానిని రెండవ భాగంలో కలిపి చదువుకోవాలి. రెండవ భాగంలో విచారణ సంఘం నివేదికలోని సలహాలన్నిటినీ ఆదే వరుసలో ఉదహరించి ఆ ప్రక్కనే ఆయా సలహాలపై ఈ ఉపసంఘం అభిప్రాయాలు తెలుపబడినవి.

### ప్రథమ భాగము

### 1-వ సెక్షను

### కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో క్రమంగా అధికార భాషగా హిందీ వాడకం

అధికార భాషను మార్పుచేసే కార్యక్రమానికి సన్నాహ చర్యలు.

26. ప్రభుత్వ వ్యవహార భాషను మార్పుచేసే కార్యక్రమానికి ప్రాతిపదికగా ఈ దిగువ సన్నాహాలు అవసరమని ఈ విచారణ సంఘం భావిస్తున్నది:—

(1) ప్రభుత్వ వ్యవహారాలలో వాడే ప్రత్యేక పారిభాషిక పదావళిని తయారుచేసి, స్థిరపరచడం;

(2) నియమాలు, నిబంధనలు, ఉద్యోగనియమ సర్వస్వాలు (*Manuals*) మొదలగు విధానములను వివరించు గ్రంథాలన్నిటినీ హిందీలోకి అనువదించడం;

(3) ప్రభుత్వ కార్యాలయాలలో ఉపయోగపడే యంత్రాలను ఇతర సౌకర్యాలను హిందీకి సన్నద్ధ పరచడం;

(4) ప్రభుత్వోద్యోగులకు హిందీలో శిక్షణ యివ్వడం;

పారిభాషిక పదాలు.

27. హిందీలోను ఇతర జాతీయ భాషలలోను ప్రభుత్వ వ్యవహారాలకు, వైజ్ఞానిక శాస్త్రాలకు సంబంధించిన పారిభాషిక పదాలను తయారు చేయడానికి ఇంతవరకు జరిపిన కృషిని విచారణ సంఘం జాగ్రత్తగా పరిశీలించిన మీదట, పారిభాషిక పదాలను నిర్ణయించడంలో అనుసరించదగిన సూత్రాలను నిర్వచించింది. "భాషా పారిశుద్ధ్య వాదుల" పట్టుదలలను ఖండించింది. స్పష్టత, ఔచిత్య సుబోధకతలను మాత్రమే ప్రధానంగా యెంచాలని సలహా యిచ్చింది. ఈ ఉపసంఘం ఈ సలహాను అంగీకరిస్తున్నది.

గతంలో వాడుకలో ఉన్న పదాలనుగాని, లేక ప్రస్తుతం దేశంలోని వివిధ ప్రాంతాలలో వాడబడుతూన్న పారిభాషిక పదాలనుగాని ఆమోదించడానికి అవకాశమున్నదేమో పరిశీలించాలని ఉచితమైన చోట అంతర్జాతీయ పారిభాషిక పదాలనే భారతీయ భాషలలోకి స్వీకరించడానికి, లేక తగుమార్పులతో కలుపుకొనడానికి యత్నించాలనికూడా విచారణ సంఘం సలహా యిచ్చింది. కేంద్ర ప్రభుత్వ వ్యవస్థలో ఎక్కువగా సాంకేతిక విషయాలతో వ్యవహరించే శాఖలలో అవసరమైనంత కాలం ఇంగ్లీషు పారిభాషిక పదాలనే వాడుతూ ఉండాలని సూచించింది. విచారణ సంఘం చేసిన ఈ సూచనలను స్థూలంగా ఆమోదించడం వలన, ప్రభుత్వ వ్యవహారాలలోను, ఇతరత్రా కూడా, ఇంగ్లీషుకి బదులు హిందీని శీఘ్రంగా వాడుక చేయడానికి అవకాశ మేర్పడుతుంది. ఉచితమైన చోటులలో అంతర్జాతీయ పారిభాషిక పదాలనే స్వీకరించాలని, లేక తగు మార్పులు చేసి కలుపుకోవాలని, కొన్ని రంగాలలో అవసరమైనంత కాలం ఇంగ్లీషు పారిభాషిక పదాలనే

వాడుతూ ఉండాలనీ విచారణ సంఘం వెల్లడించిన అభిప్రాయం 351-వ ఆర్టికిలులో నిర్దేశక సూత్రాలకు అనుగుణంగాను, హిందీలోను ఇతర భారతీయ భాషలలోను ఈ పారి భాషిక పదాల నిరంతరావసరాన్ని తీర్చేదిగాను ఉన్నది.

28. భారతీయ భాషలన్నిటిలోను, ఈ పారిభాషిక పదాలు సాధ్యమయినంతవరకు ఒకే విధంగా ఉండేట్టు రూపొందించాలని, ఈ కృషిని సమన్వయం చేయడానికి తగిన ఏర్పాట్లు చేయాలనీ విచారణ సంఘం సలహా యిచ్చింది. అలా చేయడంవలన, ఇంగ్లీషు స్థానంలో హిందీని, ఇతర భారతీయ భాషలను అమలు జరపడం సులభ సాధ్యం అవుతుందని విచారణ సంఘం అభిప్రాయం. ఈ విధానం వలన, వివిధ జాతీయ భాషల నడుమగల అనుబంధాలు ఇంకా పటిష్ఠం ఆవడం, ఆ విధంగా జాతీయైకమత్య సామరస్యాలు వృద్ధి అవడం జరుగుతుందనికూడా వివరించింది. అందువలన, భారతీయ భాషలన్నిటిలో ఒకే విధమైన పారిభాషిక పదాలను రూపొందించి, వివిధ బాషల స్వరూపానికి, నుడికారానికి అనుగుణమైన మార్పులు చేసుకోవచ్చునని కూడా సూచించింది.

29. ఈ పారిభాషిక పదాలను నిర్ధారణచేసే కార్యక్రమం ఇంకా చురుకుగా సాగించాలని, కేంద్రంలోను వివిద రాష్ట్రాలలోను ఇందుకోసం జరుగుతూన్న కృషిని ఇంకా ఎక్కువగా సమన్వయం చేయాలని విచారణ సంఘం సూచించింది. భారత ప్రభుత్వం, ఇతర అదికార సంస్థలు ఈ సూచన దృష్ట్యా పరిస్థితిని సమీక్షించి, అవసరమైన చర్యలు తీసుకోవచ్చు.

ప్రభుత్వనియమ నిబంధనలు సర్వస్వాలు మొదలగు విధానములను వివరించు గ్రంథములను హిందీలోనికి అనువదించడం.

30. నియమ నిబంధనావళిని వివరించే అధికార గ్రంథాలను హిందీలోకి అనువదింప జేయడానికి జరుగుతూన్న కృషిని పరిశీలించిన మీదట విచారణ సంఘం మరో సూచన చేసింది. ఈ వ్యవహార విధానాలను వివరించే గ్రంథాల అనువాదాలన్నిటిలో ఉపయోగించే భాష సాధ్య మయినంతవరకు ఒకే విధంగా ఉండేట్టు చూడటం అవసరమని సూచించింది. అందుకోసం, ఈ కార్యక్రమ మంతటినీ పర్యవేక్షించడానికి, అవసరమైన సూచనలు చేయడానికి కేంద్ర ప్రభుత్వంలో ఒక ప్రత్యేక కార్యాలయాన్ని ఏర్పాటు చెయ్యాలనికూడా సంహా యిచ్చింది.

ప్రభుత్వ కార్యాలయాలలో జరిగే కార్యకలాపాలలో చాలా భాగం వివిధ శాఖల నియమ సర్వస్వాల (*Manuals*) లోని నిబంధనలను, సూచనలను నిర్వచించడానికి, ఆయా సందర్భాలకు వాటిని అన్వయింప జేయడానికి సంబంధించినవి. అనేక సంవత్సరాలుగా, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు సమంగా వర్తించే ప్రాతిపదిక నియమావళి విశేషంగా పెరిగింది. భారత ప్రభుత్వ శాఖలలో, రక్షణ శాఖకాక మిగిలిన శాఖలలో ఉపయోగపడే నియమ గ్రంథాలే దాదాపు ఎనిమి ఆరువేల పేజీలవరకు ఉన్నవి. ఈ నియమ గ్రంథాలలో కొన్నింటిని అప్పుడే హిందీలోకి అను వదింప జేశారు. అయితే, ప్రస్తుతం ఏ శాఖకు ఆ శాఖే ఈ అనువాదాలకు ఏర్పాట్లు చేసు కుంటున్నవి. ఈ అనువాదాలన్నిటినీ పర్యవేక్షిస్తూ, సమన్వయపరిచేందుకు ప్రత్యేకమైన ఏర్పాటేమీ జరగలేదు. ఈ నియమ గ్రంథాలలోని నిబంధనావళిని, ఇతర విధాన వివరణలను అను వదించడంలో ఉపయోగింపబడే భాష సాధ్యమయినంతవరకు ఒకే విధంగా ఉండేటట్టు చూడటం ముఖ్యం గనుక, విచారణ సంఘం సలహాను ఈ ఉపసంఘం ఆమోదిస్తూంది. ఆ సలహా ప్రకారం, ఈ కార్యక్రమ మంతటినీ పర్యవేక్షించడానికి, అవసరమైన సూచనలు చేయడానికి కేంద్ర ప్రభుత్వం ఒక ప్రత్యేక కార్యాలయాన్ని ఏర్పాటు చేసి, ఈ భాధ్యత దానికి అప్పగించాలని ఈ ఉపసంఘం సూచిస్తూంది.

ప్రభుత్వ కార్యాలయాలలోని యంత్రాలు ఇతర పరికరాలు, సిద్ధం చేయడం.

31. "స్టెనో గ్రాఫర్లకు, టైపిస్టులకు ప్రత్యేకమైన సెలవు మంజూరుచేసి, నూతనాధికార భాషలో తమ తమ పనులు నిర్వహించడానికి అవసరమైన శిక్షణ పొందడానికి, కేంద్ర ప్రభుత్వాధికారభాషతో తగినంత పరిచయం కలిగించుకొవడానికీ ప్రత్యేక సౌకర్యాలు కలిగించేందుకు ఒక ప్రణాళికను ఏర్పాటు చేయాలి; అని విచారణ సంఘం సలహా యిచ్చింది. హిందీ టైపురైటరు కీ బోర్డును సిద్ధము చేయడం, దేవనాగిరి లిపిలో అధికారపూర్వకమైన సంస్కరణలను నిర్ణయించడం అవసరమనికూడా సూచించింది.

ఈ సూచనలతో ఈ ఉపసంఘం ఏకీభవిస్తూ నాటిని ఆమోదించాలని సూచిస్తూంది.

ఉద్యోగులకు శిక్షణ.

32. కేంద్ర ప్రభుత్వోద్యోగులు ఆఫీసు సమయంలోనే హిందీ నేర్చుకొనడానికి వీలుగా కేంద్ర ప్రభుత్వం ఇదివరకే ఒక ప్రణాళిక అమలు జరుపుతూంది. వివిధ పరీక్షలలో బాగా ఉత్తీర్ణులైనవారికి బహుమతులు ఏర్పాటు చేయడంద్వారా మరికొంత ప్రోత్సాహంకూడా ఇస్తూంది. ఈ ప్రణాళిక క్రింద ప్రస్తుతం 16 వేల మందికి పైగా కేంద్ర ప్రభుత్వోద్యోగులు తమకు తామే ఇష్టపడి హిందీ నేర్చుకుంటున్నారు.

ఇష్టపడినవారికి మాత్రమే హిందీ నేర్పాలన్న ఈ ఏర్పాటు తగినంతగా ఫలించకపోతే, "ప్రభుత్వ భాషా విధానాన్ని అనుసరించి కేంద్ర ప్రభుత్వోద్యోగులు తమ విధులను నిర్వహించడానికి అవసరమగు మాత్రపు హిందీ భాషను తగినంత గడువులోగా విధిగా నేర్చుకోవా"లన్న నియమం ఏర్పాటు చెయ్యాలని, అట్లా చేయడం న్యాయ సమ్మతమే అని విచారణ సంఘం సలహా యిచ్చింది. అయినప్పటికి, 45 సంవత్సరాలుగాని, అంతకు మించిగాని వయస్సుగల ఉద్యోగులు మాత్రం "హిందీ అర్థం చేసుకోగల జ్ఞానం" సంపాదిస్తే చాలుననికూడా సూచించింది. ఈ మార్పులకు అనుగుణంగా వివిధ శాఖలలో అధికార భాషా పరీక్షలను ఏర్పాటు చెయ్యాలని, వాటిని నూతన పరీక్షార్థులకేగాక, ఇప్పుడు ఉద్యోగాలు చేస్తున్న వృద్ధ పరీక్షార్థులకుకూడా వర్తింపజేయాలనీ విచారణ సంఘం పంపిన ప్రశ్నావళికి చెన్నరాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన జవాబులలో సూచించింది. కొత్తగా ఒక భాషను నేర్చుకొనజాలనంతటి వృద్ధులుకాని పెద్దవారుకూడా హిందీ నేర్చుకొనడానికి ప్రత్యేక సౌకర్యాలు కలిగించాలని, అట్టి సౌకర్యాలు తగినంతగా కలిగించిన మీదటనే వారు ఆయా శాఖల భాషా పరీక్షలకు హాజరు కావాలని నిబంధన చేయాలనికూడా చెన్నరాష్ట్ర ప్రభుత్వం సూచించింది. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ శాఖలలో ఈ విధంగా ఆయా శాఖల వారికి భాషా పరీక్షలు ఏర్పాటు చేసే పద్ధతి చిరకాలంగా సాగుతూంది. ముఖ్యంగా రక్షణ శాఖలలోను, ఇండియా ఎగుమతి దిగుమతి సుంకాల శాఖలలోను లోగడ ఇంపీరియల్ కస్టమ్స్ సర్వీసులోనుగల ఉన్నతోద్యోగులు హిందీ, లేక హిందూస్తానీ భాషను తప్పక నేర్చుకోవాలనే నియమం ఆంగ్లేయుల పాలనలోకూడా ఉండేది. పాతపరీక్షార్థులకేగాక, నూతన పరీక్షార్థులకు కూడా హిందీ నేర్పడానికి ప్రస్తుత సౌకర్యాలు ఇకముందుకూడా ఉంటవి. మొత్తం మీద ఉద్యోగులకు ఈ నూతన అధికార భాషలో శిక్షణ ఇవ్వడం చాలా అవసరం. అందువలన, విచారణ సంఘం సలహాను ఈ ఉపసంఘం ఆమోదిస్తూంది. అయితే పెద్ద వయస్సుగల ఉద్యోగులు కొత్త భాష నేర్చుకొవడం కష్టం అని గుర్తించి, ప్రస్తుతం హిందీ భాషతోపాటు ఇంగ్లీషుకూడా వాడుకలో ఉంటుందనే విషయం, 1965 తరువాతకూడా ఇంగ్లీషు ఐచ్ఛిక భాషగా వాడుకలో ఉండవచ్చుననే విషయంకూడా దృష్టిలో ఉంచుకొని 45 సంవత్సరాలుగాని, అంతకుపైబడిన వయస్సుగాని కల ఉద్యోగులు హిందీ విధిగా నేర్చుకోవాలని నిర్బంధం చేయకూడదని ఈ ఉపసంఘం అభిప్రాయపడుతూంది.

ఉన్నతమైన కేంద్ర ప్రభుత్వోద్యోగుల ఎన్నిక.

33. ఇంగ్లీషు స్థానే హిందీని వాడుకలోకి తీసుకొనివచ్చే సందర్భంలో, కేంద్ర ప్రభుత్వోద్యోగాలకు, ఇతర అఖిల భారత ఉద్యోగాలకు ఇక మీదట కొత్తగా అభ్యర్థులను ఎన్నుకొనే కార్యక్రమాన్నికూడా విచారణ సంఘం జాగ్రత్తగా పరిశీలించి ఈ దిగువ ఉద్యోగాల విషయంలో ప్రత్యేకంగా కొన్ని సలహాలిచ్చింది :

1. వివిధ ప్రాంతాలలోని కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల్లో సహాయకోద్యోగాలకు అభ్యర్థుల ఎన్నిక;

2. సైనిక కళాశాల, జాతీయ రక్షణ ఎకాడమీ, నౌకాదళ సిబ్బంది, వైమానిక దళ ఎకాడమీ మొదలైన శిక్షణ సంస్థలకు అభ్యర్థుల ఎన్నిక;

3. అఖిల భారతోద్యోగాలకు, కేంద్ర ప్రభుత్వములో ఉన్నతోద్యోగాలకు ఎన్నిక;

కేంద్రప్రభుత్వ స్థానిక కార్యాలయాలలోకి సహాయకోద్యోగుల ఎన్నిక.

34. కేంద్ర ప్రభుత్వ శాఖలలో స్థానిక కార్యాలయాలలో సహాయకోద్యోగుల ఎన్నికకు విచారణ సంఘం సలహాలు :

అ కేంద్ర ప్రభుత్వ శాఖలలో తంతి తపాలా, రైల్వేలు, ఎక్సైజు, రాబడి పన్ను, మొదలైన శాఖలు, ఉప శాఖలు "శాశ్వతంగా ద్విభాషా వ్యవహార విధానాన్ని అవలంబించాలి. అనగా, హిందీ భాషను కార్యాల యాంతర్గత వ్యవహారాలకు, ప్రాంతీయ భాషలను ఆయా ప్రాంతాల ప్రజలతో వ్యవహరించడానికి వాడుక చేయాలి".

ఈ పాలక శాఖలలోని లేక ఉప శాఖలలోని ఉద్యోగివర్గ వ్యవస్థను "పునఃపరిశీలనచేసి, అట్టి ద్విభాషా వ్యవహార విధానానికి అనుగుణంగా ఉండేటట్లు వికేంద్రీకరించాలి. కొత్త ఉద్యోగులను ఎన్నుకొనే పద్ధతులను ఉద్యోగార్హతలను తగు విధంగా సవరించాలి."

ఆ "ఈ అఖిల భారత శాఖల, సంస్థల యజమానులుగా వ్యవహరిస్తున్నవారు ఏయే రకం ఉద్యోగాలకు హిందీలో ఏయే యోగ్యతలు (లేక ప్రాంతీయ భాషకు సంబంధించినవైతే ఆ భాషలో ఏ యోగ్యతలు) ఉండవలసినది నిర్ణయించేసి ప్రకటించవచ్చు. అనగా మాండలిక ప్రాంతీయ కార్యాలయాలలోని ఉద్యోగులకు హిందీలో యోగ్యత వాటి తాలూకు కేంద్ర కార్యాలయోద్యోగుల యోగ్యతకన్న కొంచెం తక్కువగా ఉండవచ్చు."

ఇ "సంధి కాలంలో, కొన్ని ప్రాంతాల వారికి ఉద్యోగావకాశాలు తగ్గకుండా చూచే నిమిత్తం, ఆదిలో హిందీ భాషా యోగ్యతను కొంత తక్కువ గానే నిర్ణయించాలి. ఈ నిర్ణయం చేసేటప్పుడు ఆ ప్రాంతంలోని విద్యావిధానంలో హిందీ ఎంతవరకు ప్రవేశ పెట్టబడినది గమనించాలి. అట్టి ఉద్యోగులలో హిందీ భాషా జ్ఞానం తక్కువగా ఉంటే వారు ఉద్యోగం చేస్తూనే తగిన శిక్షణ పొందేటట్లు చెయ్యవచ్చు. ఆయా ప్రాంతాలలో హిందీ భాషా బోధనకు సౌకర్యాలు క్రమంగా ఎక్కువైన కొద్దీ ఆయా ఉద్యోగాలకు అవసరమైన హిందీ భాషా యోగ్యతలను పెంచవచ్చు."

ఈ "కొత్తగా ప్రభుత్వోద్యోగాలలో చేరే వారికి తగుమాత్రం హిందీ భాషా జ్ఞానం ఉండాలని కేంద్ర ప్రభుత్వం శాసించవచ్చు. అందులో అక్రమత ఏమీ ఉండదు. అయితే, అలా శాసించడానికి పూర్వం తగినంత వ్యవధి ఇవ్వడం, హిందీ, భాషా యోగ్యతను సాధ్యమయినంత తక్కువగా నిర్ణయించడం అవసరం. ఆ ఉద్యోగుల హిందీ జ్ఞాన లోపం, పిమ్మట ఉద్యోగం చేస్తూనే వారు పొందే శిక్షణతో సవరించుకోవచ్చు.

ఈ సలహాలు, హిందీ భాషా ప్రాంతాలుకాని ఇతర ప్రాంతాలలోని వారి ప్రభుత్వోద్యోగార్హతకు సంబంధించినవి. వీటిని ఆమోదించవచ్చునని ఈ ఉపసంఘం సూచిస్తున్నది. కేంద్ర ప్రభుత్వ శాఖలకు సంబంధించిన స్థానిక కార్యాలయాలలోనే సహాయకోద్యోగులను ఎన్నుకొనే యెడల, ముఖ్యంగా వివిధ భాషా ప్రాంతాలవారికి ఉద్యోగావకాశాలు తగినంతగా లభిస్తాయి.

ఉద్యోగాలకు తగినవారిని ఎన్నిక చేయడంలో రాష్ట్రాల వారిగా ఎన్నుకొనడానికి వీలు ఉన్న ఉద్యోగాలను, అఖిల భారత స్థాయిలోనే ఎన్నుకొనవలసిన ఉద్యోగాలను స్పష్టంగా నిర్వచించాలని, మొదటి రకం ఉద్యోగాలకు ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రంలోనే పరీక్ష జరిపించాలని చెన్న రాష్ట్ర ప్రభుత్వం పంపిన విజ్ఞప్తి పత్రంలోగల సూచనను గుర్తుంచుకోవాలి. ఆ ఉద్యోగార్థులకు విధింపబడే అర్హతలలో హిందీలో ఒక నిర్దిష్ట పాఠశాలా పరీక్షను నిర్ణయించి దానిలో ఉత్తీర్ణులు కావాలని విధించి, వారు తమ ఉద్యోగ విధులను నిర్వర్తించడానికి అవసరమైనంత హిందీ జ్ఞానం కలవారియినదీ లేనిదీ తేల్చడానికి ఆ శాఖకు సంబంధించిన ఒక ప్రత్యేక పరీక్ష పెట్టాలనికూడా చెన్నరాష్ట్ర ప్రభుత్వం కోరింది. విచారణ సంఘంవారి సలహాలు చెన్నరాష్ట్ర ప్రభుత్వం చేసిన సూచనలకు అనుగుణంగా ఉన్నవి.

*శిక్షణ సంస్థల్లో ప్రవేశానికి అభ్యర్థుల ఎన్నిక.*

35. జాతీయ రక్షణ ఎకాడమీ మొదలైన సంస్థల విషయంలో విచారణ సంఘం రెండు సూచనలు చేసింది. 1. అట్టి సంస్థలల్లో ఇంగ్లీషు స్థానంలో హిందీని బోధన భాషగా చేయడానికి గల అవకాశాలను పరిశీలించాలి. 2. దేశంలో చాలా ప్రాంతాలలో ఉన్నత పాఠశాలలలో ఇంగ్లీషు స్థానంలో వివిధ ప్రాంతీయ భాషలను బోధన భాషలుగా ప్రవేశపెడుతున్నారు గనుక, ఈ సంస్థలలో శిక్షణ పొందడానికి ఎన్నుకొనబడే అభ్యర్థులకు జరిపే ప్రవేశ పరీక్షలను ఆయా ప్రాంతీయ భాషలలోనే జరపడం అవసరం కావచ్చు. ఇందువల్ల ఆ ప్రవేశ పరీక్షలను వికేంద్రీకరించి ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రంలో విడివిడిగా జరపడం అవసరం కావచ్చు. ఆ విధంగా శిక్షణ పొందే వారి సంఖ్యలనుకూడా రాష్ట్రాల వారిగా నిర్ణయించవలసిన అవసరంకూడా కలుగవచ్చు. ఈ శిక్షణ సంస్థలలో ప్రవేశానికి రాష్ట్రాల వారి ప్రాతినిధ్య పద్ధతి, అఖిల భారత ఉద్యోగుల ఎన్నికలో రాష్ట్రాలవారి ప్రాతినిధ్యం ఏర్పరచే పద్ధతి ఉన్నంత అభ్యంతరకరంగా లేదని విచారణ సంఘం అభిప్రాయ పడింది.

ఈ సంస్థలలో శిక్షణ పొందేవారు చదవవలసిన పాఠ్య గ్రంథాలు, ఇతర సాంకేతిక గ్రంథాలు ప్రస్తుతం హిందీలో లేవు. పైగా అక్కడ శిక్షణ పొందడానికి హిందీ మాతృ భాషకాని ప్రాంతాలనుంచి వచ్చిన వారిలో చాలా మందికి హిందీలో బోధిస్తే గ్రహించేటంత హిందీ భాషా జ్ఞానం కొంతకాలంవరకు కలుగక పోవచ్చు. అందువల్ల, ఈ శిక్షణ సంస్థలలో మరికొంత కాలం ఇంగ్లీషువే బోధన భాషగా వాడటం అవసరం కావచ్చు అని ఈ ఉపసంఘం అభిప్రాయం. అయితే అక్కడ బోధించే విషయాలలో కొన్నింటినిగాని, అన్నింటినీగాని, హిందీలో బోధించడానికి తగిన ఏర్పాట్లు క్రమ క్రమంగా చెయ్యాలి.

ఈ శిక్షణ సంస్థలలో ప్రవేశింపగోరే అభ్యర్థులకు ఏర్పాటు చేసే పరీక్షల్లో అన్ని పరీక్షా పత్రాలకు, లేక కొన్ని పరీక్షా పత్రాలకు ఇంగ్లీషులోగాని, హిందీలోగాని జవాబులు వ్రాస్తామని అభ్యర్థులు ముందుగా తెలుపుకొనడానికి అవకాశం ఇవ్వాలని ఈ ఉపసంఘం సూచిస్తూంది. ఈ ప్రవేశ పరీక్షల్లో ప్రాంతీయ భాషలను వాడుక చేయడానికి ఈ ఉపసంఘం అభ్యంతరం చెప్పడం లేదు. అయితే, చాలా భాషలకు అవకాశం ఇస్తే, రాష్ట్రాల వారీగా అభ్యర్థులను ఎన్నిక చేసుకొనే పద్ధతి అనివార్యం కావచ్చుననే సంశయం మాత్రం వెలిబుచ్చుతూంది. ఈ శిక్షణ సంస్థలలోకి రాష్ట్రాల వారీగా అభ్యర్థులను ఎన్నుకొనే పద్ధతి, అఖిల భారత ప్రభుత్వో ద్యోగులను రాష్ట్రాల వారీగా ఎన్నుకొనే పద్ధతి ఉన్నంత అభ్యంతరకరంగా లేదన్న విచారణ సంఘ అభిప్రాయంతో ఈ ఉపసంఘం ఏకీభవించడం లేదు. కనుక, రాష్ట్రాల వారీ ఎన్నిక పద్ధతికి దారితీసే అవకాశం లేకుండానే, వివిధ ప్రాంతీయ భాషలలో జవాబులు వ్రాయనిచ్చే పద్ధతి ఎంత వరకు ఆచరణీయమో పరిశీలించడానికి ఒక నిపుణుల ఉపసంఘాన్ని నియమించాలనికూడా ఈ ఉపసంఘం సూచిస్తూంది.

అఖిల భారతోద్యోగాలకు, కేంద్రప్రభుత్వ ఉన్నతోద్యోగాలకు అభ్యర్థుల ఎన్నిక.

36. అఖిల భారత ఉద్యోగాలకు కేంద్ర ప్రభుత్వ ఉన్నతోద్యోగాలకు అభ్యర్థుల ఎన్నిక విషయంలో ఆయా ఉద్యోగార్థులకు జరిపే పరీక్షలలో భాషా పరీక్షా పత్రాలు కొన్నిటిని విధిగా ఏర్పాటు చేయడాన్ని గురించీ, మొత్తం పరీక్షలో వాడదగిన భాషను గురించీ విచారణ సంఘం కొన్ని సలహాలిచ్చింది. తప్పని సరియైన భాషా పరీక్ష పత్రాల ఏర్పాటును గురించిన సలహాలు:—

అ. "అఖిల భారత ఉద్యోగులకు, కేంద్రోద్యోగులకు అవసరమైన భాషా పరిజ్ఞానం దృష్ట్యా, కొంత వ్యవధి యిచ్చి అప్పటినించే ఈ పరీక్షలలో విధిగా ఒక హిందీ పరీక్షా పత్రంకూడా ఏర్పాటు చెయ్యాలి. ఇందువల్ల హిందీ భాషేతర ప్రాంతాల వారికి ఎక్కువ ఇబ్బంది కలుగకుండా ఉండేందుకుగాను, ఈ సంధి కాలంలో ఆ పరీక్షా పత్రాన్ని సాధ్యమైనంత సులభ స్థాయిలో ఉంచి, కేవలం లాంచన పరీక్షా పత్రంగా పరిగణించాలి. పిమ్మట కొంత కాలానికి మళ్ళీ కొంత వ్యవధి యిచ్చి, విధిగా జవాబులు వ్రాయవలసిన ఇతర పరీక్షా పత్రాల స్థాయికి పెంచి పూర్తిగా కట్టుదిట్టం చెయ్యాలి. అంతేగాక, దక్షిణ భారత భాషలు మాతృ భాషలుగా గల అభ్యర్థులు మాత్రం పరీక్షా పత్రంలోని ఒకటి రెండు కఠిన ప్రశ్నలకు జవాబులు వ్రాయనవసరం లేకుండా చేసి, హిందీ భాషకి సన్నిహితమైన భాషలు మాతృ భాషలుగా గలవారు మాత్రం ఆ ప్రశ్నలకుకూడా విధిగా జవాబులు వ్రాయాలని నిబంధించాలి."

ఆ. "హిందీ అభ్యర్థులను, తదితరులను సమాన దృష్టితో చూచే నిమిత్తం హిందీ అభ్యర్థులు మరొక పరీక్షా పత్రానికికూడా జవాబులు వ్రాయాలని విధించాలి. వీరు సామాన్య పరీక్షా పత్రానికి జవాబులు వ్రాసే స్వభాషలోనే ఈ పత్రానికి కూడా జవాబులు వ్రాయవచ్చు. ఈ పత్రంలో దక్షిణ భారత సాంస్కృతిక విషయాలు, ఎనిమిదవ అనుబంధంలోని భాషల్లో హిందీని మినహాయిస్తే మిగిలిన భాషలను గురించిన విషయాలు మొదలైన వాటిపై చాలా ప్రశ్నలు అడిగి, అందులో వారు ఎన్నుకొన్న కొన్ని ప్రశ్నలకు జవాబులు వ్రాయాలని నియమం పెట్టాలి."

ఇ. "హిందీ అభ్యర్థులు హిందీ కాక ఇతర ప్రాంతీయ భాషలలో లేక దక్షిణ భారత భాషలలో ఏదో ఒక దానిలో ఒక పరీక్షా పత్రానికి జవాబులు వ్రాయాలని నిబంధించడం ఉచితమైన సమశ్వాస పద్ధతి అన్న సూచన న్యాయ సమ్మత మైనదిగా ఈ ఉపసంఘం ఆమోదించడం లేదు."

ఈ. "పరీక్ష జరిపే భాషను ఇతర భాషలోకి, లేక భాషలలోకి మార్చిన తరువాత కూడా, అఖిల భారతోద్యోగాలకు జరిపే పరీక్షలలో కొన్ని పరీక్షా పత్రాలకు మాత్రం అభ్యర్థులంతా ఇంగ్లీషులోనే జవాబులు వ్రాయాలని ఏర్పాటు చేయాలి."

37. ముందు ముందు అఖిల భారతోద్యోగులు, కేంద్ర ఉన్నతోద్యోగులు హిందీ భాషతో తగినంత పరిచయము గలవారై ఉండటం అవసరం కనుక, కొంత వ్యవధి యిచ్చిన మీదట ఆ ఉద్యోగార్థులకు ఒక హిందీ పరీక్షా పత్రం కూడా విధిగా ఏర్పాటు చెయ్యాలన్న సూచనను ఈ ఉపసంఘం ఆమోదిస్తున్నది. ఇందుకు తొలి చర్యగా ఒక్క హిందీ పరీక్షా పత్రాన్ని లాంఛనంగా మాత్రం ఏర్పాటు చెయ్యాలన్న సూచనను ఈ ఉపసంఘం ఆమోదించ జాలదు. అలా చేయడం వలన, హిందీలో పాసు మార్కులు రాకపోయినా పరీక్షలో ఉత్తీర్ణులైన అట్టి వారందరు అయోగ్యులుగా పరిగణింపబడే అవకాశం ఏర్పడుతుంది. హిందీ మాతృభాషగాగల అభ్యర్థులు, హిందీ కాక మిగిలిన భారతీయ భాషలలో ఏదో ఒక దానిలో ఏ పరీక్షా పత్రము వ్రాయవలసిన అవసరం లేదని, దానికి బదులు దక్షిణ భారత సంస్కృతికి, ఎనిమిదవ అనుబంధంలో హిందీ కాక ఇతర భాషలకు సంబంధించిన ప్రశ్నలతో సహా ఇంకా మరి కొన్ని ప్రశ్నలుగల పరీక్షా పత్రంలో తమ కిష్టమైన కొన్ని ప్రశ్నలకు మాత్రం జవాబులు వ్రాయాలని నిబంధించాలని విచారణ సంఘం చేసిన సూచనను ఈ ఉపసంఘం ఆమోదించడం లేదు. అఖిల భారతాధికారులు, కేంద్ర ప్రభుత్వ ఉన్నతోద్యోగులు హిందీతోపాటు కనీసం మరొక భారతీయ భాషతో పరిచయంగలవారై ఉండటం అవసరంగా కనిపిస్తొంది. అందుచేత, సమానస్థాయిలో రెండు భాషా పరీక్షా పత్రాలు విధిగా జవాబులు వ్రాసే యేర్పాటు చేయాలని, అందులో ఒకటి హిందీలోను, రెండవది హిందీ కాక మిగిలిన ఆధునిక భారతీయ భాషలలో ఏదో ఒక భాషలోనూ, వ్రాయాలని నిబంధనచేయాలని ఈ ఉపసంఘం కోరుతూంది. ఈ పద్ధతి ప్రకారం, హిందీ మాతృభాషగాగల అభ్యర్థులు హిందీలోను, హిందీ ఉర్దూ భాషలు కాక మిగిలిన భారతీయ భాషలలో తాము కోరుకొన్న ఏదో ఒక దానిలోను పరీక్షా పత్రాలకు జవాబులు వ్రాయాలి. మిగిలిన భాషలలో ఏదైనా మాతృభాషగా గల అభ్యర్థులు హిందీలోను, మిగిలిన భారతీయ భాషలలో తాము ఎంచుకొన్న ఒక భాషలోను పరీక్షా పత్రాలకు జవాబులు వ్రాయాలి.

అఖిల భారతోద్యోగులు, కేంద్ర ప్రభుత్వ ఉన్నతోద్యోగులు తమ విధులను సమర్థంగా నిర్వర్తించ గలగాలంటే ఇంగ్లీషు భాషా జ్ఞానం వారికి తగినంతగా ఉండటం అవసరం. కనుక, పరీక్షా భాషను మార్పుజేసిన తరువాత కూడా వారు ఇంగ్లీషు భాషలో ఒక పరీక్షా పత్రానికి విధిగా జవాబులు వ్రాసేటట్లు ఏర్పాటు చెయ్యాలనీ, పూర్తిగా అధికార వ్యవహారాలన్నింటిలో ఇంగ్లీషు స్థానే హిందీని ప్రవేశ పెట్టేటంతవరకు ఈ యేర్పాటు సాగుతూ ఉండాలనీ ఈ ఉపసంఘం కోరుతూంది.

38. అఖిల భారతోద్యోగాలకు, కేంద్ర ప్రభుత్వ ఉన్నతోద్యోగాలకు జరిపే పోటీ పరీక్షలలో వాడవలసిన భాష విషయంలో విచారణ సంఘం ఈ దిగువ సలహా లిచ్చింది :—

అ. "అఖిల భారతోద్యోగాలకు, కేంద్రోద్యోగాలకు సంబంధించిన పరీక్షలలో (ఇతరత్ర నిబంధించక పోతే ఇక ముందు ఏర్పాటు చెయ్యబోయే అఖిల భారతోద్యోగాలకు కూడా ఇది వర్తిస్తుంది), కొంతకాల వ్యవధి నిర్ణయించి అప్పటినుండి, ప్రస్తుతం వాడుకలో ఉన్న ఇంగ్లీషు భాషతోపాటు హిందీ భాషను కూడా వాడుకచెయ్యాలి.

హిందీ భాషలాగే ఇతర భారతీయ భాషలుకూడా విశ్వవిద్యాలయాలలో బి.ఏ. వరకు బోధన భాషలుగా వాడుకలోకి వస్తే, అప్పుడు అట్టి ఇతర భాషలను వాడకచేయడం సంగతి ఆలోచించవచ్చు.

ఈ ఉద్యోగాలకు అభ్యర్థులను ఎంచుకొనడానికి జరిపే పోటీ పరీక్షలలో వాడదగిన భాషగా ఏ భాషనైన నిర్ణయించవచ్చునా అని విచారించడానికి పూర్వం ఆ భాష విశ్వవిద్యాలయ విద్యలో ఫలాని తరగతి వరకు వాడుకలోకి వచ్చి ఉండాలని నిర్దేశించాలి.

కాలపరిమితి నిర్ణయించకుండా అవసరమైనంత వరకు ఇంగ్లీషు భాషను వాడుతూ ఉండాలి. ఐతే, ఈ ప్రత్యామ్నాయ పద్ధతిని రద్దుచేయదగిన స్థితి వచ్చినప్పుడు, అలా రద్దుచేయుడానికి పూర్వం తగినంత వ్యవధి ఇవ్వాలి.

ఆ. ఈ పరీక్షలు జరపటానికి పరీక్షకులుగా తగిన యోగ్యతలుగల ద్విభాషా వేత్తలు, బహు భాషా వేత్తలు అవసరమయినప్పటికీ, ఈ పరీక్షలలో వాడే భాషల సంఖ్య కొంత నియమితంగా ఉన్నంత వరకు ఈ 'సామభూతి పద్ధతి' (*Moderation*) ఆచరణ సాధ్యమే కావచ్చు. కాని, ఈ పరీక్షలలో కొత్తగా మరొక భాషకు అవకాశ మివ్వడం అనాచరణీయంగా కనిపించే స్థితి ఏర్పడవచ్చు.

ఆ స్థితికి వచ్చే లోపుగానే కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు సంప్రదించుకొని ఈ దిగువ విషయాలలో తగు నిర్ణయాలు చెయ్యాలి:—1. అఖిల భారతోద్యోగులను ఎన్నుకునే విధానాలలో మార్పుచేయడానికి తాము అంగీకరిస్తున్నారా? లేక 2. పరీక్షా భాషలను పరిమితం చేయడానికి అంగీకరిస్తారా?, లేక పరీక్షా విధానాలలో వేరే ఏవైనా యుక్తమైన మార్పులు చేయగోరుతున్నారా?"

39. విచారణ సంఘం తెలిపినట్లు, ఈ పోటీ పరీక్షలు చాలా భాషలలో జరిపే యెడల "సామభూతి విధానాన్ని" (*Moderation*) సంతృప్తికరమైన స్థాయిలో నిలిపి ఉంచడం కష్టం అవుతుంది. కేంద్ర పబ్లిక్ సర్వీస్ కమీషను మరియు ఇంచుమించు అన్ని రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమీషన్లూ విచారణ సంఘం ప్రశ్నావళికి పంపిన జవాబులలో ఈ ఇబ్బందిని స్పష్టంగా సూచించినవి. ఈ ఉద్యోగాలకు, రాష్ట్రానికి ఇంత మందిని తీసుకోవాలనే ఏర్పాటు చేస్తే, ఈ ఇబ్బంది లేక పోవచ్చు. అయితే, అప్పుడు, ఈ ఉద్యోగాల అఖిలభారత స్వభావానికే ముప్పురావడం, ఎన్నిక స్థాయి దిగజారిపడం కూడా సంభవించ వచ్చు. ఈ పరీక్షలకు ఇంగ్లీషునే పరీక్షా భాషగా ఉంచాలని, ఇప్పుడేగాని, మరికొంత కాలానికిగాని హిందీని ప్రత్యామ్నాయ పరీక్షా భాషగా ప్రవేశపెట్టాలనీ విచారణ సంఘం ప్రశ్నావళికి చాలా రాష్ట్ర ప్రభుత్వాలు పంపిన జవాబులలో లేక నివేదికలలో సూచించినవి. ఇంగ్లీషు, హిందీ కూడా సమానంగా ప్రత్యామ్నాయ పరీక్షా భాషలుగా ఉండాలని, అభ్యర్థులు ఇందులో తమ కిష్టమైన భాషను ఎంచుకొనడానికి అవకాశం ఇవ్వాలని ఇది తిరుగులేని నియమంగా ఏర్పాటు చెయ్యాలనీ చెన్నరాష్ట్ర ప్రభుత్వం విచారణ సంఘానికి పంపిన నివేదికలో సూచించింది. సాధ్యమయితే ప్రాంతీయ భాషలలో కూడా, ఈ పరీక్షలు జరుపవచ్చుననీ, కాకపోతే అవసరం లేదనీ కూడా ఆ రాష్ట్ర ప్రభుత్వం విచారణ సంఘ ప్రశ్నావళికి పంపిన జవాబులలో పేర్కొన్నది. పాఠశాలలలోను కళాశాలలోను బి.ఏ. వరకు బోధన భాషగా చేయబడిన ప్రాంతీయ భాషలన్నిటికీ ఈ సమష్టి అఖిల భారత పరీక్షలలో అవకాశం ఇవ్వాలనీ, ఈ

"సానుభూతి పద్ధతి"ని సక్రమంగా వాడుకచేసే సమస్యను కేంద్ర పబ్లిక్ సర్వీస్ కమీషన్ సాధ్యమయినంత సంతృప్తికరంగా పరిష్కరించాలనీ విచారణ సంఘ నివేదిక ప్రకటితమైన తరువాత పంపిన రెండవ నివేదికలో చెన్న రాష్ట్ర ప్రభుత్వం సూచించింది.

ఈ సమస్యకు సంబంధించిన అంశాలన్నీ పూర్తిగా ఈ ఉపసంఘం చర్చించింది. తత్ఫలితంగా ఈ పరీక్షల్లో ఇంగ్లీషు భాషను వాడుక చేస్తూనే ఉండాలనీ, కొంతకాలం గడిచిన పిమ్మట హిందీని కూడా ప్రత్యామ్నాయ భాషగా ప్రవేశ పెట్టాలనీ, అభ్యర్థులు కోరిక ననుసరించి ఇంగ్లీషులోగానీ, హిందీలోగాని ఈ పరీక్షలు జరిపే పద్ధతిని అవసరమైనంత వరకు వాడుకలో ఉంచాలనీ ఈ ఉపసంఘం అభిప్రాయ పడుతున్నది. ఉద్యోగాలు రాష్ట్రాల వారీగా కేటాయించే పద్ధతిని ప్రవేశపెట్టవలసిన అవసరం లేకుండా ఈ పరీక్షలలో ప్రాంతీయ భాషలకు అవకాశం యివ్వడం సాధ్యమయే యెడల, అందుకు ఈ ఉపసంఘం అభ్యంతరం చెప్పదు. "సానుభూతి పద్ధతి" ప్రవేశపెట్టే సందర్భంలోగల చిక్కుల దృష్ట్యాను, క్రమంగా రాష్ట్రాల వారీ కేటాయింపుకి దారితీసే అవకాశం ఉన్న పద్ధతిని ప్రవేశ పెట్టడంలోగల ప్రమాదాల దృష్ట్యాను, ఒక నిపుణుల ఉపసంఘాన్ని నియమించాలని ఈ ఉపసంఘం కోరుతూంది. రాష్ట్రాల వారీగా కేటాయింపు పద్ధతికి దారితీయకుండా, ప్రాంతీయ భాషలను వాడుకచేయడానికి వీలున్నదేమో ఆ ఉపసంఘం పరిశీలించాలి.

40. భారతదేశ సంకీర్ణ సంస్కృతికి సంబంధించిన సర్వరంగాలలోను భావవ్యక్తీకరణకు ఉపయోగపడగల భాషగా హిందీని వికసింప జేయడం, ఆ భాషా వ్యాప్తికి తగిన యేర్పాట్లు చేయడం కేంద్ర ప్రభుత్వ కర్తవ్యం అని రాజ్యాంగంలోని 351వ సూత్రం విధిస్తున్న సంగతి లోగడ తెలుసుకొన్నాం. ఇంగ్లీషు స్థానే హిందీని ప్రవేశపెట్టడానికి తగిన కాలక్రమం నిర్ణయించేటప్పుడు, హిందీ భాషా ప్రాంతాలుకాని ప్రదేశాలలో హిందీ భాషా వ్యాప్తి ఎంతవరకు జరిగినది గమనిస్తూ ఉండాలని కూడా అందులో సూచింపబడింది. హిందీ భాషా ప్రాంతాలు కాని ప్రదేశాలలో హిందీ భాషా వ్యాప్తికి స్వచ్ఛంద సంస్థలుచేసిన ప్రశంసనీయమైన కృషిని విచారణ సంఘం శ్రద్ధగా సమీక్షించింది. ఈ సంస్థలకు ప్రభుత్వ సహాయం పరిమితంగా ఉంది. ఈ రాజ్యాంగ నిర్దేశం దృష్ట్యాను, భారతదేశపు అధికార భాషగా హిందీని వాడుకలోకి తీసుకొని రావడానికి ఉపకరించే కార్యక్రమముయొక్క ప్రాధాన్యం దృష్ట్యాను, ఇక ఈ బాధ్యతను ప్రభుత్వమే స్వీకరించాలని విచారణ సంఘం సలహా యిచ్చింది. ఈ కృషిలో కొంత అనుభవం సంపాదించి, తగిన పద్ధతులను రూపొందించుకొని, అన్ని సౌకర్యాలను అమర్చుకొని ఉన్న స్వచ్ఛంద సంస్థలుకల ప్రాంతాల్లో హిందీ భాషా బోధన, వ్యాపన కార్యక్రమం ముఖ్యంగా ఆ సంస్థలే నిర్వహిస్తూ ఉండాలి. అట్టి సంస్థల విషయంలో ప్రభుత్వ కర్తవ్యం: ముఖ్యంగా వాటికి ఆర్థిక, తదితర సహాయాలు చేస్తూ ఉండటం, వివిధ సంస్థలు చేస్తూన్న కృషిని సమన్వయ పరచడానికి అవసరమైన పర్యవేక్షణచేస్తూ ఉండటం, అవసరమైనప్పుడు ఈ కార్యక్రమాన్ని అభివృద్ధి పరచి విస్తృతం చేయటం మాత్రమే. అట్టి అనధికార సంస్థలు లేనిచోట, ప్రభుత్వమే ఆ బాధ్యతను వహించి, తగిన వ్యవస్థను ఏర్పాటుచేయాలి. హిందీ భాషా ప్రచార కార్యక్రమ వ్యాప్తికి, సక్రమ వ్యవస్థీకరణకు ఏ విధమైన చర్యలు తీసుకొనవలసినదీ కూడా విచారణ సంఘం సూచించింది. స్వచ్ఛంధ సంస్థలు తమ కార్యక్రమాలను ఆ సూచనల ననుసరించి సంస్కరించుకొనడానికి, విస్తృతం చేయడానికి కేంద్ర ప్రభుత్వం ఉదారంగా ధనసహాయం చేయాలని వారి అభిప్రాయం. వివిధ భారతీయ భాషల మధ్య ఇతోధిక సామరస్యం సాధించే నిమిత్తము, మఱియు భారతీయ సంస్కృతిని విస్తృతంగా అందరికీ తెలియజెప్పే నిమిత్తము, భాషా శాస్త్రంలోను, వివిధ భాషా సమన్వయ శాస్త్రంలోను పరిశోధకులను ప్రోత్సహించాలి.

హిందీభాషా వికాసం, వ్యాప్తి.

## 2-వ సెక్షను

ఇంగ్లీషు వాడకంపై ఆంక్షలు

41. కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో దేనిలోగాని ప్రస్తుతం ఇంగ్లీషు వాడకంపై ఆంక్షలు విధించాలని విచారణ సంఘం సలహా యివ్వలేదు. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులలో తగినంత మంది హిందీలో వ్యవహరించడానికి తగినంత శిక్షణ ఇంకా పొందలేదు కనుక, ప్రస్తుత పరిస్థితులలో అట్టి నిబంధనను విధించడం చాలా చిక్కులకు దారితీయవచ్చును. విచారణ సంఘం సూచించినట్టు, ప్రస్తుత దశలో నాటివలన సాధించే ప్రయోజనం ఏమీ ఉండదు. చాలా రాష్ట్ర ప్రభుత్వాలు విచారణ సంఘం ప్రశ్నావళికి పంపిన జవాబులలో ప్రస్తుత స్థితిలో అట్టి ఆంక్షలు విధించే విధానాన్ని ప్రతిఘటించినవి.

## 3-వ సెక్షను

## శాసనాల భాష, ఉన్నత న్యాయస్థానాల భాష

రాజ్యాంగ నిర్దేశాలు.

42. సుప్రీం కోర్టులలోను, హైకోర్టులలోను వాడదగిన భాషలను గురించి, పార్లమెంటులోను, రాష్ట్ర శాసన సభలలోను చేయబడే శాసనములలో వాడదగిన భాషను గురించిన నిర్దేశాలు రాజ్యాంగంలోని 348, 349 ఆర్టికిళ్లలో ఉన్నవని లోగడ వివరించాం.

శాసన భాష— విచారణ సంఘం సలహాలు.

43. విచారణ సంఘం తన నివేదికలోని 9-వ అధ్యాయంలో శాసనాలలో వాడదగిన భాషను గురించి చర్చించి ఈ దిగువ సలహా లిచ్చింది :—

అ. "పార్లమెంటు, రాష్ట్ర శాసన సభలు చేసే అధికార శాసనాలన్నీ ఎప్పటికైనా హిందీ భాషలోనే ఉండాలని మా అభిప్రాయం. అయినప్పటికీ ప్రజల సౌకర్యార్థం ఈ శాసనాలన్నిటికీ వివిధ ప్రాంతీయ భాషలలో అనువాదాలను ప్రకటించడం అవసరం కావచ్చు. రాష్ట్ర శాసనాలయితే ఆ ప్రాంతంలో ముఖ్యంగా వాడుకలో ఉన్న భాష లేక భాషలలో వాటి అనువాదాలను ప్రకటించాలి. పార్లమెంటు చేసే శాసనాలను మాత్రం ఈ దేశంలో వాడుకలో ఉన్న ప్రధాన ప్రాంతీయ భాషలన్నిటిలోను ప్రకటించాలి."

ఆ. "తగిన సమయము వచ్చినపుడు ఈ దేశంలో సర్వశాసన గ్రంథజాలమంతా ఒకే భాషలో ఉండేటట్టు చేయడం అవసరమనీ, హిందీ భాషే అందుకు తగిన భాష అనీ మా అభిప్రాయం. అందువల్ల రాష్ట్ర శాసనాలు, పార్లమెంటు శాసనాలు శాసన రీత్యా చేయబడే ఉత్తరువులు, నిబంధనలు మొదలైనవన్నీ హిందీలోనే జారీచేయబడాలి.

పార్లమెంటు శాసనాల భాష—ఉపసంఘం అభిప్రాయం.

44. విచారణ సంఘం జారీచేసిన ప్రశ్నావళికి రాష్ట్ర ప్రభుత్వాలు, సుప్రీం కోర్టు, హైకోర్టులు పంపిన జవాబులలో పార్లమెంటు చేసే శాసనాలన్నీ ఎప్పటికైనా హిందీలోనే చెయ్యాలని ఇంచుమించు ఏకగ్రీవాభిప్రాయం వెలిబుచ్చినవి. చెన్నరాష్ట్ర ప్రభుత్వం మాత్రం చాలాకాలం వరకు శాసనాలు రెండు భాషలలో ఉండక తప్పదనీ, 1965 వరకు అధికార ప్రతి ఇంగ్లీషులోనే ఉంటూ, సక్రమమైనవిగా గుర్తింపబడిన హిందీ అనువాదాలు ప్రకటించాలనీ, 1965 తరువాత ఈ భాషల ప్రాధాన్యాన్ని తారుమారు చెయ్యాలనీ సూచించింది. ఈ పద్ధతిని ఈ ఉపసంఘం స్థూలంగా ఆమోదిస్తూ, ప్రథమ దశలో సక్రమమైనవిగా గుర్తింపబడిన హిందీ అనువాదాలను

ప్రకటించాలని సూచిస్తున్నది. దిగువ కోర్టుల న్యాయాధికారులకు, ప్రజలకు అనువుగా ఉండేటట్లు వివిధ రాష్ట్రాల అధికార భాషలలో కూడ అనువాదాలు తయారు చేయించడానికి ఏర్పాటు చెయ్యాలి.

45. రాష్ట్ర శాసనాల్లోను, ముసాయిదా చట్టాలు వగైరాల్లోను ప్రాంతీయ భాషలనే వాడుక చేసుకొనే అధికారం రాజ్యాంగం ఇదివరకే రాష్ట్ర శాసన సభలకు ఇచ్చింది. అయితే, వాటి ఆంగ్లానువాదాలను ప్రభుత్వపు గజెట్‌లో ప్రకటించి, వాటిని ఆంగ్లంలో అధికారాను వాదాలుగా పరిగణించాలనికూడా విధించింది. ఈ ఏర్పాటును మార్పుచేయరాదని, అయితే వాటిమూల ప్రతులు హిందీలోకాక, మరొక భాషలో ఉండేట్లయితే, వాటికి హిందీ అనువాదాలు కూడా ప్రకటించడానికి తగు ఏర్పాటు చెయ్యాలనీ ఈ ఉపసంఘం సూచిస్తూంది. రాష్ట్ర శాసనాల భాష—ఉపసంఘం అభిప్రాయం.

46. సుప్రీం కోర్టులో వాడదగిన భాషను గురించి విచారణ సంఘం ఈ దిగువ సలహాలిచ్చింది:— సుప్రీం కోర్టు భాష.

అ. "ఎప్పటికైనా సుప్రీం కోర్టు హిందీ భాషనే వాడుక చెయ్యాలి. కోర్టు వ్యవహారాలన్నీ, తీర్పులు, ఉత్తరువులతో సహా రికార్డులన్నీ హిందీ భాషలోనే ఉండాలి. ఈ మార్పుకి తగిన అదను వచ్చినప్పుడు సుప్రీం కోర్టు కేవలం హిందీ భాషలోనే వ్యవహరించాలి."

ఆ. "సుప్రీం కోర్టు హిందీ మాతృ భాషకాని ప్రాంతానికి లేదా వ్యక్తికి జారీచేసే ఉత్తరువులలో వారి సౌకర్యార్థం ఆ ప్రాంతీయభాషలో అనువాదంకూడా ఉండాలి."

ఇ. "సుప్రీం కోర్టు నిర్ణయాలకు రాష్ట్ర అధికార భాషలలో విశ్వసనీయములైన అనువాదాలను తయారు చేయించడానికికూడా తగు ఏర్పాట్లు చెయ్యాలి. వాటిని ప్రత్యేక ప్రాంతీయ భాషా గ్రంథావళిగా ఉంచాలి."

ఈ. న్యాయాధిపతులలో ఎవరైనా ఇంగ్లీషులో తీర్పులు చెప్పగోరేయెడల వారికి అట్టి అవకాశ మివ్వాలి. న్యాయ స్థాన భాష మార్పు చేయబడిన తరువాతకూడా ఏ న్యాయవాదికిగాని ఇంగ్లీషులో వాదించడానికి అనుమతిచ్చే అధికారం న్యాయాధిప వర్గాధ్యక్షుడికి ఉండేటట్టు ఏర్పాటు చెయ్యాలి.

ఉన్నత న్యాయ స్థానాలలో క్రమంగా భాష మార్పు చేసే కార్యక్రమం తప్పకుండా దీర్ఘకాలం పడుతుంది. ఇతర ప్రభుత్వ వ్యవహారాలన్నిటిలో భాష మార్పు చేసిన తరువాతగాని ఇది పూర్తి కాక పోవచ్చు. సుప్రీం కోర్టులో ఎప్పటికైనా హిందీనే వాడకం చెయ్యాలని విచారణ సంఘం ఇచ్చిన సలహాలు ఉచితంగా ఉన్నవని, వాటిని ఆమోదించాలని ఈ ఉపసంఘం కోరుతున్నది.

47. హైకోర్టులలో వాడదగిన భాషను గురించి విచారణ సంఘం ఇచ్చిన ముఖ్యమైన సలహాల సారం ఇది:— హైకోర్టు భాష.

1. మార్పుకి తగిన అదను వచ్చినప్పుడు అన్ని హైకోర్టులలో తీర్పులు, డిక్రీలు, ఉత్తరువులు హిందీలోనే ఉండాలి. దిగువ కోర్టుల న్యాయమూర్తుల ఉప యోగార్థం గ్రంథస్థం చేయదగిన తీర్పులన్నిటికి ప్రాంతీయ భాషలలో విశ్వస నీయములైన అనువాదాలు ప్రకటించాలి.

2. హై కోర్టుల ఆజ్ఞా పత్రాలు, డిక్రీలు, ఉత్తరువులు మొదలైనవాటికి అవసరమైన చోట ఆయా ప్రాంతీయ భాషలలో "అధికారయుతమైన అనువాదాలు" జారీ చేయవచ్చు. అయితే వాటి మూల ప్రతులు మాత్రం హిందీలో ఉండాలి.

3. భాషను పూర్తిగా మార్పుచేసిన తరువాతకూడా హై కోర్టు న్యాయమూర్తులు ఇంగ్లీషులోనేకాక, "తమ ప్రాంతీయ భాషలలోకూడా తీర్పులు చెప్పడానికి అవకాశ మివ్వాలి. అయితే అట్టి తీర్పులకు వారు ఆమోదించిన ఇంగ్లీషు లేక హిందీ అనువాదాలుకూడా తయారు చేయించాలి." ఉచితమని తోచిన కేసులలో న్యాయవాదులు ఇంగ్లీషులోగాని, ప్రాంతీయ భాషలలోగాని వాదించడానికి అనుమతి యిచ్చే అధికారం న్యాయాధిపాధ్యక్షుడికి ఉండాలి.

48. రాష్ట్రాలలో వివిధ ప్రభుత్వ వ్యవహారాలలోను, హై కోర్టు వ్యవహారాలలోను హిందీగాని, మరో భాషగాని వాడవచ్చునని ఆయా రాష్ట్రాల గవర్నరులు ఆదేశించ వచ్చుననీ, అయితే ఇందుకు ముందుగా రాష్ట్రపతి అనుమతి పొందాలని రాజ్యాంగంలో 348-వ ఆర్టికిలు 2-వ క్లాజులో నిర్దేశింపబడి ఉన్నట్లు లోగడ చెప్పారు. అయితే, హై కోర్టు జారి చేసే తీర్పులకుగాని, డిక్రీలకుగాని, ఉత్తరువులకుగాని ఇది వర్తించదు. ఆ విధంగా ప్రస్తుత రాజ్యాంగ నిర్దేశాలను అనుసరించి హై కోర్టులలో వ్యవహారాలు, తీర్పులు, డిక్రీలు, ఉత్తరువులు కాక మిగిలినవి ఆయా రాష్ట్ర ప్రభుత్వాల యిష్టాన్ని అనుసరించి ఆయా రాష్ట్ర ప్రభుత్వ అధికార భాషలలో జరుపుకొనవచ్చు; అయితే యిందుకు ముందుగా రాష్ట్రపతి అనుమతి పొందడం అవసరం. ఈ ఏర్పాటును మార్చవలసిన అగత్యమేమీ ఈ ఉపసంఘానికి కనిపించడం లేదు. అయితే, కోర్టు ఆజ్ఞలను మాత్రం హిందీ అనువాద సహితంగా ప్రాంతీయ భాషలలో జారీ చేయాలి.

49. ఇంగ్లీషు భాషను మార్పుచేసిన మీదట, హై కోర్టు జారీ చేసే తీర్పులు, డిక్రీలు, ఉత్తరువులు ఒక్క హిందీలోనే ఉండాలా, లేక ఇతర వ్యవహారాలలాగే ఆ హైకోర్టు ఉన్న రాష్ట్రంలోని అధికార భాష, లేక భాషలలోకూడా జారీచేయడానికి అవకాశ మివ్వాలా అన్నదే ఇప్పుడు మనం ముఖ్యంగా ఆలోచించవలసిన విషయం. ఈ సమస్యను పరిష్కరించడం సులభం కాదు.

హిందీ మాతృభాషగా లేని కొన్ని రాష్ట్రాలలో సహా చాలా రాష్ట్రాల ప్రభుత్వాలు అధికార భాషా విచారణ సంఘానికి పంపిన విజ్ఞప్తి పత్రాలలో ఇంగ్లీషు భాషను మార్పు చేసిన మీదట, హైకోర్టుల తీర్పులు, డిక్రీలు, ఉత్తరువులు హిందీలోనే ఉండాలని సూచించినవి. హిందీతోపాటు, ప్రాంతీయ భాషలలో కూడా వాటిని జారీ చేయాలని, ప్రాంతీయ భాషలలో మాత్రమే జారీ చేయాలని మరికొన్ని రాష్ట్రాలు సూచించినవి. హై కోర్టు న్యాయాధిపతులు కూడా ఇలాగే భిన్నాభిప్రాయాలు వెలిబుచ్చారు. ఇంగ్లీషును మార్పు చేసిన మీదట సుప్రీం కోర్టు, హై కోర్టులు పూర్తిగా హిందీలోనే వ్యవహరించాలని అటార్నీ జెనరలు, సొలిసిటర్ జెనరలు పట్టుదలగా వాదించారు.

50. సుప్రీం కోర్టు, హై కోర్టులు ఒకే భాషలో వ్యవహరించాలనడానికి అనుకూలంగా చాలా హేతువులు ఉన్నవి. ఒక హై కోర్టులోని తీర్పులు ఇతర హై కోర్టులలో ఉదహరించే ఆచారం ఉన్నది. ప్రధానంగా, సుప్రీం కోర్టులో విచారణకు వచ్చే హై కోర్టు తీర్పులు మూల పాఠాలుగానే ఉండాలి గాని, వాటి అనువాదాలుగా ఉండకూడదు. అనువాదాలు తరచు వివాద గ్రస్తమయే అవకాశం ఉన్నది. ఒక హై కోర్టు న్యాయవాది ఇతర హై కోర్టులలోను, సుప్రీం కోర్టులోను వాదిస్తూ ఉండడం మామూలు. ఈ ఆచారాన్ని అనుసరించి అఖిల భారత స్థాయిలో

ఒక న్యాయవాదివర్గం రూపొందింది. దేశంలోని వివిధ ప్రాంతాలలోని హై కోర్టులు వివిధ భాషలలో వ్యవహరించే యెడల అనగా అన్ని హై కోర్టులలోను, సుప్రీం కోర్టులోను ఒకే భాషను వాడుక చేయనియెడల ఈ ఆచారం ఇక అట్టే కాలం సాగదు. ప్రస్తుతం, అనుభవజ్ఞులైన హై కోర్టు న్యాయమూర్తులను, ప్రముఖ న్యాయవాదులను సుప్రీం కోర్టు న్యాయమూర్తులుగా నియమించడం ఆచారంగా ఉన్నది. తీర్పులు, డిక్రీలు, ఉత్తరవులు మొదలైన అన్ని వ్యవహారాలలోను కొన్ని హై కోర్టులు, సుప్రీం కోర్టుభాషను గాక ఇతర భాషలను వాడేయెడల ఈ ఆచారానికి కూడా భంగం కలుగుతుంది. మరొక ప్రక్క దేశమంతటా చిన్న కోర్టులన్నీ ప్రాంతీయ భాషలలో వ్యవహరిస్తూ ఉంటాయి. గనుక, హై కోర్టుల తీర్పులు, ఉత్తరవులు ప్రాంతీయ భాషలలో ఉంటే ఆ చిన్న కోర్టులకు అచటి వాది ప్రతివాదులకు అనుకూలంగా ఉంటుందని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. హై కోర్టులు జారీచేసే తీర్పులు, ఉత్తరవులు అన్నీ రూలింగులుగా గ్రంథస్థం చేయబడవు. బహు కొద్ది కేసులలో మాత్రమే సామాన్యంగా సుప్రీం కోర్టులో అపీళ్లు దాఖలు అవుతవి. అందువలన, గ్రంథస్థం చేయదగిన తీర్పులకు, సుప్రీం కోర్టులో అప్పీళ్లు చేయబడిన తీర్పులకు నమ్మకమైన అనువాదాలు తయారు చేయించడానికి అవకాశం ఉండాలి. క్రమేపి కొంత కాలానికి దేశంలో విద్యావంతులలోను, ముఖ్యంగా న్యాయవాదులలోను హిందీ భాషా జ్ఞానం తగినంతగా వ్యాపిస్తుందని, అందువలన, ఒక హై కోర్టులోని న్యాయ వాదులు ఇతర హై కోర్టులకు వెళ్లి వాదించే పద్ధతి భవిష్యత్తులోకూడా సాగుతూ ఉంటుందనీ ఈ ఉపసంఘం ఆశిస్తున్నది. సుప్రీం కోర్టు న్యాయమూర్తులను ఎన్నుకొనడంలో వచ్చే ఇబ్బందిని గూర్చిన భయంకూడా ఆలాగే కాలక్రమేణా తీరిపోతుందని ఈ ఉపసంఘం అభిప్రాయం. ఈలోగా సుప్రీం కోర్టులోను, హై కోర్టులలోను, కూడా ఇంగ్లీషు వాడుకలో ఉంటుంది. కనుక విచారణ సంఘం సలహా ప్రకారం, ఈ సంస్థల వ్యవహార భాషను మార్పు చేసిన తరువాత కూడా ఇంగ్లీషు భాష వాడడానికి వ్యక్తిగతంగా కొందరు న్యాయమూర్తులకు, న్యాయవాదులకు అనుమతి యివ్వవచ్చు. వివిధ రాష్ట్రాలలోని ఇతర వ్యవహారాలలో వలెనే కోర్టులలోను, ఆయా ప్రాంతీయ భాషలే పూర్తిగా వాడాలని ఈ ఉపసంఘం అభిప్రాయం. తదనుగుణంగానే, ముందుగా రాష్ట్రపతి అనుమతి పొందిన మీదట తీర్పులకు, డిక్రీలకు, ఉత్తర వులకు ఆ యా రాష్ట్రాల అధికార భాషను, లేక భాషలను ప్రత్యామ్నాయ భాషలుగా వాడాలని, గ్రంథస్థం చేయదగిన తీర్పులనూ, ఉత్తరువులను హిందీలోకి అనువదింపజేయాలనీ ఈ ఉపసంఘం సూచించింది.

51. శాసన నిర్మాణంలోను, న్యాయ నిర్వహణలోను భాషను మార్పుచేయడానికి ఈ దిగువ ప్రాథమిక చర్యలు తీసుకొన దగినవని ఈ ఉపసంఘం భావిస్తున్నది. న్యాయరంగంలో భాష మార్పుకి తొలిచర్యలు.

1. న్యాయ పరిభాషకు అధికార యుతమైన నిఘంటువు తయారు చేయించడం.

2. కేంద్ర రాష్ట్ర శాసనాలను పొందుపరచే శాసన సర్వస్వమును హిందీలో తిరిగి వ్రాయించి ఆమోదించడం.

52. సాధికార నిఘంటువు లోనికి పూర్వం సంస్థానాలలో వాడుకలో ఉన్న పారిభాషిక పదాలనుండి, నుడికారాలనుండి, ప్రాచీన గ్రంథాలలోనుండి, అవసరమైన చోట అంతర్జాతీయ పరిభాషనుండి, తగిన పదాలను స్వీకరించ వచ్చునని విచారణ సంఘం సూచించింది. భారతదేశంలో న్యాయ శాస్త్రానికి, న్యాయనిర్వహణకు సంబంధించిన ఏకత్వం స్థిరంగా నిలవాలంటే, భారతీయ భాష లన్నిటిలోను న్యాయ పరిభాష ఒకే విధంగా ఉండడం, దేశమంతటా ఒకే విధంగా అర్థమవడం అవసరమని వారి అభిప్రాయము.

ఈ అభిప్రాయాన్ని మొత్తం మీద ఈ ఉపసంఘం అంగీకరిస్తున్నది. హిందీలోను, ఇతర ప్రాంతీయ భాషలలోను, ఒకే విధంగా ఉండే పారిభాషిక, సాంకేతిక పద నిఘంటువు తయారుచేసే యెడల కేంద్ర, రాష్ట్ర శాసనాలను అనువదించడం చాలా సులభం అవుతుంది. ఒకే విధమైన పదాలను వాడడానికి వీలులేని చోట్ల, వివిధ ప్రాంతీయ భాషలలో దానికి పర్యాయ పదాలను ఇవ్వాలి. అట్టి నిఘంటువు ఆయా పదాలకు అర్థమును నిర్వచిస్తుంది. న్యాయ పరిభాషకు ఇది చాలా అవసరం. అంతేకాక, శాసనాలను హిందీలోకి, ఇతర ప్రాంతీయ భాషలలోకి అనువదించడంలో సౌలభ్యం కలిగిస్తుంది. ఆ విధంగా చేయబడిన అనువాదాలకు ఆయా శాసన నిర్మాతలు అధికార ముద్రవేయాలి లేక తిరిగి వాటిని శాసనాలు చెయ్యాలి. ఈ పని చాలా క్లిష్టమైనది గనుక, న్యాయశాస్త్ర సంబంధమైన పరిభాషను, శబ్దార్థ పట్టికలను తయారు చేయడానికి, శాసనాలను హిందీలోకి అనువదించడానికి సంబంధించిన కార్యక్రమాన్ని రూపొందించ డానికి, నిర్వహించడానికిగాను వివిధ ప్రాంతీయ భాషలకు ప్రాతినిధ్యం వహించగల న్యాయశాస్త్ర నిపుణులతో ఒక స్థాయీ సంఘాన్ని ఏర్పాటు చెయ్యడం మంచిదని ఈ ఉపసంఘం అభిప్రాయ పడుతున్నది. ఈ స్థాయీ సంఘం తయారు చేయబోయే సామాన్య న్యాయ పరిభాషనే వాడుతూ రాష్ట్ర శాసనాలను ఇంగ్లీషులోనుండి తమ తమ అధికార భాషలోనికి అనువాదం చేసుకొనడానికి, తగిన చర్యలు తీసుకోవాలనీ, ఈ కృషిలో, కేంద్రాధికారులతో సంప్రదిస్తూ ఉండాలనీ, రాష్ట్ర ప్రభుత్వాలను కోరాలి.

53. న్యాయశాస్త్ర సంబంధమైన పారిభాషిక పదాలను రూపొందించడంలో ప్రస్తుతం జరుగుతున్న కృషిని ఇంకా చురుకుగా సాగించాలని, అట్లా రూపొందించిన శబ్దార్థ పట్టికలను ఎప్పటి కప్పుడు తగిన అధికార ముద్రతో ప్రకటింపజేయాలని విచారణ సంఘం సలహా యిచ్చింది. ఈ సలహాలను ఈ ఉపసంఘం అంగీకరిస్తున్నది. వాటిని ఆమోదించవలసినదిగా కోరుతున్నది.

## 4 వ సెక్షను
## వాడదగిన అంకెలు

కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో వాడదగిన అంకెలు.

54. కేంద్ర ప్రభుత్వ అధికార వ్యవహారాలలో అంతర్జాతీయంగా నేడు వాడుకలో ఉన్న భారతదేశపు అంకెలనే వాడాలని 343 వ ఆర్టికిలు 1 వ క్లాజు విధిస్తున్నది. అయితే రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాత 15 సంవత్సరాలలోగా కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో వేటిలో అయినా దేవనాగరి అంకెలను వాడవచ్చునని రాష్ట్రపతి ఆదేశించవచ్చు. అలాగే 1965 తరువాత కూడ ఏవైనా కొన్ని నిర్దిష్ట వ్యవహారాలలో దేవనాగరి అంకెలను వాడవచ్చునని శాసనం ద్వారా పార్లమెంటు ఆదేశించవచ్చు. కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో దేనిలో ఏ అంకెలను వాడవలసినది సలహా ఈయవలసినదిగా కూడా విచారణ సంఘంవారిని కోరారు. "అంతర్జాతీయంగా వాడబడుతున్న ప్రాచీన భారతదేశపు అంకెలనే దాక్షిణాత్య భాషల లిపులన్నిటిలో ప్రస్తుతం విస్తృతంగా వాడుతున్నారు గనుకను, కేంద్రప్రభుత్వ వ్యవహారాల్లోను, అంతర్రాష్ట్రీయ వ్యవహారాలలోను ఆ అంకెలనే వాడాలని రాజ్యాంగం సూచిస్తున్నందువల్లను, భారత దేశమందంతట ఒకే విధమైన అంకెలు వాడకంలో ఉండాలంటే, ప్రభుత్వ వ్యవహారాలన్నిటిలోనూ వాటినే వాడుక చేయడం అవసరమని తేలుతున్నది," అని విచారణ సంఘం తన నివేదికలో వివరించింది. అందు వల్ల, ఈ అంతర్జాతీయపు అంకెలకు తోడుగా ఫలాని వ్యవహారాలలో దేవనాగరి అంకెలను కూడా వాడాలని ఆదేశించ వలసినదిగా విచారణ సంఘం రాష్ట్రపతికి ఏ విధమైన సలహా యివ్వలేదు. అయితే, "వివిధ మంత్రిత్వశాఖలు వెలువరించే ప్రచురణలలో ఏవి ఏ ప్రజలకు ఉద్దిష్టమైనవో గమనించి, వాటిలో అంతర్జాతీయపు అంకెలకు తోడు దేవనాగరి అంకెలను కూడా వాడడంలో

కేంద్ర ప్రభుత్వం ఒకే విధమైన నిర్దిష్ట విధానాన్ని అనుసరించాలి,'' అని కూడా విచారణ సంఘం సలహా యిచ్చింది. అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న ప్రాచీన భారతదేశపు అంకెలతో పాటు, దేవనాగరి అంకెలను కూడా వాడకం చేసే ఈ నిర్దిష్ట విధానాన్ని రూపొందించడంలో విషయౌచిత్యాన్ని కూడా గమనించాలని ఈ ఉపసంఘం కోరుతూంది. ఆ విధంగా, సామాన్య పరిపాలనా వ్యవహారాలలోనూ, సాహిత్యానికి సంబంధించిన ప్రచురణలలోనూ దేవనాగరి అంకెలను కూడా వాడవచ్చు. అయితే, శాస్త్రీయ, సాంకేతిక, సంఖ్యా సంబంధమైన ప్రచురణలలోనూ అంతర్జాతీయపు అంకెలే సర్వత్రా వాడడం ఉచితం.

## 5 వ సెక్షను

## కాలక్రమ నిర్ణయం

ఇంగ్లీషు స్థానంలో కేంద్ర ప్రభుత్వ అధికార భాషగాను, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల నడుమ సాగే వ్యవహారాలకు ఉపయోగపడే భాషగాను, రాష్ట్ర ప్రభుత్వాల నడుమగాని సాగే వ్యవహారాలకు ఉపయోగపడే భాషగానూ హిందీని వాడకంలోకి తీసికొని రావడానికి కాలక్రమాన్ని నిర్ణయించడం.

55. కేంద్ర ప్రభుత్వ అధికార భాషగాను, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల నడుమ సాగే వ్యవహారాల భాషగాను క్రమక్రమంగా హిందీని వాడుకలోకి తీసుకుని రావడానికి ఉపకరించే ప్రాథమిక చర్యలను కూడా విచారణ సంఘం సూచించింది. అయితే, ఒక నిర్దిష్టమైన కార్యక్రమం, అందులో ఏది ఎప్పుడు జరుగవలసినదీ సూచించే కాలక్రమం, భారత ప్రభుత్వమే తయారు చెయ్యాలని వారి అభిప్రాయం. అవసరమైన ప్రాథమిక చర్యలన్నిటినీ నిర్ధారణచేయడం ప్రస్తుతం ప్రభుత్వోద్యోగుల భాషా పాటవం, వారినందరినీ సుశిక్షితులను చేయడానికి ఉజ్జాయింపుగా నిర్ణయింపదగిన గడువు లేదీ, మొదలైన విషయాలన్నింటినీ పూర్తిగా పరిశీలించి కేంద్ర ప్రభుత్వం ఈ కాలక్రమాన్ని నిర్ణయించాలని కూడా వారి సూచన. ఆ విధంగా నిర్ణయించిన కాలక్రమాన్ని తిరిగి ఎప్పటికప్పుడు సమీక్షిస్తూ, ఆచరణలో పొందిన అనుభవం దృష్ట్యాను, ఉద్యోగులకు శిక్షణ యివ్వడంలో సాధించిన ఫలితాలు మొదలైన ప్రాథమిక చర్యల సాగుదల దృష్ట్యాను, అవసరమైన విధంగా సవరిస్తూ ఉండాలని కూడా వారు పేర్కొన్నారు, వివరాలతోసహా అట్టి ఆచరణీయమైన కార్యక్రమాన్ని సంతృప్తికరంగా రూపొందించే పని. దానిని అమలు జరపవలసిన బాధ్యతగల భారత ప్రభుత్వమే నిర్వహించవలసి ఉంటుంది. అయినప్పటికీ, విచారణ సంఘం సూచించినట్లు ఆ విధంగా చేసిన కార్యక్రమాన్ని, కాలక్రమాన్ని ఎప్పటికప్పుడు, అంతవరకు జరిగిన కృషి దృష్ట్యాను, ఆచరణ యోగ్యతకు సంబంధించిన ఇతర విషయాల దృష్ట్యాను భారత ప్రభుత్వం సమీక్షిస్తూ, సవరిస్తూ ఉంటుందనే విషయం కూడా గుర్తించుకోవాలి. ఈ కార్యప్రణాళికను తయారు చేసేటప్పుడు అధికార భాషా విచారణ సంఘం వారి సలహాలపై ఈ ఉపసంఘం వెలిబుచ్చిన అభిప్రాయాలను, దృష్టిలో ఉంచుకోవాలి.

# ద్వితీయ భాగము

56. ఈ దిగువ పట్టికలో అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలను, వారి నివేదికలో ఉన్న వరుసలోనే అమర్చి వాటిపై పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలుకూడా వివరింపబడినవి :—

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|

## పంచమాధ్యాయం

## పారిభాషిక పదాలు

1. పారిభాషిక పదాలను రూపొందించేటప్పుడు స్పష్టత, నిర్దుష్టత, సుబోధకత ప్రధానంగా పరిగణించాలి. "భాషా పారిశుద్ధ్య" సిద్ధాంతపు పట్టుదలలను సరకు చేయకూడదు.

2. ప్రాచీనకాలంలో వాడుకలో ఉండిన పదాలు, నేడు కర్మకారుల లోను, సుతారులలోను వివిధ తరగతులవారు వాడుతూన్న మాటలు నూతన పారిభాషిక పదాలను రూపొందించడానికి బాగా ఉపకరించవచ్చు. వాటి విషయంలో తగు పరిశీలనలు జరపాలి. ఉచితమైనచోట్ల అంతర్జాతీయ పారిభాషిక పదాలను స్వీకరించాలి, లేక భారతీయ భాషలలో ఇమిడే విధంగా వాటిని మార్పుచేసి గ్రహించాలి.

3. భారతీయ భాష లన్నిటిలో ఈ నూతన పారిభాషిక పదాలు సాధ్యమైనంతవరకు ఒకే విధంగా ఉండేటట్లు చూడాలి.

4. కేంద్ర భాషలోను, వివిధ ప్రాంతీయ భాషలలోను పారిభాషిక పద నిర్ధారణకు వివిధ వ్యవస్థలు చేస్తున్న కృషిని సమన్వయ పరచడానికి తగిన ఏర్పాట్లు చేయాలి.

5. ఇంతవరకు జరిగిన పనిని సమీక్షించగా, ఈ కార్యక్రమాన్ని ఇంకా త్వరితం చేయవలెనని, ఇందుకోసం విడివిడిగా జరుగుతూన్న ప్రయత్నాలను సమన్వయపరిచే కృషిని ఇంకా పటిష్ఠం చేయడం అవసరమని తోస్తుంది.

ఈ సలహాలను ఆమోదించవచ్చు.

## సప్తమాధ్యాయం

## ప్రభుత్వ వ్యవహార భాష—I

## కేంద్ర ప్రభుత్వ అధికార భాష

ప్రభుత్వ వ్యవహారభాషను మార్పుచేయడానికి పూర్వం చేయవలసిన పనులు :

(1) ప్రభుత్వ వ్యవహారాలలో అవసరమయే ప్రత్యేక పారిభాషిక పదాలను రూపొందించి ధ్రువ పరచడం.

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషాసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| | (2) ప్రభుత్వ కార్య కలాపాల నిర్వహణకు సంబంధించిన సూత్రాలు, నిబంధనలు, నియమ సర్వస్వాలు (*Manuals*) మొదలైన గ్రంథజాల మంతటిని హిందీలోకి అనువదింపజేసి, అదికార ముద్రతో ప్రచురించడం. | |
| | (3) నూతన భాషను వాడుకచేయడానికి అవసరమైన సామర్థ్యం, అనుభవసిద్ధమైన సౌలభ్యం సంపాదించ గలిగేటంతగా వివిధ తరగతుల ప్రభుత్వోద్యోగులకు ఆ భాషలో తగినంతగా శిక్షణ ఇవ్వడం. | |
| | (4) ప్రభుత్వ కార్యాలయాలలో పని చురుకుగా సాగ డానికి అవసరమైన టైపు యంత్రాలు, టైపిస్టులు, సంక్షిప్త లేఖనం, సంక్షిప్త లేఖకులు, ముద్రణ యంత్రాలు, నకళ్లు తీసే యంత్రాలు, టెలిప్రింటర్లు, ఇతర సమాచార వినిమయ సాధ నాలు నూతన భాషకు అనువుగా తయారు చేయించి, సరఫరా చేయడం. | |
| | ఇందులో 1-వ. అంశం పంచమాధ్యాయంలో వివరింపబడిన పారి భాషిక పద నిర్ణయ సమస్యకు సంబంధించినది. | |
| 6. | ఇందులో 2-వ అంశం విషయంలో విధాన సూచన గ్రంథ జాలాన్ని అనువదించడంలో సర్వత్ర ఒకే విధమైన పారిభాషిక పదాలను వాడేటట్లు చూడడం అవసరం. కనుక, ఈ పని అంతటినీ పర్యవేక్షిస్తూ, అవసరమైన సూచనలు చేసేందుకు గాను కేంద్ర ప్రభుత్వంలో ఒక ప్రత్యేకాధికార వ్యవస్థను ఏర్పాటుచేసి, ఈ బాధ్యతను యావత్తు దానికి అప్పగించడం ఉచితం. | దీనిని ఆమోదించవచ్చు. |
| 7. | పైన పేర్కొన్న 3-వ అంశం (ఉద్యోగులకు శిక్షణ)లో, ఉద్యోగులలో ఇష్టపడిన వారందరు హిందీ భాష నేర్చుకోవడానికి భారత ప్రభుత్వం ఇంతవరకు చేసిన ఏర్పాట్లు సమీక్షింపబడినవి. | హిందీ భాషలో తగిన పరిజ్ఞానం సంపాదించడం ప్రభుత్వోద్యోగుల విధి అని ప్రభుత్వం ఆదేశించవచ్చు. |
| | ఇట్టి స్వచ్ఛంద విధానంవలన ఫలితం అట్టే లేదని తేలేయెడల ఉద్యోగులందరు తమ ఉద్యోగ ధర్మాలను నిర్వహించడానికి అవసరమైన హిందీ భాషా జ్ఞానమును తగినంత వ్యవధిలోగా సంపాదించాలని ప్రభుత్వం నిర్దేశించవచ్చు. ప్రభుత్వ భాషా విధానాన్ని అనుసరించి ఇది అవసరం. | |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 8. | పైన పేర్కొన్న 4-వ అంశము ననుసరించి, సంక్షిప్త లేఖకులకు, టైపిస్టులకు ప్రత్యేకమైన సెలవు మంజూరుచేసి కేంద్ర ప్రభుత్వ నూతన భాషలో సంక్షిప్త లేఖనం, టైపు, ఆ భాషలో తగినంత జ్ఞానం సంపాదించుకొనడానికి తగిన ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలి. | దీనిని ఆమోదించవచ్చు. |
| 9. | వివిధ ప్రభుత్వోద్యోగాలకు అవసరమైన ఇంగ్లీషు భాషాజ్ఞానానికి ఇప్పుడు పరిగణిస్తూన్న విద్యార్హతలే ఇక ముందు ప్రభుత్వోద్యోగులుగా ఎంచుకొనబడగోరువారికి విధించే హిందీ భాషా జ్ఞానాన్ని నిర్ధారణ చేయడానికి సూచికలుగా ఉపయోగపడాలి. ప్రాథమిక దశలో మాత్రం ఈ ప్రమాణాన్ని కొంత తక్కువగా ఏర్పాటు చేయవచ్చు. | ఈ సూచనను స్థూలంగా ఆమోదించవచ్చు. కాని, సంధికాలంలో మాత్రం ఇంకా కొంచెం తక్కువ స్థాయిని ఏర్పాటు చేయవచ్చు. |
| 10. | నిర్దేశించిన తేదీ నాటికి అవసరమైన పరిజ్ఞానం సంపాదించ లేకపోతే తగు విధంగా శిక్షించడం యుక్తమనే తోస్తుంది. నిర్ణయించిన ప్రమాణానికన్న అధిక పరిజ్ఞానం సాధిస్తే బహుమానాలు మొదలైన ప్రోత్సాహక విధానాలుకూడా ఏర్పాటు చేయవచ్చు. | ఈ సలహాను నిరాకరించవచ్చు. |
| 11. | కేంద్ర ప్రభుత్వ పరిపాలనా వ్యవస్థలోని కొన్ని విభాగాలలో, భారతీయ పారిభాషిక పదాలను రూపొందించవలసిన అవసరం లేని స్థాయిలలో ఆంగ్ల పారిభాషిక పదాలనే ఇక ముందుకూడా నిరవధికంగా వాడుతూ ఉండాలి. అలాగే విదేశాలతో నిరంతర సంబంధం అవసరమయే కార్యకలాపాలలో ఉత్తర ప్రత్యుత్తరాలకు ఉచితమైన చోటనల్లా ఇంగ్లీషు భాషనే వాడుతూ ఉండాలి. | ఈ సలహాను ఆమోదించవచ్చు. అయితే, ఇంగ్లీషు పారిభాషిక పదాలను వాడడం అవసరమనుకున్నంత వరకు వాడవచ్చుననీ, విచారణ సంఘం సూచించిన ప్రకారం నిరవధికంగా వాడనవసరం లేదనీ ఈ ఉపసంఘం భావిస్తున్నది. |
| 12. | కేంద్ర ప్రభుత్వ మంత్రుల కార్యాలయాలు, లేక ప్రభుత్వ శాఖలు మినహా మిగిలిన శాఖలలో—అనగా, రైల్వేలు, తంతి తపాలా, ఎక్సైజు, సరిహద్దు సుంకాలు, రాబడి పన్ను మొదలైన అన్ని వ్యవస్థలలో ప్రభుత్వ వ్యవహార భాష మారాలి. ఈ వ్యవస్థలలోకొన్ని శాఖోపశాఖలుగా దేశమందంతట వ్యాపించి ఉన్నందువలన, ఈ భాషా సమస్య ఈ శాఖల విషయంలో ప్రత్యేక రూపం దాలుస్తూంది. ఈ ప్రభుత్వ వ్యవస్థలు కొంతవరకు సుస్థిరమైన ద్విభాషా విధానాన్ని రూపొందించుకోవాలి. అనగా, కార్యాలయాంతర్గత వ్యవహారాలకు హిందీ భాషనే వాడుతూ, ఆయా ప్రాంతాల ప్రజలతో జరిపే వ్యవహారాలకు ఆ యా ప్రాంతీయ భాషలనే వాడాలి. | దీనిని ఆమోదించ వచ్చు. |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 13. | దేశ మంతట వ్యాపించి ఉన్న ఇట్టి భారత ప్రభుత్వ వ్యవస్థల లోను, శాఖలలోను పనిచేసే ఉద్యోగివర్గ వ్యవస్థనుకూడా పునఃపరిశీలించి, అట్టి ద్విభాషా విధానానికి అనుగుణంగా వికేంద్రీకరించాలి. ఉద్యోగులను ఎన్నుకొనే విధానాలను, ఉద్యోగార్హతలనుకూడా తదనుగుణంగా సంస్కరించాలి. | |
| 14. | ఈ అఖిల భారత శాఖలకు, వ్యవస్థలకు అవసరమైన ఉద్యోగులను కొత్తగా ఎన్నుకొనేటప్పుడు ఆ సంస్థలలోని వేరు వేరు తరగతుల ఉద్యోగార్థులకు అవసరమైన హిందీ జ్ఞాన ప్రమాణాలను ఆ సంస్థలే నిర్దేశించవచ్చు. అలాగే, అవసరమైన చోట్ల ఆయా ప్రాంతీయ భాషలలో వారి జ్ఞానార్హతలనుకూడా నిర్ణయించవచ్చు. ఈ సంస్థల కేంద్ర కార్యాలయాలలో కార్యకలాపాలన్నీ కేవలం హిందీలోనే జరుగుతుంటవి గనుక, కేంద్ర కార్యాలయాలలో వారికన్న వాటి ప్రాంతీయ, మాండలిక కార్యాలయాలలో వారికి హిందీ జ్ఞానార్హతను కొంచెం తక్కువగా నిర్ణయించవచ్చు. | |
| 15. | సంధి కాలంలో, వివిధ ప్రాంతాల వారికి ఉద్యోగావకాశాలు సన్నగిలకుండా చూచేందుకుగాను, హిందీ భాషా పరిచయ ప్రమాణాలను మరి కొంచెం తక్కువ స్థాయిలో నిర్ణయించవచ్చు. అలా నిర్ణయించేటప్పుడు ఆ ప్రాంతంలో విద్యావిధానంలో హిందీ వ్యాప్తి ఎంతవరకు జరిగినది గమనించాలి. అట్టి వారు ఉద్యోగాలలో చేరి, పని చేస్తూ తగిన శిక్షణ పొంది హిందీ జ్ఞానాన్ని తగినంతగా వృద్ధిచేసుకునేందుకు తగిన యేర్పాటు చెయ్యాలి. ఆయా ప్రాంతాలలో హిందీ భాషా బోధన సౌకర్యాలు వృద్ధి అయినకొద్దీ క్రమంగా ఈ ప్రమాణాలను పెంచవచ్చు. | ఈ సలహాలను ఆమోదించవచ్చు. |
| 16. | రైల్వేలు, తంతి తపాలా మొదలైన కేంద్ర ప్రభుత్వ శాఖలు ప్రజలతో జరిపే కార్యకలాపాలలో వాడదగిన భాషను నిర్ణయించే విధానాన్ని ఆ వ్యవస్థలవలన ప్రజలకు కలిగే సౌకర్యాన్ని అనుసరించి రూపొందించాలి. ప్రజా సౌకర్య సాధనాలయిన ఈ శాఖలను, ప్రజలకు అసౌకర్యం కలిగించే విధంగా హిందీ ప్రచారోపకరణాలుగా ఉపయోగించరాదు. హిందీ భాషలో వ్రాసిన సైను బోర్డుల పైన, ఫారములు మొ॥ వాటిలో ప్రజలకు సులభంగా బోధపడే నిమిత్తం ఆ ప్రాంతీయ భాషలో (అవసరమైన చోట ఇంగ్లీషులో) కూడా వాటిని వివరించాలి. | |

| వరుస నెంబరు | అధికార భాషా వివరణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 17. | కొత్తగా వాడుకలోకి వచ్చిన హిందీ పారిభాషిక పదాలను, నుడికారాలను—ముఖ్యంగా ప్రజలతో సన్నిహిత సంబంధంగల ఈ అఖిల భారత శాఖలు వాడుక చేస్తూన్న వాటిని—అన్నింటినీ జాగ్రత్తగా పరిశీలించి స్థానికంగా వాడుకలో ఉన్న పదాలకు, అర్థాలకు విరుద్ధంగా లేకుండా ఉండేటట్టు చూడటం అవసరం. సంస్కృత పదాలు కొన్ని వివిధ భాషలలో కొన్ని కొన్ని ప్రత్యేకార్థాలలో వాడుకలో ఉండవచ్చు. ఈ విషయాన్ని గమనించకుండా, లేక తెలుసుకోకుండా అపార్థక, అనుచిత శబ్దాలను వాడే యెడల, అసలు ప్రభుత్వ భాషను మార్పుచేసి, భారతీయ భాషలు వాడాలన్న ప్రయత్నమే శంకాస్పదం, హాస్యాస్పదం అవుతుంది. | ఈ సలహాను ఆమోదించవచ్చు. |
| 18. | నూతన భాషలో కార్యకలాపాలు సాగించటానికి ఉద్యోగులందరికీ తగిన శిక్షణ ఇవ్వడానికి బదులు, మొదట ఇంగ్లీషులో చేస్తూ, తిరిగి దానినంతటినీ తర్జుమా చేయించడానికి వేరే ఉద్యోగులను, సంస్థలు ఏర్పాటుచేసి, వాటిని నిర్వహించడానికి ప్రజల సొమ్మును అదనంగా వెచ్చిస్తూండటం యుక్తంకాదు. ప్రభుత్వ వ్యవస్థలో అనువాదాలు చేయడానికి తగిన యేర్పాట్లు కొన్ని శాశ్వతంగాను, ఈ సంధికాల సౌకర్యం కోసం కొన్ని తాత్కాలికంగాను ఉండవచ్చు. కాని, హిందీలోనే కార్య కలాపాలు సాగించడానికి ఉద్యోగులకు తగిన శిక్షణ యిచ్చే పద్ధతికి ప్రత్యామ్నాయంగా ఈ అనువాద పద్ధతిని ఉపయోగించరాదు. ప్రభుత్వ కార్యకలాపాలను ఇంగ్లీషులోనే సాగిస్తూ, ప్రజల సొమ్ము అదనంగా వెచ్చిస్తూ వివిధ స్థాయిలలో వాటిని హిందీలోకి అనువదించ వచ్చుననే సూచన- కేంద్ర ప్రభుత్వ వ్యవహార భాషను మార్పు చేయాలని రాజ్యాంగం చేసిన నిర్దేశాలలో ఎక్కడా లేదని మా అభిప్రాయం. | దీనిని ఆమోదించవచ్చు. |
| 19. | కేంద్ర ప్రభుత్వోద్యోగార్థు లందరు తగుమాత్రం హిందీ భాషా పరిచయంగలవారై ఉండాలని కేంద్రప్రభుత్వం నిర్దేశించడంలో న్యాయ విరుద్ధమైనదేమీ ఉండదు. అయితే, ఆ నిర్దేశం అమలులోకి రావడానికి పూర్వం వారికి తగిన దీర్ఘ కాలవ్యవధి ఇవ్వాలి. వారి హిందీ భాషార్హతను కొంత తక్కువ స్థాయిలో నిర్ణయించి, ఆ లోపాన్ని వారు ఉద్యోగం చేసుకుంటూ పొందే శిక్షణవల్ల తీర్చుకోవడానికి అవకాశం ఇవ్వాలి. | దీనిని ఆమోదించవచ్చు. |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 20. | ఉద్యోగస్థులలో నలభైఐదేళ్ళ వయస్సుగలవారు, అంతకు పైబడినవారు హిందీ భాషలో "అర్థం చేసుకోగల జ్ఞానం" సంపాదిస్తే చాలును. ఇంగ్లీషు భాషలో వారి భావ ప్రకటన సామర్థ్యంతో సమస్థాయిని హిందీ భాషలోకూడా సంపాదించాలని విధించకూడదు. అవసరమైతే వారికి ప్రత్యేక పరీక్షలు ఏర్పాటు చేయవచ్చు. | 45 సంవత్సరాలు, అంతకు పైబడిన వయస్సుగల ఉద్యోగస్థులను హిందీ నేర్చుకొనవలెనని నిర్బంధించ కూడదని ఈ ఉపసంఘం అభిప్రాయం. |
| 21. | ప్రస్తుతానికి, కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో దేనిలోగాని, ఇంగ్లీషు భాష వాడకూడదంటూ ఆంక్ష విధించాలని మేము సలహా యివ్వము. | దీనిని ఆమోదించవచ్చు. |
| 22. | రాజ్యాంగం నిర్దేశించిన గడువులోపల మొత్తము మీద ప్రభుత్వ వ్యవహార భాషను మార్పుచేయడానికిగాను ప్రభుత్వ వ్యవహారాలలో హిందీని ప్రవేశపెట్టే విధానానికి తేదీల వారీగా, దశల వారీగా తగిన కాలకార్యక్రమాన్ని తయారుచేయడం మాకు సాధ్యం కాలేదు. భారత ప్రభుత్వ మంత్రిత్వ వ్యవస్థలన్నీ, ఒకే మూల సంస్థకు చెందిన వివిధ శాఖలు అవడం వలన ఆయా శాఖలలో క్రమంగా హిందీని ప్రవేశపెట్టే కార్యక్రమం మొత్తం మీద విడివిడిగాను, వివిధ మంత్రిత్వ వ్యవస్థల, శాఖల సమిష్టి కృషివల్లను సాగవలసి ఉంటుంది. వివిధ మంత్రిత్వ వ్యవస్థలకు, శాఖలకు సంబంధించిన సమగ్రమైన చిత్తు ప్రణాళికనుగాని, అందులో ఏవైనా సమస్యలు ఏర్పడితే వాటినిగాని ముందుగా చేయవలసిన సన్నాహ చర్యల పరిమాణాలను గురించిన అంచనాలుగాని ప్రభుత్వోద్యోగుల ప్రస్తుత భాషా పరిజ్ఞానం, వారికి నూతన భాషలో అవసరమైన శిక్షణ ఇవ్వడానికి సుమారు ఎంతకాలం పట్టేది మొదలైన భోగట్టాగాని భారత ప్రభుత్వం మాకు అందజేయలేదు. అందువల్ల, ముందుగా అవసరమైన సన్నాహ చర్యలను సూత్రప్రాయంగా వివిధ దశలను, క్రమాన్ని అనుబంధ సమస్య లన్నింటినీ పరిష్కరించడానికి తగిన సూత్రాలను మాత్రం మేము సూచించాము. నిర్దిష్టమైన కార్యక్రమ ప్రణాళికను, దానిని అమలు జరపవలసిన కాలక్రమాన్ని భారత ప్రభుత్వమే, సర్వ విషయాలను పరిశీలించిన మీదట రూపొందించాలి. | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలపై ఈ ఉపసంఘం వెల్లడించిన అభిప్రాయాల ననుసరించి, కేంద్ర ప్రభుత్వ అధికార భాషగా హిందీని వాడుకలోకి తీసుకు రావడానికి తగిన కార్యప్రణాళికను భారత ప్రభుత్వమే తయారు చేయించి, అమలు జరపాలని ఈ ఉపసంఘం కోరుతూంది. |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 23. | భారత ప్రభుత్వపు కంప్ట్రోలరు, ఆడిటరు—జెనరలు యాజమాన్యాన పనిచేసే ఇండియన్ ఆడిట్, ఎకౌంట్ల శాఖల విషయం మేము ప్రత్యేకంగా పరిశీలించాము. వివిధ రాష్ట్రాలు ఆయా ప్రాంతీయ భాషలనే అధికార భాషలుగా చేసుకొన్నప్పుడు, ఆయా రాష్ట్రాలతో వ్యవహరించే శాఖ లన్నిటికీ, ఆయా రాష్ట్రాల తాలూకు జమా ఖర్చులను కూర్చి, సరిచూడడానికి అవసరమయినంతవరకు ఆ ప్రాంతీయ భాషలతో పరిచయం అవసరం. అనగా, ఒక ప్రాంతీయ భాషలో చేయబడిన నిర్ణయాలను అనుసరించి ఆ భాషలోనే తయారుచేసి పంపిన జమా ఖర్చులనుండి ఎకౌంట్లను తయారుచేసి, సరిచూడవలసిన, బాధ్యత ఆ రాష్ట్రంలోని ఎకౌంటెంట్ జెనరల్/కంప్ట్రోలర్ కార్యాలయానికి ఉంటుంది. | దీనిని ఆమోదించవచ్చు. |
| 24. | ఆడిట్ కార్యకలాపాలన్నీ రాష్ట్ర విషయంగా చేసేస్తే ఈ సమస్య పరిష్కారం అవుతుందని ఒక సూచన. ప్రస్తుతం వాడుకలో ఉన్న రాజ్యాంగ సిద్ధమైన ఏర్పాట్లలో పెద్ద పెద్ద మార్పులు చేయవలసిన అవసరం కల్పించే ఈ పరిష్కార మార్గాన్ని గురించి ఆలోచించడం అనవసరం. ఒక ప్రక్కన ప్రతి రాష్ట్రంలోను ఉన్న ఎకౌంటెంట్ జెనరల్/కంప్ట్రోలర్ కార్యాలయం వారు ఆ రాష్ట్ర భాషలో వ్రాసిపెట్టిన జమా ఖర్చుల విషయంలో తాము నిర్వహించవలసిన బాధ్యతలను నిర్వహించ గలగడానికి, మరొక ప్రక్కన ప్రస్తుత పద్ధతిలోనే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల జమా ఖర్చుల తాలూకు ఎకౌంట్ల తయారీ పరిశీలనలు కంప్ట్రోలరు/ఎకౌంటెంట్ జెనరల్ యాజమాన్యాన ఇండియన్ ఆడిట్, ఎకౌంట్ల శాఖ అనే ఒకే వ్యవస్థచే నిర్వహింపబడడానికీకూడా వీలైన ఒక నూతన విధానాన్ని రూపొందించ వచ్చుననీ, ప్రస్తుత రాజ్యాంగపు ఏర్పాట్లను మార్పు చేయవలసిన అవసరం లేకుండానే అట్టి విధానాన్ని సాధించాలనీ మా అభిప్రాయం. అయితే, ఇండియన్ ఆడిట్, ఎకౌంట్లశాఖ వ్యవస్థను, విధానాలను కొంతవరకు సంస్కరించవలసి వస్తుంది. ఈ సంస్కరణ, దేశమందంతట శాఖోపశాఖలుగా వ్యాపించి ఉన్న కేంద్ర ప్రభుత్వ శాఖల విషయంలో సూచించిన సంస్కరణలను కొంతవరకు పోలి ఉంటుంది. | దీనిని ఆమోదించవచ్చు. |

## అష్టమాధ్యాయం

# ప్రభుత్వ వ్యవహారాలలో వాడదగిన భాష—II

## హిందీని వాడుక చేయడంలో రాష్ట్రప్రభుత్వం చేసిన కృషి

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 25. | ఒక రాష్ట్రోద్యోగులు ఇతర రాష్ట్రాధికారులతోను, కేంద్ర ప్రభుత్వాధికారులతోను ఏయే స్థాయులలో సంభాషణయు లేక ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపవలసిన అవసరం ఏర్పడేదీ రాష్ట్ర ప్రభుత్వాలే నిర్ధారణ చేసుకోవాలి. అలాగే రాష్ట్ర ప్రభుత్వాలకు హిందీలో వచ్చే టపాలలో వ్యవహరించేందుకు తగిన ఉద్యోగులు ఏయే స్థాయులలో అవసరమయ్యేదీ, ఏయే స్థాయుల ఉద్యోగులకు హిందీలో ఇందుకు తగిన శిక్షణకు ఏర్పాట్లు చేయవలసినదీ కూడా రాష్ట్ర ప్రభుత్వాలే నిర్ణయించుకోవాలి. | దీనిని ఆమోదించవచ్చు. |
| 26. | అంతర్రాష్ట్రీయ వ్యవహారాలలోను, రాష్ట్రానికీ కేంద్ర ప్రభుత్వానికీ మధ్య నడిచే వ్యవహారాలలోను నూతన భాషను ప్రవేశపెట్టడంవలన ఆ కార్యకలాపాలకు సంబంధించిన ఉద్యోగులు హిందీ భాషలో ఎట్టి అర్హతలు సంపాదించవలసినదీ నిర్ణయించి, వాటిని సంపాదించ వలసినదిగా వారిని రాష్ట్ర ప్రభుత్వం ఆదేశించాలి. కేంద్ర ప్రభుత్వంవలెనే, రాష్ట్ర ప్రభుత్వాలుకూడా ఆ విధంగా నిర్దేశించండంలో అక్రమత ఏమీ ఉండదు. ఈ విధంగా నిర్దేశించిన ప్రమాణాలను మించి హిందీ భాషా పాండిత్యం సంపాదించడానికికూడా వారిని ప్రోత్సహించవచ్చు. కాని, ఈ ప్రోత్సాహం ప్రశంసలు, బహుమానాల రూపంలో ఉండాలిగాని, బలాత్కారం, జరిమానాల రూపంలో ఉండకూడదు. ఏమైనా ఈ విషయం ఆయా రాష్ట్ర ప్రభుత్వాలే నిర్ణయించుకోవాలి. | ఈ సలహాలను ఆమోదించవచ్చు. (26, 27) |
| 27. | కేంద్ర ప్రభుత్వంనుండి హిందీ మాట్లాడే రాష్ట్రానికి వెళ్ళే లేఖలకు, పత్రాలకు ఆంగ్ల మూలంతోపాటు, వాటి హిందీ అనువాదాలనుకూడా పంపాలని ఏ రాష్ట్రమైన కోరే యెడల అందుకు తగిన ఏర్పాట్లు చెయ్యాలి. హిందీ భాషను 1965 లోగానే ఈ విధంగా ప్రభుత్వ వ్యవహారాలలో వాడుక చేస్తూండటంవల్ల, ఆ భాషలో సక్రమమైన సంబోధనలు, నుడికారాలు రూపొందవచ్చు. | |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|

## వాడదగిన అంకెలు

| | | |
|---|---|---|
| 28. | నేడు అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న అంకెలకు మొదట భారత దేశమే జన్మస్థానం. కనుక, అవికూడా ప్రాచీన భారత దేశపు అంకెలకు నేడు ఆధునిక భారతీయ భాషలలో ఆయా లిపులతోపాటు రూపొందిన వివిధ రూపాంతరాలను పోలినవే గాని విజాతీయమైనవికావు.<br><br>దక్షిణ దేశంలోని ప్రముఖ ద్రవిడ భాషలు నాల్గింటిలోనూ అంతర్జాతీయపు అంకెలే వాడుకలో ఉన్నవి. కొన్ని చోట్ల మాత్రం అవి ఆయా లిపులలోని అంకెలకు తోడుగా వాడుకలో ఉన్నవి. | దీనిని ఆమోదించవచ్చు. |
| 29. | హిందీ మాట్లాడే ప్రాంతంలోని కొన్ని రాష్ట్రాల్లో స్థానిక ప్రభుత్వ కార్యకలాపాలలో దేవనాగిరి అంకెలు పూర్తిగాగాని అంతర్జాతీయపు అంకెలతోపాటుగాగాని వాడబడుతున్నవి.<br><br>ఈ విధానం అనుసరింపదగినదీ, కానిదీ ఆయా రాష్ట్ర ప్రభుత్వాలే నిశ్చయించుకోవాలి. కేంద్ర ప్రభుత్వానికి సంబంధించినంతవరకు, వివిధ మంత్రిత్వ వ్యవస్థల ప్రచురణలలో అంతర్జాతీయపు అంకెలతోపాటు దేవనాగరీ అంకెలనుకూడా వాడడానికి ఒక నిర్దిష్ట విధానం రూపొందించుకోవాలి. ఆయా ప్రచురణలు ఏ ప్రజలకు ఉద్దిష్టమైనవో గమనించి, తదనుగుణంగా ఈ విధానాన్ని ఏర్పాటు చేసుకోవాలి. | కేంద్ర ప్రభుత్వం విషయంలో ఆయా ప్రచురణలు ఏ ప్రాంత ప్రజలకు ఉద్దిష్టమైనవో, వాటిలోని విషయ మెట్టిదో, గమనించి తదనుగుణంగా అంతర్జాతీయపు అంకెలతోపాటు దేవనాగిరి అంకెలనుకూడా వాడడానికి ఒక నిర్దిష్టమైన విధానం రూపొందించుకొనడం అవసరమని ఈ ఉపసంఘం అభిప్రాయం. |
| 30. | 1960 లో మరొక విచారణ సంఘం ఈ సమస్యను పరిశీలించవలసి ఉన్నది. అప్పటిలోగా ఏయే కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో అంతర్జాతీయపు అంకెలతోపాటు దేవనాగరి అంకెలను వాడాలన్న విషయంలో మేము ఏ విధమైన సలహా యివ్వదలచుకొనలేదు. | ఇది అనవసరం లాగ కనిపిస్తున్నది, కనుక దీనిని గురించి ఆలోచించవలసిన పని లేదు. |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|

## నవమాధ్యాయం

# న్యాయశాస్త్రం, న్యాయస్థాన భాష—I

## శాసనాల భాష

31. శాసన సభలలో సభ్యుల ప్రశ్నలకు జవాబు లివ్వడంలో భిన్న భిన్న ఆచారాలు వాడుకలో ఉన్నట్లు కనిపిస్తున్నది. ప్రశ్నోత్తరాలు మరొక భాషలో ఉన్నప్పుడు ఇతర సభ్యులకు బోధపడే నిమిత్తం వాటిని శాసన సమ్మత భాషలలోకికూడా అనువాదం చేయించి వ్రాతమూలకంగా వారికి అందజేయడానికి కొన్ని చోట్ల ఏర్పాటు ఉన్నది. ఈ యేర్పాటు సర్వత్ర అమలు జరుపడం మంచిది.

32. ఇంగ్లీషుస్థానే పార్లమెంటులో హిందీ భాష, రాష్ట్ర శాసన సభలలో ఆయా రాష్ట్రాధికార భాషలూ వాడుకలోకి వచ్చిన తరువాత, అనగా—పార్లమెంటు విషయంలో 1965 జనవరి 25-వ తేదీ తరువాత హిందీలో లేక ఆ రాష్ట్ర భాషలో లేక తన మాతృభాషలో తన భావాలను సక్రమంగా వ్యక్తీకరించ లేనని ఏ సభ్యుడైనా తెలుపవచ్చు. అలాంటి సందర్భాలలో సభాధ్యక్షులు అట్టి సభ్యులు ఇంగ్లీషులో మాట్లాడడానికి అనుమతించే అవకాశం కల్పించాలి.

(31, 32 — అభిప్రాయం:) రాజ్యాంగంలోని 348-వ ఆర్టికిలులో పేర్కొన్న అంశాలన్నింటిలోగాని, కొన్నింటిలోగాని ఉపయోగింపదగిన భాషను గురించి సలహా ఈయవలసినదిగా మాత్రమే విచారణ సంఘం కోరబడింది. పార్లమెంటులోను, రాష్ట్ర శాసన సభలలోను వాడదగిన భాషలను గురించిన ప్రశంస ఏమీ 348-వ ఆర్టికిలులో లేదు. ఆ విధంగా ఈ సలహాలు విచారణ సంఘ, విచారణీయాంశాలకు అతీతమైనవి కనుక వాటిని గురించి ఆలోచించవలసిన పని లేదు.

33. పార్లమెంటులోను, రాష్ట్ర శాసన సభలలోను చేసే శాసనాల సాధికార మూలప్రతులన్నీ ఎప్పటికైనా హిందీలోనే ఉండాలని మా అభిప్రాయం. అయినా, ప్రజా సౌకర్యార్థం ఆ శాసనాలకు వివిధ ప్రాంతీయ భాషలలో అనువాదాలు అవసరంకావచ్చు. ఆలాగే రాష్ట్ర శాసనాలను ఆ రాష్ట్రంలోని ప్రాంతీయ భాష లన్నింటిలోకి అనువదింపజేసి ప్రకటించడం అవసరం. పార్లమెంటు శాసనాలను దేశంలో వాడుకలో ఉన్న ప్రాంతీయ భాష లన్నింటిలోకి అనువదింపజేసి ప్రకటించడం అవసరం కావచ్చు.

(33 — అభిప్రాయం:) 1965 వరకు, లేక ఇంగ్లీషు స్థానే హిందీ భాష వాడుకలోకి వచ్చేటంతవరకు, పార్లమెంటు శాసనాలన్నీ మామూలు ప్రకారం ఇంగ్లీషులోనే తయారు చేయబడుతూ, వాటికి అధికార ముద్రగల హిందీ అనువాదాలు తయారు చేయించాలి. రాష్ట్రాధికార భాషలన్నింటిలోకూడా వాటి అనువాదాలు తయారు చేయించడానికి ఏర్పాట్లు చేయ్యాలి. రాష్ట్ర శాసనాల విషయంలో రాష్ట్రాధికార భాషలోనే శాసనాలు చెయ్యాలని శాసన సభ నిర్ధారణ చేయవచ్చు. కాని,

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 34. | తగిన అదను వచ్చిన తరువాత, ఎప్పటికైనా దేశంలోని శాసన సంపుటి యావత్తూ ఒకే భాషలో ఉండడం అవసరమనీ, ఆ భాష హిందీ తప్ప మరొక భాష కాజాలదనీ మా అభిప్రాయం. కనుక, రాష్ట్రాలలోను, పార్లమెంటులోను శాసనాలన్నీ హిందీ భాషలోనే తయారుచేయబడాలి. తత్పర్యవసానంగా శాసన సిద్ధములైన ఉత్తరువులు, సూత్రాలు మొదలైనవన్నీ హిందీలోనే ఉండాలి. | 348-వ ఆర్టికిలు, 3-వ క్లాజు ననుసరించి అట్టి శాసనాలకు అధికార ముద్రగల ఆంగ్లాను వాదాలనుకూడా ప్రకటించాలి. శాసనం మూలప్రతి హిందీరోకాక మరొక భాషలో ఉండే యెడల దానితోపాటు దాని హిందీ అనువాదాన్నికూడా ప్రకటించవలసి ఉంటుంది. |

దశమాధ్యాయం

# న్యాయశాస్త్ర భాష, న్యాయస్థాన భాష—II

## న్యాయస్థానాలలో వాడవలసిన భాష

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 35. | సుప్రీం కోర్టుకి సంబంధించినంతవరకు, ఒకే భాషను, అనగా హిందీ భాషనే, కోర్టు వ్యవహారాలన్నింటిలోనూ, తీర్పులు, ఉత్తరువులతో సహా రికార్డులన్నింటిలోను వాడాలి. మార్పుకి అదను వచ్చినప్పుడు సుప్రీం కోర్టు కేవలం హిందీలోనే వ్యవహరించాలి. గ్రంథస్థం చేయబడే తీర్పుల సాధికార ప్రతులనుకూడా హిందీలోనే ప్రకటించాలి. | ఈ సలహాలను ఆమోదించవచ్చు. |
| 36 | హిందీ ప్రాంతంకాని ప్రాంతానికి, లేక హిందీ మాతృభాషకాని వ్యక్తికి సుప్రీం కోర్టునుండి హిందీలో జారీచేయబడే ఉత్తరువులతోబాటు, ఆయా పార్టీల సౌకర్యార్థం, వాటి అనువాదాలనుకూడా పంపాలి. | |
| 37. | సుప్రీం కోర్టు నిర్ణయాలకు వివిధ రాష్ట్రాల అధికార భాషలలో విశ్వసనీయములైన అనువాదాలను తయారు చేయిస్తూ ప్రత్యేకంగా ప్రాంతీయ భాషానువాద పరంపరను రూపొందించాలి. | |
| 38. | హైకోర్టులలో హిందీని, ప్రాంతీయ భాషలను వాడుక చేయడంలోని మంచి చెడ్డలను మేము శ్రద్ధగా పరిశీలించాము. మార్పుకి తగిన అదను వచ్చినప్పుడు, దేశంలోని హైకోర్టులన్నిటిలోను తీర్పులకు, డిక్రీలకు, ఉత్తరువులకు ఒకే భాష వాడడం అవసరమని, కనుక ఇవి అన్ని ప్రాంతాలలోను హిందీ భాషలోనే ఉండాలని నిర్ణయించడానికి, మా అభిప్రాయం ప్రకారం బలవత్తర కారణాలు చాలా ఉన్నవి. | రాజ్యాంగంలోని 348-వ ఆర్టికిలు 2-వ క్లాజు ననుసరించి, ముందుగా రాష్ట్రపతి అనుమతి పొందిన మీదట హైకోర్టు వ్యవహారాలలో రాష్ట్ర అధికార భాషగాని, హిందీగాని వాడవచ్చును. కాని, హై కోర్టులు జారి చేసే తీర్పులు, డిక్రీలు, ఉత్తరువులు ఇంగ్లీషులోనే ఉండాలి. ముందుగా రాష్ట్రపతి |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 39. | హైకోర్టు తీర్పులలోని న్యాయనిర్ణయాలు దిగువ కోర్టులకు మార్గదర్శకాలు కాబట్టి, గ్రంథస్థం చేయదగిన హైకోర్టు తీర్పు లన్నింటికి ఆయా ప్రాంతీయ భాషలలో అనువాదాలు తయారు చేయించాలి. ఈ అనువాదాలు తగినంత విశ్వస నీయమైనవిగా ఉండడం అవసరమని మా అభిప్రాయం. కనుక, తీర్పులను అనువదించే నిమిత్తం, తగిన అదను వచ్చి నప్పుడు ప్రతి హైకోర్టులోను ఒక అనువాదకశాఖను ఏర్పాటు చేయడానికి ఆయా అధికారులు తగిన చర్యలు తీసుకోవాలని మేము సూచిస్తున్నాము. | అనుమతి పొందితే తీర్పులను, డిక్రీలను, ఉత్తరువులనుకూడా హిందీ లోగాని ఇతర అధికార భాషలలోగాని జారీ చేయడానికి అవకాశమిచ్చే బిలు ను పార్లమెంటులో ప్రతిపాదించడానికి రాష్ట్రపతి అనుమతించవచ్చునని ఈ ఉపసంఘం అభిప్రాయం. ఇంగ్లీషు కాక ఇతర భాషలలో జారీ చేయబడిన తీర్పులకు, డిక్రీలకు, ఉత్తరువులకు ఇంగ్లీషు అనువాదాలనుకూడా తయారు చేయించి, వాటితోపాటు జారీ చెయ్యాలి. గ్రంథస్థం చేయదగిన తీర్పులు, ఉత్తరువులు అన్నీ హిందీలోకికూడా అను వదింపబడాలి. |
| 40. | హైకోర్టుల ఆజ్ఞా పత్రాలు, డిక్రీలు, ఉత్తరువులు విషయంలో, అవసరమైన చోట హిందీ మూలప్రతులకుతోడు, ప్రాంతీయ భాషలలో వాటికి అధికారముద్రగల అనువాదాలనుకూడా జారీచేయడానికి ఏర్పాట్లు చెయ్యాలి. | డిక్రీల భాషను గురించి, ఉత్తరువుల భాషను గురించి ఈ ఉపసంఘం అభిప్రాయం లోగడ 38-వ అంశంలో వెల్లడించింది. ఆజ్ఞా పత్రాలు ప్రాంతీయ భాషలలో ఉండాలి. వాటితోపాటు కేంద్ర భాషలో వాటి అనువాదాలుకూడా ఉండాలి. |
| 41. | ఇతర కార్యకలాపాలన్నింటిలో వలెనే, న్యాయస్థానాలలోకూడా సర్వవిషయాలలోను వ్యవహార భాషను మార్పు చేయడానికి గట్టిగా ప్రయత్నించడం అవసరమని మా అభిప్రాయం. అవసరమైనచోట, తగినంత హేతువు ఉన్నప్పుడు అక్కడక్కడ వ్యక్తిగతమైన మినహాయింపులకు అవకాశ మీయవచ్చు. ఉదాహరణకు, సుప్రీం కోర్టులోను, హైకోర్టులలోను న్యాయాధిపులుగా వ్యవహరించడానికి సమర్థులైన వ్యక్తులను మరికొంతకాలం ఉపయోగించుకొనడానికి వీలుగా, ఈ భాషా నిర్ణయాన్ని సడలించవచ్చు. న్యాయవ్యవహార భాష మారి పోయిన తరువాత చాలాకాలం వరకు, ఇంగ్లీషులోనే తీర్పులు చెప్పగోరే న్యాయాధిపులకు ప్రత్యేకంగా అట్టి అవకాశం కల్పించాలి. | దీనిని ఆమోదించవచ్చు. |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 42. | హైకోర్టు న్యాయాధిపుల బదిలీలను గురించి రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘం ఇచ్చిన సలహాల దృష్ట్యాను దేశమంతటికి ఒకే న్యాయవిచారణ వ్యవస్థ ఏర్పాటును గురించి వారుచేసిన సూచనల దృష్ట్యాను హైకోర్టు న్యాయాధిపులకు ఆయా ప్రాంతీయ భాషలలోను, హిందీలోను కనీసపు భాషా పరిచయ పరీక్షలను ఏర్పాటు చేయవచ్చునేమో విచారించాలి. | హైకోర్టు న్యాయాధిపులకు భాషాపరిచయ పరీక్షలు ఏర్పాటు చేయడం ఉచితం కాదని ఈ ఉపసంఘం భావిస్తోంది. అయితే న్యాయాధిపులకు తగు మాత్రం హిందీ భాషా జ్ఞానం, ఆయా ప్రాంతీయ భాషలతో పరిచయం అవసరమని మాత్రం భావిస్తున్నది. |
| 43. | హైకోర్టు న్యాయాధిపులు ఇంగ్లీషులోకూడా తీర్పులు చెప్పడానికి అవకాశం ఇవ్వడంతోపాటు వారు ఆయా ప్రాంతీయ భాషలలో తీర్పులు చెప్పడానికికూడా అవకాశం ఉండాలి. అయితే అట్టి తీర్పుల తాబూకు ఆంగ్ల, హిందీ అనువాదాల పైనకూడా వారు తమ ఆమోద ముద్రవేయాలి. | 38-వ అంశంపైన వెల్లడించిన అభిప్రాయం చూడండి. |
| 44. | భాషను మార్పుచేసిన తరువాతకూడా విలక్షణమైన కేసులలో సుప్రీం కోర్టులో ఇంగ్లీషులోను, ఆయా హైకోర్టులలో ఇంగ్లీషు లేక ఆయా ప్రాంతీయ భాషలలోనూ వాదించడానికి న్యాయవాదులకు అనుమతి ఇచ్చేందుకు తగిన ఏర్పాటు చెయ్యాలి. | దీనిని ఆమోదించవచ్చు. |
| 45. | తగిన సమయం వచ్చినప్పుడు జిల్లా కోర్టుల స్థాయిలోకూడా న్యాయవాదులు, పార్టీలు వారి కిష్టమైతే హిందీ భాషను వాడుక చేయడానికి, అవకాశ మిచ్చేందుకు ప్రయత్నించవలసినదిగా మేము సలహా యిస్తున్నాము. ముఖ్యంగా పెద్ద పెద్ద పట్టణాలలో ఇది అవసరం అని భావిస్తున్నాము. అయితే, అంతకన్న దిగువ స్థాయిలోకూడా అవసరమని తోస్తే ఈ సూత్రాన్ని వర్తింప జేయవచ్చు. | హైకోర్టులకన్న దిగువ కోర్టుల భాషను గురించిన ప్రసక్తి 348-వ ఆర్టికిలులో ఎక్కడా లేదు. అందువల్ల ఈ సలహా విచారణీయాంశాలకు సంబంధించినది కాదు. |
| 46. | ప్రత్యేక న్యాయస్థానాల భాష విషయంలో, ఆ న్యాయస్థానాల నిర్ణయాలు, ఉత్తరువులు ఏదో ఒక ప్రాంతానికి మాత్రమే వర్తించేవి కానప్పుడు అట్టి న్యాయస్థానాల తీర్పులు, ఉత్తరువులు మొదట హిందీలోనే జారీచేయాలని నిర్దేశించాలి. అవసరమైనచోట వాటిని ఇతర భాషలలోకికూడా అనువాదం చేయించి పార్టీలకు అందజేయాలి. హైకోర్టులో వలెనే, ఈ న్యాయస్థానాలలోకూడా, సంధికాలంలో కొంతవరకు ఏ న్యాయాధిపతిగాని తన తీర్పును, లేదా ఉత్తరువును ఇంగ్లీషులో జారీ చేయదలచుకుంటే ఆయనకు ఆ అవకాశం ఇవ్వాలి. | దీనిని ఆమోదించవచ్చు. |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|

ఏకాదశాధ్యాయం

# న్యాయశాస్త్ర భాష, న్యాయస్థానములలో వాడవలసిన భాష—III

## భాషను మార్పు చేయడానికి అవసరమైన చర్యలు

47. శాసన నిర్మాణ రంగంలోను, న్యాయ నిర్వహణ రంగంలోను భాషను మార్పు చేయడానికి ముందుగా ఈ దిగువ సన్నాహ చర్యలు అవసరమని మా అభిప్రాయం:—

1. ప్రామాణికమైన న్యాయశాస్త్ర నిఘంటువును తయారు చేయించడం.

2. కేంద్ర రాష్ట్ర శాసన సభలకు సంబంధించిన శాసన సంపుటి యావత్తు హిందీలోకి అనువదింపజేసి, తిరిగి వాటిని శాసనాలుగా ఆమోదించడం.

48. న్యాయశాస్త్ర పరిభాషను రూపొందించడానికి సంబంధించి నంతవరకు ఈ దిగువ కార్యక్రమాన్ని ఆమోదించి, దానిని సాధ్యమైనంత చురుకుగా కొనసాగించడం అవసరమని మా అభిప్రాయం:

1. న్యాయ రంగంలో వివిధ భారతీయ భాషలలో ఉచితమైన పారిభాషిక పదాలను రూపొందించే కృషి ఇప్పటికన్న బాగా చురుకుగా సాగాలి.

2. ఆ విధంగా రూపొందించబడిన పారిభాషిక పదాల శబ్దార్థ పట్టికలు ప్రామాణికమైనవిగాచేసి తగిన అధికారుల ఆమోద ముద్రతో సహా ఎప్పటికప్పుడు ప్రకటించడానికి తగిన ఏర్పాటు చెయ్యాలి.

3. ప్రభుత్వ యాజమాన్యాన కేంద్ర రాష్ట్ర శాసన సంపుటినంతటిని హిందీలోకి అనువదింప జేయడానికి తగిన ఏర్పాటు చెయ్యాలి. ఆ హిందీ అనువాదాలను తిరిగి ఆయా శాసన సభలలో ప్రతిపాదించి యథావిధిగా ఆమోదించవలసిన అవసరం ఉన్నదేమో నిశ్చయించాలి. ఇందుకోసం నిర్దిష్టమైన ఏర్పాట్లు చేసి, కేంద్ర, రాష్ట్ర శాసనాల విషయంలో ఒక కార్య ప్రణాళికను రూపొందించి అమలు జరపాలి.

ఈ సలహాలను ఆమోదిస్తూ, శాసనాలను అనువదించడం, పారిభాషిక పదాలు నిర్ధారణజేసి వాటికి తగిన శబ్దార్థ పట్టికలను ప్రకటించడం మొదలైన కార్యకలాపాలకు సక్రమమైన ప్రణాళిక తయారుచేసి, అమలు జరపడానికిగాను భారత దేశంలోని వివిధ జాతీయ భాషలకు ప్రాతినిధ్యం వహించే న్యాయ శాస్త్ర నిపుణులతో ఒక స్థాయి సంఘాన్నిగాని, అట్టి ఉన్నత స్థాయి సంస్థనుగాని ఏర్పాటు చేయడం అవసరమని ఈ ఉపసంఘం భావిస్తున్నది.

రాష్ట్ర శాసనాలను ఆయా రాష్ట్రాల అధికార భాషలలోకి అనువదింప జేయడానికి, ఆయా రాష్ట్రాలే కేంద్ర ప్రభుత్వంలోని తత్సంబంధులగు అధికారుల సలహాతో తగు చర్యలు తీసుకోవాలని సలహా యివ్వాలనికూడా మా అభిప్రాయం.

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 49. | యోగ్యులైనవారిచే హిందీలోనే మూల శాసన రచన చేయించే ప్రయత్నం ప్రారంభించడానికి, క్రమంగా అట్టి రచనలో అనుభవం సంపాదించడానికీగాను, హిందీలో మూల శాసన రచనకు ఉపక్రమింపగోరే రాష్ట్రాలకు అవకాశం ఇవ్వడం అవసరమని మా అభిప్రాయం. | ఈ సలహాలను ఆమోదించవచ్చు. |
| 50. | సంధి కాలంలో కొన్నాళ్లు శాసన సంపుటి, అభియోగ శాసనావళి (కేస్ లా) కూడా కొంతభాగం హిందీలోను, మరికొంతభాగం ఇంగ్లీషులోను ఉంటుంది. క్రమక్రమంగా హిందీలో ఉండే భాగం అభివృద్ధి అవుతూవుంటుంది. అట్టి సంధి కాలంలో, హిందీలోను, ఇంగ్లీషులోనుకూడా శాసన ప్రతులను తయారు చేయించడానికి తగిన ఏర్పాట్లు చెయ్యాలి. ఇందులో ఒకటి అధికార శాసనంగాను, రెండవది దానికి అధికార ముద్రతో కూడిన అనువాదంగాను ఉంటుంది. | |

ద్వాదశాధ్యాయం

## కేంద్ర ప్రభుత్వ భాష—ప్రభుత్వోద్యోగ పరీక్షలు

| | | |
|---|---|---|
| 51. | సామాన్యంగా పోటీ పరీక్షల భాష, విద్యా విధానంలో బోధన భాషకు అనుగుణంగా ఉండాలనడానికి విస్పష్టమైన హేతువులున్నవి. | ఈ సలహాను పాటించవలసిన పని లేదు. |
| 52. | కొన్ని శిక్షణ సంస్థలలో బోధన భాషా సమస్యను ఇంతవరకు పరిశీలించినట్టే కనిపించదు. శిక్షణలో చాలా భాగం ఇప్పటికీ ఇంగ్లీషులో సాగుతూంది. వీటిలో ఇంచుమించు అన్నింటిలోను ఇంగ్లీషు బదులు హిందీని ప్రవేశపెట్టవచ్చు. ఇప్పడైనా ఈ విషయంలో తగిన పరిశీలనలు జరిపి, ఈ శిక్షణ సంస్థలలో చేరగోరే అభ్యర్థులకు జరిపే ప్రవేశ పరీక్షల భాషలను—ఒక వంక ఆయా శిక్షణ తరగతులలో బోధన భాషకు, మరొక వంక దేశంలో సెకండరీ విద్యా విధాన బోధన భాషలో జరుగుతూన్న మార్పులకూ అనుకూలంగా నిర్ణయించడానికి అవసరమైన ఏర్పాట్లు చెయ్యాలి. | విచారణ సంఘం నివేదికలో పేర్కొన్న శిక్షణ సంస్థలలో బోధన భాషగా కొంత కాలం వరకు ఇంగ్లీషు భాషనే నిలిపి ఉంచడం అవసరం అవుతుంది. అయినప్పటికీ, శిక్షణలో అన్ని విషయాలకుగాని, కొన్ని విషయాలకుగాని హిందీని బోధన భాషగా ప్రవేశపెట్టడానికి తగిన ఏర్పాట్లు చెయ్యాలి. |
| 53. | ఈ కారణంవల్ల ఈ పరీక్షలలో పూర్తిగాగాని, పాక్షికంగాగాని ఇంగ్లీషుకి ఉద్వాసన చెప్పవలసివస్తే, ప్రస్తుతం దేశంలో చాలా ప్రాంతాలో సెకండరీ విద్యా భాషగా ఇంగ్లీషు స్థానే | ఈ శిక్షణ సంస్థలలో చేరగోరేవారికి జరిపే పరీక్షలను ఇంగ్లీషులోను, హిందీలోను కూడా జరపాలి. కొన్ని పరీక్షా |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| | ప్రాంతీయ భాషలను ప్రవేశపెడుతూండటంవల్ల, పరీక్షలలో కూడా ఇంగ్లీషు స్థానే ప్రాంతీయ భాషలను ప్రవేశపెట్ట వలసి రావచ్చు. ఇందుకోసం ఈ పరీక్షను ప్రాంతాలవారిగా వికేంద్రీకరించవలసి రావడం, తత్పర్యవసానంగా రాష్ట్రాల వారీ కోటా పద్ధతి ఏర్పడటం సంభవించవచ్చు. అయితే ఈ శిక్షణ సంస్థలలోకి రాష్ట్రాలవారీ కోటా పద్ధతి ప్రకారం అభ్యర్థులను ఎన్నుకొనడానికి పరిపాలన శాఖలలో అత్యున్నత స్థాయికి చెందిన అఖిల భారతోద్యోగులను ఎన్ను కొనడంలో ఇట్టి కోటా పద్ధతికీ ముఖ్యమైన వ్యత్యాసాలు చాలా ఉన్నవి. | పత్రాలకుగాని, అన్నింటికిగాని ఇంగ్లీషు లేదా హిందీలో జవాబులు వ్రాయడానికి అవకాశం ఇవ్వాలి. రాష్ట్రాలవారీ కోటా పద్ధతికి దారి తీయకుండా ఉండే విధంగా, ఈ పరీక్షలను ప్రాంతీయ భాషలలోకూడా జరవడానికి అవకాశ మున్నదేమో పరిశీలించడానికి ఒక నిపుణుల సంఘాన్ని నియమించాలి. |
| 54. | ముందు ముందు అఖిల భారతోద్యోగులకు, కేంద్ర ప్రభుత్వ ఉన్నతోద్యోగులకు అవసరమయ్యే భాషా పరిజ్ఞానం దృష్ట్యా కొంత వ్యవధి ఇచ్చి, అప్పటినుంచి ఈ పరీక్షలలో విధిగా ఒక హిందీ పరీక్షా పత్రంకూడా ఏర్పాటు చెయ్యాలి. ఇందువల్ల హిందీ భాషేతర ప్రాంతాల వారికి ఎక్కువ ఇబ్బంది కలుగ కుండా ఉండేందుకుగాను, ఈ పరీక్షా పత్రాన్ని సాధ్య మయినంత సులభ స్థాయిలో ఉంచి, కేవలం లాంచన పరీక్షా పత్రంగా పరిగణించాలి. పిమ్మట కొంతకాలానికి మళ్లీ కొంత వ్యవధి యిచ్చి, దీనిని విధిగా జవాబులు వ్రాయవలసిన ఇతర పరీక్షా పత్రాల స్థాయికి పెంచి, "మార్కింగ్" పోటీ పరీక్షా పత్రంగా చెయ్యాలి. అంతేగాక, దక్షిణ భారత భాషలు మాతృ భాషలుగాగల అభ్యర్థులు మాత్రం ఈ పరీక్షా పత్రంలోని ఒకటి రెండు కఠిన ప్రశ్నలకు జవాబులు వ్రాయవలసిన అవసరం లేకుండాచేసి, హిందీ భాషకు సన్ని హితమైన భాషలు మాతృ భాషగాగలవారు మాత్రం ఆ ప్రశ్నలకుకూడా విధిగా జవాబులు వ్రాయాలని నిబంధించాలి. | |
| 55. | హిందీ అభ్యర్థులను, తదితరులను సమ దృష్టితోచూచే నిమిత్తం, హిందీ అభ్యర్థులు మరొక పరీక్షా పత్రానికికూడా జవాబులు వ్రాయాలని విధించాలి. వీరు సామాన్య పరీక్షా పత్రానికి జవాబులు వ్రాసే భాషలలోనే ఈ పరీక్షా పత్రానికికూడా జవాబులు వ్రాయవచ్చు. ఈ పత్రంలో దక్షిణ భారత సాంస్కృతిక విషయాలు, ఎనిమిదవ అనుబంధంలోని భాషల్లో హిందీ మినహా మిగిలిన భాషలను గురించిన విషయాలు మొదలైనవాటిపై చాలా ప్రశ్నలు అడిగి అందులో వారు ఎన్నుకొన్న కొన్ని ప్రశ్నలకు జవాబులు వ్రాయాలని నియమం పెట్టాలి. | |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| 56. | హిందీ అభ్యర్థులు హిందీకాక ఇతర ప్రాంతీయ భాషలలో లేక (దక్షిణ భారత భాషలలో) ఏదో ఒక దానిలో ఒక పరీక్షా పత్రానికి జవాబులు వ్రాయాలని నిబంధించడం ఉచితమైన "సమశ్వాస పద్ధతి" అన్న సూచన న్యాయసమ్మతమైనదిగా మేము ఆమోదించడంలేదు. | |
| 57. | పరీక్ష జరిపే భాషను ఇతర భాషలోకి, లేక భాషలలోకి మార్చిన తరువాతకూడా, అఖిల భారతోద్యోగాలకు జరిపే పోటీ పరీక్షలలో కొన్ని ప్రత్యేక పరీక్షా పత్రాలకు మాత్రం అభ్యర్థులంతా ఇంగ్లీషులోనే జవాబులు వ్రాయాలని నిబంధించి, వారి ఆంగ్ల భాషా జ్ఞానాన్నికూడా పరీక్షించాలి. | అఖిల భారతోద్యోగాలు, కేంద్ర ప్రభుత్వోన్నతోద్యోగాల విషయంలో ఈ ఉపసంఘం ఈ విధంగా అభిప్రాయపడుతున్నది.<br>1. ఇంగ్లీషునే పరీక్షా భాషగా లిపిని ఉంచాలి. కొంతకాలం గడచిన పిమ్మట హిందీనికూడా ప్రత్యామ్నాయ భాషగా ప్రవేశపెట్టవచ్చు. అభ్యర్థుల ఇచ్ఛానుసారం ఇంగ్లీషులోగాని, హిందీలోగాని ఈ పరీక్ష జరిపే పద్ధతిని అవసరమైనంత దీర్ఘకాలం అమలులోఉంచాలి.<br>2. ముందుగా కొంత వ్యవధి యిచ్చి, సమాన సాయిలో రెండు భాషా పరీక్షా పత్రాలు ఏర్పాటు చెయ్యాలి. అందులో ఒకటి హిందీలోను, మరొకటి హిందీ కాక మిగిలిన ఆధునిక భారతీయ భాషలలో అభ్యర్థి కోరుకొన్న భాషలోను ఉండాలి.<br>3. పరీక్షా భాషను మార్పు చేసిన తరువాతకూడా పూర్తిగా ప్రభుత్వ వ్యవహారాలన్నిటిలోను ఇంగ్లీషు స్థానే హిందీని ప్రవేశ పెట్టేంత వరకు, విధిగా జవాబులు వ్రాయవలసిన పరీక్షా పత్రం ఒకటి ఆంగ్ల భాషలో ఉండాలి.<br>4. ప్రాంతాల వారీ కోటా పద్ధతికి అవకాశమీయవలసిన అవసరం లేకుండా ప్రాంతీయ భాషలను కూడా ఈ పరీక్షలలో ప్రవేశపెట్టడానికి వీలున్నదేమో విచారించడానికి ఒక నిపుణుల సంఘాన్ని నియమించాలి. |
| 58. | అఖిల భారతోద్యోగాలకు, కేంద్ర ప్రభుత్వ ఉన్నతోద్యోగాలకు కూడా అభ్యర్థులను ఎన్నుకొనే సమష్టి పరీక్షలలో ముఖ్యమైన ఇబ్బంది ఒకటి ఉంది. ఈ పోటీ పరీక్షను వివిధ భాషలలో—పదమూడు ప్రాంతీయ భాషలలో—జరిపే యెడల "సానుభూతి పద్ధతి" ని సంతృప్తికరంగా అమలు జరపడం చాలా కష్టసాధ్యం అవుతుందని వేరే చెప్పనక్కరలేదు. పరీక్షా భాషల సంఖ్య ఈ "సానుభూతి పద్ధతి" ని సంతృప్తికరంగా అమలు జరపడం అసాధ్యమయేంత వరకు పెరిగిపోతే—అసలు పరీక్షా స్వభావాన్నే మార్పు చేస్తే తప్ప—కోటా పద్ధతి అనివార్యం కావచ్చు.<br>ఈ కోటా పద్ధతి, అఖిల భారతోద్యోగాల ప్రస్తుత స్వరూప స్వభావాలకే భంగం కలిగించి, అఖిల భారత స్థాయిలో జరిగే ఈ పోటీని ఛిన్న భిన్నం చేయడానికి, అఖిల భారతోద్యోగాలకు కేంద్ర ప్రభుత్వోద్యోగాలకు ఎన్నిక అయ్యే వారి సమర్థత దిగజారిపోడానికి దారితీస్తుంది. ప్రస్తుతం ఉన్నతోద్యోగులు నిర్వహించవలసిన బాధ్యతల దృష్ట్యా, ఈ ఉద్యోగాలకు అసమర్థులైన అభ్యర్థులు ఎన్నిక అవడానికి దారితీసే సూచనలను మేము ఆమోదించలేము. ఈ అఖిల భారతోద్యోగుల ఎన్నిక విషయంలో అన్ని ప్రాంతాలు తమ శ్రేయస్సు దృష్ట్యా కూడా అభ్యర్థుల సామర్థ్యాన్నే ప్రధానంగా ఎంచాలిగాని మొత్తం ఉద్యోగాలలో తమ కోటా తమకు లభించడం ప్రధానంగా ఎంచుకోవకూడదు. అలాగే, కేంద్ర ప్రభుత్వ ఉన్నతోద్యోగాల విషయంలోకూడా ప్రాంతాల వారి పంపకం కన్న ఉద్యోగుల సామర్థ్యమే ప్రధానంగా ఎంచాలనడానికి కూడా ఈ కారణాలే వర్తిస్తవి. | |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సంపోలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| | కనుక, ఈ ఉద్యోగాలకు జరిపే పోటీ పరీక్షలో వాడవగిన భాషల విషయంలో మేము ఈ దిగువ సూచనలు చేస్తున్నాము:—<br><br>అ. అఖిల భారతోద్యోగాలకు, కేంద్ర ప్రభుత్వ ఉన్నతోద్యోగాలకు సంబంధించినంతవరకు (మరొక ఏర్పాటు చేయకపోతే, ఇకముందు సృష్టింపబడే అఖిల భారతోద్యోగాలకుకూడా ఇది వర్తిస్తుంది), తగిన వ్యవధి యిచ్చి, అప్పటినుండి ఈ పరీక్షలలో ప్రస్తుతం వాడుకలో ఉన్న ఇంగ్లీషుతోపాటు హిందీనికూడ ప్రత్యామ్నాయ భాషగా ప్రవేశపెట్టవచ్చు. ఇతర ప్రాంతీయ భాషలుకూడా విశ్వవిద్యాలయాలలో బి.ఏ. వరకూ బోధన భాషలుగా ప్రవేశ పెట్టబడిన మీదట (హిందీ ఇప్పటికే ప్రవేశ పెట్టబడింది) ఈ పరీక్షలో అట్టి ప్రాంతీయ భాషలను ప్రవేశపెట్టే విషయంకూడా ఆలోచించవలసి ఉంటుంది. ఈ పరీక్షలో ప్రాంతీయ భాషలను ప్రవేశ పెట్టడాన్ని గురించి యోచించడానికి, ముందుగా ఆ భాషలు విశ్వవిద్యాలయాలలో ఫలాని స్థాయివరకు బోధన భాషలుగా ప్రవేశపెట్టి ఉండాలని నిర్దేశించాలి.<br><br>ఇంగ్లీషు భాషను ప్రత్యామ్నాయ పరీక్షా భాషగా అవసరమైనంతకాలం వాడుతూ ఉండవచ్చు. చివరకు, ప్రత్యామ్నాయ భాషగా ఇంగ్లీషును తొలగించి వేయడానికి తగిన సమయం వచ్చినట్టయితే తగినంత దీర్ఘకాల వ్యవధియిచ్చి, అప్పటినించి దానిని తొలగించి వేయాలి.<br><br>ఆ. ఈ పరీక్షలు జరపడానికి పరీక్షకులుగా తగిన యోగ్యతలుగల ద్విభాషా వేత్తలు, బహుభాషా వేత్తలూ అవసర మయేటప్పటికీ, ఈ పరీక్షలలోవాడే భాషల సంఖ్య కొంత నియమితంగా ఉన్నంత వరకు "సామభూతి పద్ధతి" ఆచరణ సాధ్యమే కావచ్చు. కాని ఈ పరీక్షలలో కొత్తగా మరొక భాషకు అవకాశ మీయడమనేది అనాచరణీయంగా కనిపించే స్థితి రావచ్చు. | |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| | ఆ స్థితి వచ్చేలోగానే, కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు సంప్రదించుకొని ఈ దిగువ విషయాలలో తగు నిర్ణయాలు చెయ్యాలి—(1) అఖిల భారతోద్యోగులను ఎన్నుకునే విధానంలో మార్పులు చేయడానికి తాము అంగీకరిస్తున్నారా? లేక (2) పరీక్షా భాషలను పరిమితం చేయడానికి అంగీకరిస్తారా? లేక (3) పరీక్షా పద్ధతిలో యుక్తమైన వేరు మార్పులు చేస్తారా? | |
| | ఇ. పైన (అ)లో వివరించిన సంశయాలన్నీ తీరేలోగా, హిందీ మాతృభాషకాని ప్రాంతాల్లోని విశ్వవిద్యాలయ పట్టభద్రులుకూడా తగిన హిందీ భాషా పరిచయం గలవారై, ఈ పరీక్షలలో హిందీ మాతృభాషగాగల అభ్యర్థులతో సమస్థాయిలో హిందీలోనే పోటీ చేయగలరనీ మా ఆశ, విశ్వాసము. | |
| | అప్పటివరకు, హిందీ మాతృభాషకాని అభ్యర్థులలో అవసరమైన వారికి ఇంగ్లీషు ప్రత్యామ్నాయ భాషగా ఉపయోగపడుతూ, వారి న్యాయమైన హక్కులకు రక్షగా ఉంటుంది. | |
| | పైన (అ)లోని రెండవ పేరాలోని క్లిష్ట ప్రశ్నలకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సమాధానాలు సాధించవలసిన అగత్యమే చివరకు ఉండదని మాలో కొందరు ఆశిస్తున్నారు. | |
| 59. | ఈ దేశంలోని ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా అత్యవసరమైన వివిధ భాషా శాస్త్ర పరిశోధనలను ప్రోత్సహించడానికి దోహద చర్యగా పబ్లిక్ సర్వీస్ కమీషన్ జరిపే వివిధ పరీక్షలలో ఆ అధికారులు అభ్యర్థుల ఐచ్ఛిక విషయాల జాబితాను పంస్కరించి, భాషలకు, వివిధ భారతీయ భాషా సాహిత్యాలకు వాటిలో ఇంకా ఎక్కువ అవకాశం ఇవ్వడానికి వీలున్నదేమో పరిశీలించాలి. | దీనిని ఆమోదించవచ్చు. |

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|

త్రయోదశాధ్యాయం

# హిందీ, ప్రాంతీయ భాషల వ్యాప్తి, వికాసం

60. రాజ్యాంగం ఆమోదింపబడినప్పటినుండి, ఈ ఉద్యమం నూతన రూపందాల్చింది. ఇప్పుడు ఈ కార్యక్రమాలకు ప్రభుత్వమే దోహదంచేయడం అవసరం.

దీనిని ఆమోదించవచ్చు.

61. హిందీ భాషా వ్యాప్తికి స్వచ్ఛంద సంస్థలు చేస్తూన్న కృషిని గమనించిన మీదట, మేము హిందీ భాషా ప్రచార కృషి ఇంకా విస్తృతంగా, క్రమబద్ధంగా సాగే నిమిత్తం ఈ దిగువ చర్యలు అవసరమని భావిస్తున్నాము.

1. వివిధ సంస్థల కృషిని సమన్వయ పరుస్తూ అవసర మైన చోట్ల ఆయా సంస్థల కార్యరంగాలను నిర్దేశించడం.

2. ఆయా సంస్థలకు నిర్దేశించిన కార్యకలాపాలను తగినంతగా విస్తృతం చేయడానికి ఆ సంస్థల అవసరా లను పరిశీలించడం.

3. ఆ సంస్థలు జరిపే పరీక్షల ప్రమాణాలలో కొంత వరకు సామరస్య, సాదృశ్యాలను కల్పించడం, ఆ పరీక్ష లను జరపడంలో సముచిత విధానాలు విద్యా ప్రమాణాలు ఏర్పాటు అయేటట్టు చూడటం.

4. బోధన విధానాల అభివృద్ధికి, ఉపాధ్యాయుల శిక్షణకు, ఇతోధిక సౌకర్యాలకు తగిన సహాయం చేయడం.

5. దేశంలో వివిధ ప్రాంతాలకు, హిందీ భాష నభ్యసించే వివిధ తరగతుల వారికి సముచితమైన పక్రమపాఠ్య పుస్తకాలను సమకూర్చడం, వయోజన విద్యార్థులు, పిల్లలు, స్త్రీలు మొదలైన వివిధ తరగతుల ప్రజలు

దీనిని ఆమోదించవచ్చు. కొన్ని హిందీ పుస్తకాలను ప్రాంతీయ లిపులలో ప్రకటించేయెడల హిందీ వాడుకలోలేని ప్రాంతాల వయోజనులు హిందీ నేర్చు కొనడానికి సౌకర్యంగా ఉంటుంది.

| వరుస నెంబరు | అధికార భాషా విచారణ సంఘంవారి సలహాలు | పార్లమెంటు అధికార భాషోపసంఘం అభిప్రాయాలు |
|---|---|---|
| | చదువుకొని భాషాజ్ఞానాన్ని వృద్ధిచేసుకొనడానికి వీలుగా విజ్ఞాన వికాస దాయకములైన గ్రంథాలను ప్రకటింప చేయడం. | |
| | 6. హిందీ ప్రచార కృషికి అనుబంధంగా, కొత్తగా హిందీ నేర్చుకొన్న వారి ఉపయోగార్థం పఠన మందిరాలు గ్రంథాలయాలు ఏర్పాటు చేయడం. | |
| 62. | పైన వివరించిన వివిధ మార్గాలద్వారా హిందీని ప్రచారం చెయ్యడానికిగాను, స్వచ్ఛంద సంస్థలు తమ కార్యకలాపాలను విస్తృతం చేసుకొనడానికి, సంస్కరించుకొనడానికి వీలుగా కేంద్ర ప్రభుత్వం ఉదారంగా ఆర్థిక సహాయం చెయ్యాలని మేము సిఫార్సు చేస్తున్నాము. | దీనిని ఆమోదించవచ్చు. |
| 63. | భాషా శాస్త్రంలోను, భాషా సమన్వయ శాస్త్రంలోను, పరిశోధనలను ప్రోత్సహించడంవలన వివిధ భారతీయ భాషల మధ్య ఇతోధిక సామరస్యం, సాన్నిహిత్యం, బహుముఖ్యమైన భారతీయ సంస్కృతీ స్వరూపగ్రహణం సాధ్యం అవుతవి. అట్టి పరిశోధనలను కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలూ అన్ని విధాలుగాను ప్రోత్సాహించాలి. | దీనిని ఆమోదించవచ్చు. భారతీయ సాహిత్యాన్నికూడా ప్రోత్సహించడం అవసరమని మా అభిప్రాయం. |

## దేవనాగరి లిపి సంస్కరణ

| | | |
|---|---|---|
| 64. | హిందీ టైప్‌రైటరు కీ బోర్డును నిర్ధారణ చేయడం, దేవనాగరి లిపిలో చేయదగిన సంస్కరణలను నిశ్చయించి అధికార ముద్ర వేయడం, అతిశీఘ్రంగా జరగాలి. ఈ పనులు కేంద్ర ప్రభుత్వ నాయకత్వాన, కేంద్ర ప్రభుత్వ యాజమాన్యంలోనే జరగాలి. | ఈ సలహాను ఈ ఉపసంఘం ఆమోదిస్తున్నది. 1953 లో జరిగిన లక్నో మహాసభచేసిన నిర్ణయాలపై ఇటీవల వచ్చిన విభేదాలను తొలగించడానికి తగిన చర్యలు వెంటనే తీసుకోవాలని కోరుతున్నాము. |

జి. బి. పంత్

ఫ్రాంక్ ఆంతొనీ *

మధుర ప్రసాద్ మిశ్ర

కె. ఫి. మాధవన్ నాయర్

అతుల్యా ఘోష్

పి. టి. తాను పిళ్లై

పి. నారాయణన్ నాయర్

ఎస్. ఏ. డాంగే

బి. ఎస్. మూర్తి

గోవింద దాస్ ‡

ప్రమథనాథ్ బెనర్జీ

ఏ. రామస్వామి మొదలియార్

యు. శ్రీనివాస మల్లయ్యా

ఠాకూర్ దాస్ భార్గవ †

స్వామి రామానంద తీర్థ

బుధ్‌సింగ్

గురుముఖ్ సింగ్ ముసాఫిర్

భక్త్ దర్శన్

ఎమ్. హిఫ్జుర్ రహిమాన్

ప్రపుల్ల చంద్ర భంజ్ దేవ్ *

మణిబెన్ వల్లభ్‌భాయి పటేల్

పురుషోత్తమ దాస్ టండన్ †

భగీరథి మహాపాత్ర

బి. భగవతి

ఎ. ఎస్. రాజు

మాణిక్య లాల్ వర్మ

డి. వై. గొహెరాకర్

హెచ్. ఎన్. ముఖర్జి

హరిష్‌చంద్ర శర్మ *

రఘువీర *

---

* భిన్నాభిప్రాయ ప్రకటనకు లోబడి.

† ప్రత్యేకాభిప్రాయ ప్రకటనకు లోబడి.

# సభ్యుల భిన్నాభిప్రాయ ప్రకటనలు, ప్రత్యేకాభిప్రాయ ప్రకటనలు

ప్రొఫెసర్ డాక్టర్ రఘువీర

శ్రీ హరిష్చంద్ర శర్మ

శ్రీ ప్రఫుల్లచంద్ర భంజ్ దేవ్

శ్రీ పురుషోత్తమ దాస్ టండన్, సేత్ గోవింద దాస్

శ్రీ ఫ్రాంక్ ఆంతొనీ

శ్రీ ఠాకూర్ దాస్ భార్గవ

అధ్యక్షుని వివరణ:—భిన్నాభిప్రాయ ప్రకటనలలోను, ప్రత్యేకాభిప్రాయ ప్రకటనలలోను "వ్యాఖ్యానింప దగిన అంశాలుగాని, ఈ ఉపసంఘం చేసిన నిర్ణయాల దృష్ట్యా వివరింపదగిన అంశాలుగాని ఏవైనా ఉన్న యెడల ఈ ఉపసంఘం తరువాత అధ్యక్షుడు తగిన చర్య తీసుకొనవచ్చును" అని 1958 నవంబరు 28-వ తేదీన ఈ ఉపసంఘం చేసిన నిర్ణయాన్ని అనుసరించి ఈ ప్రకటనలలో అక్కడక్కడ సంగ్రహ వివరణలను చేర్చాము.

# ప్రొఫెసర్ డాక్టర్ రఘువీర భిన్నాభిప్రాయ సూచన

రిజిస్టర్డ్ ఎ/డి

ప్రొఫెసర్ డాక్టర్ రఘువీర
పార్లమెంటు సభ్యుడు (రాజ్య సభ)

ఫోన్ నెం. 34700
హౌజ్ ఖాజ్ ఎంక్లేవ్
పోస్టు: యూసఫ్ శరాయ్,
న్యూ ఢిల్లీ-16,
అక్టోబరు 5, 1958.*

సెక్రటరీ,
అధికార భాషా విచారణకు పార్లమెంటు ఉపసంఘం,
భారత ప్రభుత్వ దేశీయ వ్యవహారశాఖా కార్యాలయం,
న్యూ ఢిల్లీ.

ఆర్యా,

నివేదికను చదివాను. అందులో నిర్ణయాలను శ్రద్ధగా పరిశీలించాను. దీనిపై నా అభిప్రాయాలను విస్పష్టంగా, అసందిగ్ధంగా, అహంకార మమకారరహితమైన భాషలో ఈ "భిన్నాభిప్రాయ సూచన" లో వివరించడం, విస్రమ దేశభక్తుడను, జీవితంలో ప్రముఖ భాగం భాషలను గురించి, భాషా సమస్యలను గురించి, పరిశోధించడంలో గడపిన వాడనూ అయిన నా కర్తవ్యంగా భావిస్తున్నాను.

నా "భిన్నాభిప్రాయ సూచన" ను దీనితో జతచేసి పంపుతున్నాను.

మీ యెడ శ్రద్ధాళువు,
రఘువీర
(ప్రొఫెసర్ డా॥ రఘువీర)

---

* ఈ ఉపసంఘం నివేదిక ముసాయిదా ప్రతులు 1958 నవంబరు 17-న సభ్యులందరికీ అందజేయబడినవి. ఈ లేఖ, దానితోపాటు పంపిన సూచనపత్రం ఈ ఉపసంఘ కార్యాలయానికి 1958 నవంబరు 28-న అందింది.

## ప్రొఫెసర్ డాక్టర్ రఘువీర, ఎమ్.ఎ., పి.హెచ్.డి., డి.లిట్., ఎట్.ఫిల్., ఎమ్.పి.

## భిన్నాభిప్రాయ సూచన

భారత రాజ్యాంగంలోని 344-వ ఆర్టికిలు ఈ విధంగా నిర్దేశిస్తున్నది :

2. విచారణ సంఘం ఈ దిగువ విషయాలను గురించి రాష్ట్రపతికి సలహాలీయాలి :

అ. కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో క్రమేపి హిందీభాష ఉపయోగం ;

ఆ. కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలన్నింటిలోగాని, కొన్నింటిలోగాని ఇంగ్లీషు భాషను ఉపయోగించ రాదనే అంశాలు ;

ఇ. 348-వ ఆర్టికిలులో పేర్కొన్న వ్యవహారాలన్నింటిలో లేక కొన్నింటిలో ఉపయోగించదగిన భాష ;

ఈ. కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో ఏ వ్యవహారంలోగాని, వ్యవహారాలలోగాని ఉపయోగించదగిన నిర్దిష్టమైన అంకెలు ;

ఉ. కేంద్ర ప్రభుత్వ అధికార భాషను గురించి జరిగే వ్యవహారాలలో ఉపయోగింపదగిన భాషను గురించి, లేక ఒక రాష్ట్ర ప్రభుత్వం మరొక రాష్ట్ర ప్రభుత్వంతో జరుపు వ్యవహారాలలో ఉపయోగింపదగిన భాషనుగురించి విచారణ చేయవలసినదిగా రాష్ట్రపతి ఈ విచారణ సంఘాన్ని కోరే ఇతర అంశాలు.

3. పైన సూచించిన 2-వ క్లాజులోని అంశాలపై విచారణ సంఘం సలహాలిచ్చేటప్పుడు భారతదేశపు పారిశ్రామిక సాంస్కృతిక వైజ్ఞానికాభ్యుదయాన్నీ, ప్రభుత్వోద్యోగాల విషయంలో హిందీ మాతృభాష కాని ప్రాంతాలవారి న్యాయమైన కోరికలనూ, హక్కులనూ దృష్టిలో ఉంచుకోవాలి.

విచారణ సంఘము, పార్లమెంటు ఉపసంఘముకూడా తమ కర్తవ్యాన్ని నిర్మాణాత్మక ధోరణిలో నిర్వర్తించి ఉండవలసినది. అలా చేయకుండా వారు రాజ్యాంగనిర్ణయంలోని సంకల్పానికి అనుగుణంగాను, అవిధేయంగాను, విరుద్ధమైన ధోరణిని అనుసరించడం నాకు అమితాందోళన కలిగించింది. కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో క్రమంగా హిందీభాషను వాడుకలో పెట్టడానికి ఏటేట చేయవలసిన పనులనుగురించి వారు ఏ విధమైన సలహా ఇవ్వలేదు. కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలన్నింటిలో కాదు సరికదా, కొన్నింటిలోనయినా ఇంగ్లీషును వాడకూడదనే కట్టుబాటును వారు విధించలేరు.

విచారణ సంఘం ఈ విధంగా సలహా యిచ్చింది :

"ప్రస్తుతానికి, కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో దేనిలోగాని ఇంగ్లీషు భాషను వాడకూడదంటూ ఆంక్షలు విధించాలని మేము సలహా యివ్వము."

"రాజ్యాంగం నిర్దేశించిన గడువులోపల మొత్తముమీద ప్రభుత్వ వ్యవహార భాషను మార్పుచేయడానికిగాను, ప్రభుత్వ వ్యవహారాలలో హిందీని ప్రవేశపెట్టే విధానానికి తేదీలవారీగా, దశలవారీగా తగిన కార్యక్రమాన్ని తయారుచేయడం మాకు సాధ్యంకాలేదు."

ఈ మాటలనే పార్లమెంటు ఉపసంఘం తిరిగి వల్లెవేసింది. కార్యాచరణ పథకాన్ని తయారుచేసేపని భారత ప్రభుత్వానికి వదలివేశారు. అయితే, ముందుగా అవసరమైన సన్నాహచర్యలకు, సూత్రప్రాయంగా వివిధ దశలను, క్రమాన్ని మాత్రం విచారణ సంఘం సూచించింది. ఈ సన్నాహచర్యలు, దశలవారీ కార్యక్రమం ఎటువంటివి ? 1965 లోగా కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో వేటిలోను హిందీని ప్రవేశపెట్టడం సాధ్యంకాకుండా చేయగలవి.

నిర్దిష్టమైన కార్యక్రమాన్ని సూచించడం విచారణ సంఘ కర్తవ్యం. విచారణ సంఘం తన కర్తవ్యాన్ని నిర్వర్తించలేకపోయింది. కనుక, ఏయే రంగాలలో ఏ విధంగా ఇంగ్లీషు స్థానే హిందీని ప్రవేశపెట్టవలసినది, ఏయే రంగాలలో ఇంగ్లీషుకి తోడు హిందీని వాడవలసినది నిర్ణయించవలసిన బాధ్యత పార్లమెంటరీ ఉపసంఘానికి సంక్రమించింది. ఈ ఉపసంఘంకూడా తన కర్తవ్యాన్ని నిర్వహించ లేకపోయింది. కనుక, 'ఏమి చేయదగినది, ఏమి చేయవలసినదీ సూచించడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను.

1. 1960 లగాయితు అఖిల భారతోద్యోగాలలో కొత్తగాచేరే వారందరు తమ కార్యకలాపాలను హిందీలోనే నిర్వహించాలి. అందుకు తగిన శిక్షణ ముందుగా వారికి ఇవ్వాలి.

2. అఖిల భారతోద్యోగాలకు జరిపే పోటీ పరీక్షలు హిందీలోను, ఇంగ్లీషులోనుకూడా జరుపుతూ, ఏ భాషలో పరీక్ష యిచ్చేది అభ్యర్థుల నిర్ణయానికి వదలాలి. హిందీలో తగిన పరిజ్ఞానం లేనందువల్ల హిందీ మాతృభాషకాని అభ్యర్థులకుగాని, హిందీ ప్రాంతాల అభ్యర్థులకుగాని ఏవిధమైన అపకారం జరగని విధంగా పరీక్షాపద్ధతి ఏర్పాటు చెయ్యాలి.

3. 1960 లగాయితు కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలలో నూటికి 20 మంది ఉద్యోగులు హిందీలోనే వ్యవహరించాలి. ఈ విధంగా పని ప్రారంభించడానికి పూర్వం 1959 జనవరినుండి 1959 డిసెంబరు వరకు ఒక సంవత్సరంపాటు ఆ ఉద్యోగులకు శిక్షణయిచ్చి వారు హిందీలోనే పనిచేసేటట్టు చెయ్యాలి. ఆ విధంగా, 1964 చివరికి కేంద్ర ప్రభుత్వ కార్యాలయోద్యోగులందరు తమ కార్యకలాపాలు హిందీలోనే నిర్వహిస్తూ ఉంటారు.

ఈ శిక్షణ పొందే వారందరికి తగిన ప్రోత్సాహం, బహుమానాలు ఇచ్చే పద్ధతి ఏర్పాటు చెయ్యాలి.

4. న్యాయశాస్త్రానికి, ప్రభుత్వ కార్యకలాపాలకు సంబంధించిన సాంకేతిక పారిభాషిక పదాలను తోగడ ఒక పార్లమెంటు ఉపసంఘం సేకరించి ధ్రువపరిచింది. ప్రభుత్వం వాటిని స్వీకరించి కేంద్ర ప్రభుత్వ కార్యాలయ వ్యవహారాలలో వాడుకోవచ్చు.

5. విశ్వవిద్యాలయాలలోను, శిక్షణ సంస్థలలోను ఇంగ్లీషు స్థానే హిందీనిగాని ప్రాంతీయ భాషలనుగాని బోధన భాషలుగా ప్రవేశపెట్టడం 1959—60 సంవత్సరంలో ప్రారంభం కావాలి. ఆ సంవత్సరంలో ప్రథమ వత్సర శిక్షణ పొందిన విద్యార్థులు ఆ పైన యేటేట హిందీలోనే లేక ప్రాంతీయ భాషలలోనే అనంతర శిక్షణ పొందుతారు. ఆ విధంగా 1965 వచ్చేసరికి ఇంగ్లీషు స్థానే హిందీ, లేదా ప్రాంతీయభాషలు పూర్తిగా వాడుకలోకి వస్తవి.

అఖిలభారత శిక్షణ సంస్థలన్నింటిలో హిందీభాషే బోధనభాషగా ఉండాలి.

విశ్వవిద్యాలయాలకు ఉపయోగపడగల ఇంగ్లీషు—హిందీ పారిభాషికపద నిఘంటువులు ఇప్పుడు చాల ఉన్నవి. వాటిని ఉపయోగించుకోవచ్చు.

6. కేంద్ర ప్రభుత్వం 1960 నుండి హిందీ రాష్ట్రాలతో జరిపే వ్యవహారాలన్నీ హిందీలోనే సాగించాలి. క్రమంగా ఈ పద్ధతిని ఇతర రాష్ట్రాలకుకూడా వర్తింపజేయాలి. మొదట్లో ఆ రాష్ట్రాలు యిందుకోసం అనువాద కోద్యోగులను ఏర్పాటు చేసుకోవలసి ఉంటుంది. ప్రాంతీయ భాషలలో వచ్చే లేఖలను, పత్రాలను అనువదించడానికి కేంద్ర ప్రభుత్వంలోకూడా అనువాదకోద్యోగులు ఉండాలి.

7. 1960 లగాయితు పార్లమెంటులో బిల్లులన్నింటిని ఇంగ్లీషులోను, హిందీలోనుకూడ ప్రతిపాదించాలి. 1965 తరువాత బిల్లులన్నింటిని కేవలం హిందీలోనే ప్రతిపాదించాలి.

8. ఇంతవరకు ఇంగ్లీషులో చేయబడిన శాసనాలన్నింటినీ హిందీలోకి అనువదించడానికి ఒక సంఘాన్ని* నియమించాలి. ఇది చాలా పెద్దపని. కనుక చాలాకాలం పట్టవచ్చు. అందువల్ల ఈ పని అంతటినీ పదేళ్లలో పూర్తిచేయడానికి చాలినంతమంది అనువాదకోద్యోగులను నియమించాలి.

9. ఉద్యోగనియమ గ్రంథాలు, ఉద్యోగనియమ సర్వస్వాలు, సూచన గ్రంథాలు మొదలైన గ్రంథజాలం† మంతటిని ఏ శాఖ కాశాఖే అనువాదం చేయించుకోవాలి. దానికితగిన ఏర్పాట్లు, అవసరమైన సిబ్బంది సమకూర్చాలి.

10. 45 సంవత్సరాలుగాని, అంతకు పైబడిన వయస్సుగాని ఉన్న అధికారులు హిందీలో శిక్షణ పొందినా అవసరమైనంత భాషా పరిచయం సాధించలేకపోతే అట్టివారికి సహాయంగా హిందీ వచ్చిన ఉద్యోగులను నియమించాలి.

11. 1960 లగాయితు సుప్రీం కోర్టు న్యాయాధిపతులలో హిందీ తెలిసిన న్యాయాధిపతులు హిందీలోనే తీర్పులు చెప్పాలి. ఇంగ్లీషులో జరిగే వ్యవహారాలు, తీర్పులు అన్ని హిందీలోకి అనువదింపబడాలి. ఏటేటా సుప్రీం కోర్టు సిబ్బందిలో నూటికి 20 మందికి హిందీలో పనిచేయడానికి తగిన శిక్షణ ఇవ్వాలి. ఆ విధంగా 1964 నాటికి సుప్రీం కోర్టు కార్యాలయంలో పూర్తిగా హిందీలోనే కార్యకలాపాలన్నీ జరుగుతూ ఉండాలి. హిందీలో తీర్పులు చెప్పలేని సుప్రీం కోర్టు న్యాయధిపతులుమాత్రం 1965 వరకు ఇంగ్లీషులో తీర్పులు చెప్పడానికి అవకాశం ఇవ్వాలి. 1965 తర్వాత వీరుకూడా హిందీలోనే తీర్పులు చెప్పాలి. అందుకుతగిన సహాయ సౌకర్యాలు వీరికి సమకూర్చాలి.

12. 1960 లగాయితు హిందీ ప్రాంతాలలోని హైకోర్టులన్నీ ఇంగ్లీషుతోపాటు హిందీలోకూడా పనిచేస్తూ ఉండాలి. హింది తెలిసిన న్యాయాధిపతులు హిందీలోనే తీర్పులు చెప్పాలి. హిందీ వాడుకలోలేని రాష్ట్రాలలోని హైకోర్టులలో 1960 లగాయితు వ్యవహారాలన్ని ఇంగ్లీషుతోపాటు ప్రాంతీయ భాషలలోను, హిందీలోను జరగాలి. 1965 తరువాత ఇంగ్లీషు స్థానే వ్యవహారాలన్నీ హిందీలోను, ప్రాంతీయ భాషలలోను మాత్రమే జరుగుతూ ఉండాలి. అవసరమైన న్యాయాధిపతులకు హిందీలోను, ప్రాంతీయ భాషలలోను తీర్పులు తయారుచెయ్యడానికి తగిన సహాయ సౌకర్యాలు సమకూర్చాలి.

13. హిందీ భాషలో దేవనాగరి అంకెలనే వాడాలి. హిందీ, పంజాబీ, మరాఠీ, గుజరాతీ భాషలను వాడే ప్రజలకు దేవనాగరి అంకెలే తగినవని రైల్వే టైంటేబుళ్లలోను, ఆదాయవ్యయ పట్టికలలోను ఈ అంకెలను వాడడంవలన లోగడకలిగిన అనుభవంవల్ల రుజువయింది. కళా దృష్ట్యా, ఈ అంకెలే దేవనాగరి లిపికి తగినవి. ఇంగ్లీషులోను, దక్షిణ భారత భాషలలోను ఇంగ్లీషు అంకెలనే వాడుతూ ఉండవచ్చు. నాణెములమీద స్టాంపులమీద ఇప్పటిలాగే దేవనాగరి అంకెలు, ఇంగ్లీషు అంకెలుకూడ వాడుతూ ఉండవచ్చు.

14. భారతదేశపు పారిశ్రామిక, సాంస్కృతిక, వైజ్ఞానిక అభ్యుదయాన్ని ముఖ్యంగా దృష్టిలో ఉంచుకోవాలని రాజ్యాంగం స్పష్టంగా నిర్దేశించింది. హిందీ మరియు ప్రాంతీయభాషలు వాడకంలోకి వస్తేనే ఈ అభ్యుదయానికి విశేషంగా దోహదం జరుగుతుంది. ప్రస్తుతం ఇంగ్లీషు నేర్చుకోవడానికి వెచ్చించే కాలం ఇక మీదట గణితం, సాంకేతిక విషయాలు, రసాయన శాస్త్రం, పదార్థ విజ్ఞాన శాస్త్రం ఇంకా ఎక్కువగా నేర్చుకోవడానికి ఉపయోగపడుతుంది.

---

* ఈ నివేదికలోని 52 వ పేరా (పేజి 25 లోను), 41 వ పేజిలోను ఈ ఉపసంఘం తన అభిప్రాయం వ్యక్తం చేసింది.

† ఈ నివేదికలోని 30 వ పేరా (పేజి 14) చూడాలని కోరుతున్నాము.

కార్మికులుకూడా మాతృభాషద్వారానే తమ విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోగలుగుతారు. తక్కువ కాలంలో ఎక్కువ మందికి శిక్షణ ఇవ్వడానికి వీలవుతుంది. ఇప్పుడు లోపంగా ఉన్న సాంకేతిక గ్రంథజాలం క్రమంగా వృద్ధి అవుతుంది. నిజానికి దీనికి ఇదే గొప్ప అభివృద్ధి అని చెప్పాలి. సాంకేతిక గ్రంథజాలం స్వయంగా రూపొందించుకోనని భాష ఎన్నటికి ఆధునిక భాషగా పరిగణింపబడదు. మనం ఇంగ్లీషునే పట్టుకొని ప్రేలాడుతున్నంతవరకు భారతీయగ్రంథాలవంక చూసే వాడుండరు.

విదేశభాషద్వారా సాంస్కృతికాభ్యుదయం ఎన్నటికి సాధించలేము. స్వభాషలద్వారానే మనం పరస్పరం సన్నిహితులం కాగలం.

15. హిందీ వాడుకలోలేని ప్రాంతాలవారిని తగినంత మందిని ఉద్యోగాలలోకి ఎన్నిక చేయడానికి ప్రభుత్వం ఏర్పాట్లు చెయ్యాలి. అవసరమైతే, ప్రాంతాలవారీగా కోటాలను నిర్ణయించవచ్చు. లేదా హిందీవారిని ఇంతమందికన్న ఎక్కువగా తీసుకోకూడదని నియమం పెట్టాలి.

రఘువీర.

---

# శ్రీ హరిష్‌చంద్ర శర్మ భిన్నాభిప్రాయ సూచనకు అనువాదం

అధికార భాషా విచారణకు పార్లమెంటు నియమించిన ఉపసంఘం తయారుచేసిన ఈ నివేదిక ఇంగ్లీషులో రచింపబడినదని ముందుగా మీకు జ్ఞాపకం చేస్తున్నాను. అనగా, నాకు ఇంగ్లీషు రాకపోతే, నేనీ ఉపసంఘంలో, సభ్యుడుగా ఉండటం నిరర్థకమన్నమాట. నాకు ఇంగ్లీషు కొంచెం వచ్చు—నిజానికి ఈ దేశంలో చాలా కొద్దిమందికి మాత్రమే ఇంగ్లీషు బాగా వచ్చు. అయితే, ఈ దేశంలో ఎంతమంది ఇంగ్లీషు చదివి అర్థం చేసుకోగలరనేది మనం ఆలోచించాలి.

ఈ దృష్ట్యా, అధికార భాషాసమస్య మన ప్రభుత్వాన్ని ఎదుర్కొంటూన్న ప్రముఖ జాతీయ సమస్య. ప్రజాస్వామ్య మంటే "ప్రజోపయోగార్థం ప్రజలతో ప్రజలే ఏర్పాటుచేసుకొన్న" ప్రభుత్వం అని తరచు చెపుతూ ఉంటారు. పరస్పరభావ వ్యక్తీకరణకు మానవుల సాధనం భాష. కనుక ప్రజల భాషలోనే ప్రభుత్వం వ్యవహరించాలి. ఇంగ్లీషు ఈ దేశంలో ఎవరి భాష ? అని నేను ప్రశ్నిస్తున్నాను.

ఈ దేశంలో ఇంగ్లీషు ఎవరికీ స్వభాషకాదు.† ఇంగ్లీషు వచ్చినవారు ఈ దేశంలో బహు కొద్దిమంది. నూటికి ఒక్కడూకూడా ఉండకపోవచ్చు. కనుక ఈ దేశంలో ఇంగ్లీషు అధికారభాషగా వాడుకలో ఉన్నంతవరకు, ఇక్కడ ప్రజాస్వామ్యం వర్ధిల్లడం కల్ల. నూటికి 99 మందికిపై చిలుకు ప్రజలు ప్రభుత్వ వ్యవహారాలలో పాల్గొనలేరు, అర్థం చేసుకోలేరు. దీనికి ఫలితంగా, ఈ దేశంలో దారుణమైన తమాషా ఒకటి నిరంతరంగా సాగుతూంది. ఒక్క ఉదాహరణ చెప్తాను. ప్రాంతీయాభివృద్ధి కార్యక్రమానికి సంబంధించిన ప్రచార సాహిత్యమంతా ఇంగ్లీషులో అచ్చవుతూంది.

అధికార భాషాసమస్యకు సంబంధించిన ఈ అత్యంత ప్రధానవిషయాన్ని అధికారభాషా విచారణ సంఘంగాని, పార్లమెంటు ఉపసంఘంగాని గమనించకపోవడం చాలా శోచనీయం.

అధికార భాషాసమస్య విడిగా చర్చింపదగిన ప్రత్యేక సమస్యకాదు. దానికి ముడిపెట్టుకొన్న అనుబంధ విషయాలెన్నో ఉన్నవి. వాటినన్నింటినీ శ్రద్ధగా పరిశీలించకుండా, ఈ సమస్య విషయంలో ఏవో నిర్ణయాలు చేయడానికి వీలులేదు. అభివృద్ధి నిరోధక ధోరణిలో అధికార భాషా విచారణ సంఘంకన్నకూడా దారుణంగా వ్యవహరించింది పార్లమెంటు ఉపసంఘం. అందువల్ల ఈ ఉపసంఘ సూచనలకు ప్రాధాన్యం ఏమీలేదు.

ఈ దేశంలో ఇంగ్లీషు భాషా ప్రమాణాలు దిగజారిపోతున్నాయని ఈ ఉపసంఘం అంగీకరించింది. తత్పర్యవసానంగా ఇంగ్లీషులో కార్యకలాపాలు సాగించడం క్రమక్రమంగా దుష్కరమవుతుందనడం తప్ప, దానికి సంబంధించిన యితర విషయాలేమీ ఈ ఉపసంఘం పట్టించుకోలేదు. ఈ వైఖరి అవివేకత, ఆలసత, అశ్రద్ధలకు ప్రత్యక్ష చిహ్నం. ఇంగ్లీషుభాషను బలవంతంగా తెచ్చి, నెత్తినపెట్టడంవల్ల వేలకొలది బాల బాలికల భవిష్యత్తు అంధకారబంధురమై పోతూంది. 1957–58 సంవత్సరంలో ఢిల్లీ హయ్యర్ సెకండరీ స్కూలు పరీక్షాఫలితాలు నేను స్వయంగా చూశాను. ఆ పరీక్షలో మొత్తం 450 మంది ఒక్క సబ్జెక్టులోపోయి పరీక్ష తప్పారు. వీరిలో 250 మందికిపైగా, అంటే నూటికి అరవైమంది ఇంగ్లీషులో తప్పారు. ఈ బిడ్డల జీవితాలు ఈ విధంగా నిరాశా నిస్పృహలపాలై పోవడానికి బాధ్యులెవరు ? ఇంగ్లీషును అధికారభాషగా నిలిపి ఉంచి, ఆ గుదిబండను బలవంతంగా వారి మెడకు గట్టినవారిదే ఆ బాధ్యత అని స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. పైగా మరొక విషయంకూడా మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. దేశంలోని వివిధ రాష్ట్రాలనించి వచ్చిన ప్రజలు చాలామంది ఢిల్లీలో ఉంటున్నారు. కనుక, ఇంగ్లీషుకి ఇక్కడ ఉన్నంత ప్రాధాన్యం దేశంలో మరొకచోట లేదు.

---

† 1951 జనాభా లెక్కల ప్రకారం, ఈ దేశంలో ఇంగ్లీషు మాతృభాషగా గలవారు 1,71,742 మంది ఉన్నారు.

కేవలం ప్రభుత్వకార్యకలాపాల దృష్ట్యా చూసినా ఈ సమస్య చాలా దారుణపరిణామాలకు దారితీస్తుంది.

1. ప్రభుత్వోద్యోగులలో అసమర్థత, అనుచితప్రవర్తన పెచ్చు పెరిగిపోతున్నవి. ఉద్యోగులంతా తమకు వచ్చీరానిభాషలో వ్యవహరించాలి. అందువల్ల చాలా అనర్థాలకు అవకాశం ఏర్పడుతూంది.

2. ప్రభుత్వోద్యోగులు తాము వ్రాసిన విషయాన్నే తాము సక్రమంగా అర్థం చేసుకోలేకపోతున్నారు. అందువల్ల ప్రభుత్వానికి ప్రజలకు మధ్యనడిచే వ్యవహారాలలో వంచన, మోసకారితనం విరివిగా సాగుతూన్నవి. ప్రజలకు ఇదంతా మాయాజాలంగా కనిపిస్తూంది.

3. ప్రజలు సంభాషణల్లోను, చదువుకునేటప్పుడు, పరస్పరం అర్థం చేసుకోవడానికి ఉపకరించడం భాషయొక్క ప్రధాన ప్రయోజనం. మిడిమిడి భాషాజ్ఞానంవల్ల ఈ ప్రయోజనం సిద్ధించదు. దీనివల్ల అవినీతికూడా హద్దు మితిమీరిపోతుంది.

దేశంలో ప్రభుత్వకార్యకలాపాలు వాస్తవంగా ప్రజాస్వామ్య పద్ధతులలో సాగాలన్నా, ప్రజలకు ప్రభుత్వానికి మధ్య సన్నిహిత సంబంధం ఏర్పడాలన్నా ప్రభుత్వ వ్యవహారాలన్నీ హిందీలోను, ఇతర ప్రాంతీయ భాషలలోను సాగించడం వెంటనే ప్రారంభించాలని నా నిశ్చితాభిప్రాయం. ప్రభుత్వ కార్యకలాపాలలో చాలాభాగం వెంటనే ఏవిధమైన ఇబ్బందీ లేకుండా హిందీలోను, ఇతర ప్రాంతీయ భాషలలోను జరపడానికి వీలయినవి. శాసన గ్రంథాలను అనువదించడానికి, శాస్త్ర సాంకేతిక పరిభాషిక పదాలను రూపొందించడానికి కొంతకాలం పట్టవచ్చు. కాని గట్టిగా కృషిచేస్తే ఆ పనికూడా ఒక్క సంవత్సరంకన్న ఎక్కువ పట్టదు. విశ్వవిద్యాయాలు ఈ పనులు చాలా చురుకుగాను, సంతృప్తికరంగాను చేయగలవు. ఈ కార్యక్రమం అంతా కేంద్రప్రభుత్వ పర్యవేక్షణక్రింద జరగాలని, న్యాయశాస్త్ర పరిభాష, విజ్ఞానశాస్త్ర పరిభాష దేశమంతట అన్ని భాషలలోను ఒకే విధంగా ఉండాలనీ ఈ ఉపసంఘం చేసిన సూచనతో నేను ఏకీభవిస్తున్నాను.

ఇంగ్లీషు లేకపోతే విజ్ఞాన శాస్త్రాభివృద్ధే లేదన్నట్లు, ఈ ఉపసంఘం ఈ నివేదికలో ఇంగ్లీషుకే విజ్ఞాన శాస్త్రానికి గట్టిముడి పెట్టింది. నిజానికి సత్యం దీనికి విరుద్ధంగా ఉన్నది. ఇంగ్లీషు మాట్లాడే దేశాలను మినహాయిస్తే, తమ మాతృభాషలలో వ్యవహరించే దేశాలలోనే విజ్ఞానశాస్త్రం విశేషంగా అభివృద్ధి చెందింది. ఫ్రాన్స్, రష్యా, జర్మనీ, జపాన్ దేశాల్లో ఇంగ్లీషు ఎవరు వాడుతున్నారని నా ప్రశ్న. వీటిలో జర్మనీ, రష్యాలు విజ్ఞాన శాస్త్రాభ్యుదయానికి చాలా అపారమైన కృషి, ఇతర దేశాలేవీ చేయనంత గొప్ప కృషిచేసినవి. భారతదేశంలోకూడా విజ్ఞాన శాస్త్రాభివృద్ధి సాధ్యమయితే అది కేవలం మాతృభాషలద్వారానే సాధ్యమవుతుంది.

ఇంగ్లీషును కేవలం పిచ్చిగా అనుకరించనట్లయితే, విద్యావికాసంకూడా మాతృభాషలద్వారానే సాధ్యమవుతుంది.

నా అభిప్రాయాలు ఇవి :—

1. రాష్ట్ర ప్రభుత్వాలన్నీ తమ కార్యకలాపాలను ప్రాంతీయ భాషలలోనే జరపాలి.

2. కేంద్ర ప్రభుత్వం తన కార్యకలాపాలను హిందీలో జరపాలి. హిందీప్రాంతాలు కాని ప్రదేశాలలో ఉన్న కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలు ప్రజలతో వ్యవహరించేటప్పుడు ఆయా ప్రాంతీయభాషలనే వాడుతూ మిగిలిన కార్యకలాపాలన్నింటికీ హిందీని వాడాలి.†

3. హైకోర్టులు, సుప్రీం కోర్టు హిందీలోనే వ్యవహరించాలి. అవసరమైనచోట్ల ప్రాంతీయభాషలలో అనువాదాలకుతగిన ఏర్పాటు చెయ్యాలి.

4. విశ్వవిద్యాలయాలలో బోధన, పరీక్షలు ప్రాంతీయభాషలలోనే జరపాలి. పోస్టు గ్రాడ్యుయేట్ విద్యలో సాధ్యమైనంత త్వరగా హిందీని ప్రవేశపెట్టడానికి వీలుగా హిందీ వ్యాప్తికితగిన కృషిచెయ్యాలి.

---

† ఈ ఉపసంఘం అభిప్రాయం ఈ నివేదికలో 30 వ పేజీలో ఉన్నది.

5. ఏ రాష్ట్ర ప్రభుత్వమైనా కేంద్రప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రాంతీయభాషలోనే జరుపగోరినయెడల, అందుకు అనుమతించాలి. తమ హైకోర్టు ప్రాంతీయభాషలోనే వ్యవహరించాలని ఏ రాష్ట్ర ప్రభుత్వమైనా కోరేయెడల దానికికూడా అనుమతించాలి.†

ఈ వ్యవహారాలకు సంబంధించిన రెండు విషయాలను శ్రద్ధగా ఆలోచించాలి. అందులో ఒకటి అనువాదాల సమస్య. హిందీనుండి ప్రాంతీయభాషలలోకి ప్రాంతీయభాషలలోనుండి హిందీలోకి అనువాదాలు చేయించడానికి తగిన ఏర్పాట్లు చెయ్యాలి. ఇది అంత దుష్కరమైన పనికాదు. ప్రస్తుతం దేశమునకు భారముగా ఉన్న ఆంగ్ల విద్వాంసులు ఇంగ్లీషు పుస్తకాలను, సాహిత్యాన్ని ప్రాంతీయభాషలలోకి అనువదిస్తూ దేశానికి కొంతవరకూ ఉపయోగపడవచ్చు.

హిందీ కేంద్రప్రభుత్వ అధికారభాష అయితే హిందీ మాట్లాడని ప్రాంతాలవారికి కేంద్ర ప్రభుత్వోద్యోగాలు సంపాదించడం కష్టమవుతుంది. ఇది రెండవ సమస్య. ఈ సమస్యకు ఒక పరిష్కారమార్గం ఈ ఉపసంఘ నివేదికలోనే ఇమిడి ఉంది. కేంద్ర ప్రభుత్వోద్యోగుల ఎన్నికకోసం జరిపే పోటీ పరీక్షలలో హిందీ మాతృభాష కాని ప్రాంతాలువారు తప్పకుండా వ్రాయవలసిన ఒక హిందీ పరీక్షాపత్రం హిందీ ప్రాంతంవారు తప్పకుండా వ్రాయవలసిన ఒక ప్రాంతీయభాషా పరీక్షాపత్రం ఏర్పాటు చేయాలనీ, రెండూ ఒకే స్థాయిలో ఉండేటట్లు చూడాలనీ ఉపసంఘం సూచించింది. అనగా హిందీప్రాంతపు అభ్యర్థులకు మరొక ప్రాంతీయభాషలో ఎంత పరిజ్ఞానం అవసరమో, హిందీ మాతృభాష కాని ప్రాంతాల అభ్యర్థులకు హిందీలో అంతే పరిజ్ఞానం అవసరమవుతుంది. దీనికి తోడు అవసరమైతే కొంతకాలంవరకు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాలలో హిందీ ప్రాంతంవారు ఇంతకన్న ఎక్కువమంది ఉండకూడదని ఒక నియమం ఏర్పాటు చేయవచ్చు. అనగా, పది సంవత్సరాలవరకు, కేంద్ర ప్రభుత్వోద్యోగాలలో వచ్చే ఖాళీలలో హిందీ ప్రాంతంవారిని నూటికి 20 లేక 25 మందికన్న ఎక్కువమందిని నియమించకూడదనే నియమం ఏర్పాటు చేయవచ్చు. అలా చేస్తే, హిందీ మాతృభాష కాని ప్రాంతాలవారి భయసంశయాలు తీరిపోవడం, కేంద్ర ప్రభుత్వోద్యోగ వ్యవస్థ అఖిల భారతీయ స్వరూపానికి భంగం కలుగకుండా ఉండడంకూడ జరుగుతూంది.

అధికార భాషాసమస్య విషయంలో ప్రాతిపదిక విధానాలను పార్లమెంటు సూచించాలని, వివరాలకు సంబంధించిన నిర్ణయాలను మాత్రమే కేంద్ర ప్రభుత్వానికి విడిచిపెట్టాలని నా నిశ్చితాభిప్రాయం. పార్లమెంటు నిర్ణయాలను అమలు జరపడంలో ప్రభుత్వానికి సలహాలిచ్చేందుకు, పని ఎంతవరకు జరిగినదీ ఎప్పటికప్పుడు పార్లమెంటుకి వివరించడానికి పార్లమెంటు సభ్యులతో స్థిరంగా ఉండే ఒక అధికారభాషోప సంఘాన్ని నియమించడం మంచిది. రాష్ట్ర శాసనసభలు కూడా ఇట్టి ఉప సంఘాలను ఏర్పాటు చేసుకోవచ్చు.

హరిష్‌చంద్ర శర్మ

1–12–1958.

---

† విచారణ సంఘంవారి 38 వ సలహాపై ఈ ఉపసంఘం వెల్లడించిన అభిప్రాయం (38-39 వ పేజీల్లో) చూడాలని కోరుతున్నాము.

న్యూ ఢిల్లీ,
5 డిసెంబరు, 1958.

# శ్రీ ప్రఫుల్ల చంద్ర భంజ్ దేవ్ భిన్నాభిప్రాయ సూచన

ఇంగ్లీషుస్థానే హిందీని అధికారభాషగా వాడుకలోకి తీసుకురావాలని ఈ ఉపసంఘం వెల్లడించిన అభిప్రాయంతో నేను మొత్తం మీద ఏకీభవిస్తున్నాను.

అయితే, భారత రిపబ్లిక్ రాజ్యాంగం ఏనాడో చేసిన నిర్ణయానికి ఇది నిరర్థకమైన పునశ్చరణ మాత్రమే. అంతకన్న ఈ ఉపసంఘం కొత్తగా సాధించిన అభివృద్ధి ఏమీ కనిపించడం లేదు. అందువల్ల నా అభిప్రాయభేదాలను విడిగా ప్రకటించడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను. నా ఈ సూచనను కూడా నివేదికలోని సలహాలతోపాటుగా ప్రకటించాలని కోరుతున్నాను.

విదేశ భాషకు బదులుగా సర్వసమ్మతమైన దేశీయ భాషను (భారత రాజ్యాంగాన్ని ఈ దేశంలోని సర్వప్రాంతాల, సర్వపక్షాల ప్రతినిధులు ఏకగ్రీవంగా ఆమోదించారు గనుక) శీఘ్రంగా ప్రవేశపెట్టాలని జాతీయ భావముగల ప్రతి పౌరుడు విధిగా ఆశిస్తాడు. ఈ ఆశయాన్ని శీఘ్రంగా సిద్ధింపజేసుకుంటే తప్ప మన స్వాతంత్ర్య సాధన పరిపూర్ణంకాదని నా అభిప్రాయం. ఈ ఉపసంఘం కృషి ఈ ఆశయ సిద్ధికి ఏ మాత్రము ఉపయోగపడలేక పోతున్నందువల్ల, నాకు తీవ్రమైన ఆశాభంగం కలిగింది. మొత్తం దేశ శ్రేయస్సును గోరే వారందరికీ కూడా ఈ నివేదిక ఆశాభంగం కలిగించి ఉండాలి.

రాష్ట్రపతికి ఇచ్చిన సలహాలలోని 22 వ అంశంలో వాడిన పదజాలం సక్రమంగాగాని, జాతీయశ్రేయస్సు దృష్ట్యా నా అంతరాత్మకు సమ్మతమైన శైలిలోగాని లేదని నా అభిప్రాయం. రాజ్యాంగ నిర్ణయాల పరమార్థానికి భంగపాటు కలుగనీయరాదనే మా కాంక్ష దిగువ ఉదహరించిన శ్రీ టండన్ జీ ప్రతిపాదనలో వ్యక్తమవుతున్నది.

> "ఇంగ్లీషు స్థానంలో హిందీని చివరకు పూర్తిగా వాడుకచేయడానికిగాను హిందీని క్రమంగా వాడుకలో పెట్టడానికి తీసుకొనదగిన చర్యల విషయంలో ప్రభుత్వం తన అభిప్రాయాలను వివరించాలని ఈ ఉపసంఘం కోరుతున్నది. ఆ విధంగా ప్రభుత్వం కార్యాచరణ ప్రణాళికను ఈ ఉపసంఘంలో చర్చించి, దానిపైన సభ్యుల అభిప్రాయాలను క్రోడీకరించాలని కూడా ఈ ఉపసంఘం సంకల్పం."

శ్రీ మూర్తి సూచనకు ప్రతిగా ఈ సూచన చేయబడింది. ఇందులో దిగువ గీతగీయబడిన ముఖ్యమైన మాటలు శ్రీ మూర్తి సూచనలో లేవు. హిందీ త్వరలో అధికారభాష కాగలదని నిశ్చయంగా తెల్పుకొనడానికి ఈ సూచన చాల ముఖ్యమైన కనిష్ఠ సాధనం. ఈ సూచన నిరాకరింపబడింది.

పైగా భారత ప్రభుత్వ వైఖరి కూడా మా అభిప్రాయాలను, సందేహాలను, తీర్చడానికి అనువైనదిగా లేదు. రాజ్యాంగం అమలులోకివచ్చిన తరువాత అప్పడే ఎనిమిది సంవత్సరాలు గడిచిపోయినవి. ప్రభుత్వ వ్యవహారాలలోను, అనధికార సాంఘిక వ్యవహారాలలోనూ కూడా ఇప్పటికీ ఇంగ్లీషే ప్రముఖంగా వాడుకలో ఉంది. ఈ ప్రజాస్వామిక దేశంలో ప్రభుత్వ విధానములను నిర్ణయించే వారి నిర్లక్ష్యము, ఔచిత్యవివేక హీనతల కారణంగా మన ఆశయం కొన్ని పురుషాంతరాలవరకు సఫలంకాదని ప్రస్తుత పరిస్థితులు సూచిస్తున్నవి. ఈ అఖిలభారత భాషా సమస్యల విషయంలో తగిన శ్రద్ధచూపలేక పోవడానికి దేశంలోని సాంఘిక రాజకీయ సమస్యల ఒత్తిడిని సాకుగా చెపుతున్నారు. ఇది కేవలం, ముందు వెనుకలు తెలియనితనమని నా అభిప్రాయం. నిజానికి, ప్రధాన సమస్యల విషయంలో తగిన శ్రద్ధచూపడమే

తక్కిన సమస్యల పరిష్కారానికి ప్రాతిపదిక అవుతుంది. సమైక్య జాతీయభావన, మర్యాద, దృక్పథం రూపొందాలంటే, ఆలిండారత అధికారభాషను శీఘ్రమంగా వాడుకలోకి తేవడం అత్యంతావశ్యకమని వేరే చెప్పవలసిన పనిలేదనుకుంటాను. డాసిపరన, ఆహారరంగం, వ్యవసాయరంగం మొదలు, విద్యాప్రచార రంగంవరకు సర్వరంగాలలో మనకుగల సమస్యలన్నీ అట్టి సమైక్యజాతీయ భావనవల్ల సులభంగా పరిష్కారం అయిపోగలవు.

ఇంత ప్రధాన విషయంలో ఇంతవరకు భారతప్రభుత్వం అమిత నిర్లక్ష్యంగా వ్యవహరిస్తూంది. అందువల్ల చివరకు ఇంగ్లీషు స్థానంలో హిందీని పూర్తిగా వాడుకచేసే ఉద్దేశంతో హిందీని క్రమక్రమంగా వాడకంలో పెట్టడానికి తీసుకొనదగిన చర్యల విషయంలోనూ కాలప్రణాళిక విషయంలోను తన అభిప్రాయాలను వివరంగా తెలపడం, ఈ ఉపసంఘంలోని ఇతర సభ్యులు ఆ అభిప్రాయాలపై వెల్లడించే భావాలతోపాటుగా సలహాలలోని 22 వ అంశాన్ని అనుసరించి పరిశీలించడానికి ఈ ఉపసంఘానికి అవకాశమీయడం మొదలైన కర్తవ్యాలను భారత ప్రభుత్వం నిర్వర్తించక పోయినా ఈ ఉపసంఘం ఔదాసీన్యం వహించి ఊరుకొనడం ఉచితంగాలేదని నా అభిప్రాయం. ఈ విషయంలో ప్రభుత్వం చూపుతూన్న నిర్లక్ష్య భావంవల్ల అసలు విషయాన్ని తోసివేయాలనే సంకల్పం వ్యక్తమవుతూంది. రాజకీయం గాను, ఇతర విధాలుగాను ప్రభుత్వం చాలా మొగమాటాలకులోను గావలసి రావచ్చు. కనుక ఈ ఉపసంఘం 22 వ అంశంలోని సలహాను ఆమోదించడంవల్ల, సాధ్యమయినంత త్వరలో ఇంగ్లీషుస్థానే హిందీని వాడుకలోపెట్టే కార్యక్రమాన్ని ప్రభుత్వం శీఘ్రంగా కొనసాగించడానికి ఈ ఉపసంఘం తగిన కట్టుదిట్టం ఏదీ చేయలేకపోయింది. ఇలా జరగకుండా; అధికారభాషా విచారణ సంఘం సలహాను పాటించి, త్వరలో ఇంగ్లీషుస్థానంలో హిందీని వాడుకలోకి తీసుకొనిరావడానికి ఒక గడువుతోసహా తగిన శక్తిమంతమైన కార్యాచరణ పథకాన్ని తయారుచేసి ఉన్నట్లయితే పరిస్థితి వేరుగా ఉండేది. ప్రజల సానుభూతి, అట్టి దృఢనిర్ణయంవల్ల ప్రజల వైఖరి మరొక విధంగా ఉండేవి. ఇంత ముఖ్యవిషయంలో ఏవో సంశయాలతో, నిరుత్సాహంగా వ్యవహరిస్తున్న ప్రస్తుత ప్రభుత్వ ధోరణివల్ల పశ్చిమ బెంగాలులోను, మద్రాసు రాష్ట్రం లోని కొన్ని ప్రాంతాలలోను జరిగిన సంఘటనలు అప్పుడు జరిగి ఉండేవికావు. పైగా ప్రస్తుతం మన తరంవారిలో చిన్న వయస్కులంతా ఆసక్తితో హిందీ నేర్చుకుంటున్నారు. మరి కొన్నేళ్లలో వారంతా జాతీయ సౌమనస్యానికి, సౌహార్దానికి విశేషంగా దోహదం చేయగల ఒకే భాషలో స్పష్టంగా భాషించుకుంటూ, పరస్పరం అర్థం చేసుకొనగలగడంలో కష్టమేమీ ఉండదు. ఈ విషయం తలుచుకుంటే ఇప్పుడు జరుగుతున్న జాప్యం మరీ దుస్సహంగా కనిపిస్తుంది.

ఉపసంఘం సూచనలలో 20 వ అంశం స్పష్టంగా అభివృద్ధి నిరోధకంగా కనిపిస్తూంది. 45 సంవత్సరాల వయస్సుగల పౌరుల ధీశక్తికి అవమానకరంగా ఉంది. నేను ఒరియా దేశవువాణ్ణి. నేను హిందీ చదువుకోలేదు. నాకు నలభైయ్యేళ్లువచ్చిన తరువాత హిందీ, ఉరుదూ భాషలు స్వయంగా నేర్చుకొన్నాను. ఇందుకు హిందీ ఈ దేశానికి అధికారభాష అవడం దేశానికి శ్రేయస్కరమనీ, దేశభక్తిగల ప్రతిపౌరుడు మాతృభాషతోపాటు హిందీ కూడా నేర్చుకోవాలనీ నేను దృఢంగా విశ్వసించడమే కారణం. సంకల్పమనేది ఉంటే, వనుపాయాలకు లోటుఉండదు. నేడు హిందీలో నా భాషాజ్ఞానం హిందీ ప్రాంతంలోని ఏ భారతీయుడికి తీసిపోదు. నా దేశీయులలో ఎవరుగాని నా కంటె తక్కువ ప్రజ్ఞకలవారన్నా, నావలె కొత్త భాష నేర్చుకొనలేరన్నా నేను ఒప్పుకోను. భారత రిపబ్లిక్ అధికారభాషను నేర్చుకొనడానికి శక్తి వంచనలేకుండా కృషిచేయడం, జాతీయభావంగల ప్రతి భారత పౌరుడికి విధ్యుక్తధర్మం. వయస్సుతో నిమిత్తం లేకుండా స్త్రీలకు పురుషులకు కూడా ఇది వర్తిస్తుంది. ఒక విధంగా విచారణసంఘం ఇచ్చిన సలహానైనా నేను ఆమోదించగలనుగాని, అంతకన్న కూడా చాలా అభివృద్ధి నిరోధకంగా, సహింపరానిదిగా ఉన్న ఈ ఉపసంఘం సూచనను నేను ఎన్నటికి బలపరచజాలను. అసలు విచారణ సంఘం ఇచ్చిన సలహా కూడా చాలా మితవాదధోరణిలో ఉన్నది. దాని మీద ఈ ఉపసంఘం ఇంకా నీళ్లు చల్లడం ఎంతమాత్రం సమంజసంగాలేదు.

విచారణ సంఘం సలహాలలో 21 వ అంశం ప్రస్తుత పరిస్థితులలో కేవలం అనవసరం. భిన్నాభిప్రాయాలను ప్రకటిస్తున్న ఇతర సభ్యులు ఈ విషయాన్ని గురించి ఎలాగు చాలాగట్టిగా వ్రాస్తారని ఆశిస్తూ నేను ఈ విషయాన్ని గురించి ఇంతకన్న చెప్పదలచుకోలేదు. విచారణ సంఘం సలహాను ఏ విధంగాను మార్పుచేయకుండా రాష్ట్రపతి ఆమోదించవచ్చునని ఉపసంఘంచేసిన సిఫారసుతో నేను ఏకీభవించడంలేదు.

కేంద్ర ప్రభుత్వోద్యోగుల ఎన్నికకు జరిపే పరీక్షల పద్ధతిని గురించి ఉపసంఘంచేసిన సూచన మొదట విచారణ సంఘం ఇచ్చిన సలహాను తగినంతగా సంస్కరించలేదని నా అభిప్రాయం. ఉద్యోగులకు విశేష ప్రజ్ఞాసామర్థ్యాలు అవసర మనీ, అందువలన వారి సామర్థ్యస్థాయి ఉన్నతంగా నిలిపిఉంచాలనీ ఉపసంఘం స్పష్టంగా వివరించి ఉండవలసింది. లాంఛనంగా జరిపే పరీక్షలవల్ల ప్రయోజనమేమీ ఉండదు, సరికదా అందువల్ల ఎప్పటికైనా ప్రభుత్వ వ్యవస్థ దెబ్బ తినక తప్పదు. కేంద్ర ప్రభుత్వోద్యోగుల ఎన్నికకుజరిపే పరీక్షలు కేవలం ఈ దేశపు అధికారభాష అయిన హిందీలోనే ఉండాలని, ఈ పరీక్షలను ప్రాంతీయభాషలలో కూడా జరపడం అనవసరం అని నా అభిప్రాయం.

హైకోర్టులలో వాడవలసిన భాషవిషయం విచారణ సంఘం సరియైన సలహాయిచ్చింది. వారి సలహాలలోని 38 వ అంశంలో ఇలా ఉన్నది. "దేశంలోని హైకోర్టులన్నిటిలోను తీర్పులకు, డిక్రీలకు, ఉత్తరువులకు ఒకే భాష వాడడం అవసరమనీ, కనుక ఇవి అన్ని ప్రాంతాలలోను హిందీ భాషలోనే ఉండాలని నిర్ణయించడానికి, మా అభిప్రాయ ప్రకారం, బలవత్తరకారణాలు ఉన్నవి." ఇందుకోసం రాజ్యాంగంలోని 348 వ ఆర్టికిలు 2 వ క్లాజును మార్పు చేయడానికి రాష్ట్రపతి తీసుకొనవలసిన చర్యలను ఉపసంఘం సూచించింది. ఈ సూచనలో "తీర్పులను, డిక్రీలను, ఉత్తరువులను కూడా హిందీలో జారీచేయడానికి అవకాశమిచ్చే......" అంటే సరిపోయే దానికి, "హిందీలోగాని ఇతర అధికారభాషలలోగాని జారీచేయడానికి అవకాశమిచ్చే" అని కలపడం చాలా దురదృష్టం. భాషమార్పు శీఘ్రంగా మృదువుగా జరగడానికి విచారణ సంఘం సలహాలలో వ్యక్తమయిన దృక్పథం అవసరం. అలాగే, సంధికాలంలో ప్రభుత్వ శాసనాలు, కేంద్ర రాష్ట్రశాసనాలు ఇంగ్లీషులోను, హిందీలోను కూడా తయారుచేస్తూ ఉండాలి. సర్వశాసన గ్రంథాన్ని సక్రమంగా అనువదించేపని ఇప్పటినించే ప్రారంభించాలి. న్యాయశాస్త్ర పరిభాషకు సమగ్రమైన నిఘంటువు తయారు చేయడానికి నిపుణుల సంఘాన్ని నియమించి ఆలస్యం లేకుండా పని పూర్తిచేయించాలి. అట్టి నిపుణుల సంఘంలో వివిధ ప్రాంతాలకు ప్రాతినిధ్యం వహించే న్యాయశాస్త్రవేత్తలే కాక, భాష శాస్త్రంలోను, భాషాసమన్వయ శాస్త్రంలోను భారతదేశ సాంస్కృతిక చరిత్రలోను పండితులైన వారిని కూడా నియమించాలి. ఈ పని పూర్తిచేయడానికి ప్రభుత్వం ఉజ్జాయింపుగా ఒక గడువు నిర్ణయించడం కూడ అవసరం. లేకపోతే ఆలస్యం, అనవసర కాలయాపన, తత్పర్యవసానంగా విమర్శలు, విపరీతపరిణామాలు ఏర్పడవచ్చు.

హిందీ వాడకంలోలేని ప్రాంతాలలో హిందీ భాష వికాసానికీ, హిందీ భాష వ్యాప్తికీ జరుగుతున్న కృషిని అనధికారసంస్థలకు† మాత్రమే వదలివేయాలన్న వాదంలో ఎక్కువ బలంవున్నట్లు నాకు కన్పించడంలేదు. (ఉపసంఘం సలహాలలోని 60 వ, 61 వ అంశాలు) హిందీ వాడుకలోలేని ప్రాంతాలలో హిందీ వ్యాప్తికి అనధికార సంస్థలుచేస్తున్న కృషికితోడు, సక్రమపర్యవేక్షణక్రింద హిందీవ్యాప్తి కృషిని దీక్షతోనూ, విస్తారంగానూ నిర్వహించడానికి కేంద్ర ప్రభుత్వమే పూనుకోవాలని గట్టిగా కోరుతున్నాను. ఒకవేళ అవసరమైతే ఒక సముచితశాసనాన్ని, రాష్ట్ర ప్రభుత్వాలతోకూడా సంప్రదించి త్వరగా తీసుకురావాలి.

శాస్త్రీయ, సాంకేతిక వ్యవహారాలకు సరైన హిందీ పారిభాషిక పదాలు లభ్యంకానప్పుడు ప్రస్తుతం వాడుకలో వున్న అంతర్జాతీయ పారిభాషికపదాలను అనువైన మార్పులతో తాత్కాలికంగా వాడుకచేయాలి. భాషావేత్తలూ, ప్రవీణులూ జాగ్రత్తగా కృషిచేసి కూర్చిన తాత్కాలిక హిందీ పారిభాషిక పదాలను తప్పకుండా బ్రాకెట్లలోయివ్వాలి. కాలక్రమేణా ఇందువల్ల వారు ఈ పదాలను బాగా అర్థంచేసుకుని వాడుకచేయడానికి అవకాశం కలుగుతుంది. ఈ సందర్భంలో శాస్త్రీయసాంకేతిక వ్యవహారాలకు వాడుకచేయడానికి మన భాషలో కొత్త పదాలను సృష్టించేభావం సరిగా రాదన్న సాకులో వ్యతిరేకించడం అర్థరహితము, నిర్హేతుకమూ అవుతుంది. మన ప్రాచీన, ఆధునికభాషలతో మనకు పరిచయం లేకపోవడం, విజ్ఞాన, తర్క, గణితశాస్త్రాలలో మనదేశంలోజరిగిన అపారకృషిని గమనించక పోవడం, అట్టి వ్యతిరేకభావాలకు కారణాలైనవి.

28 వ, 29 వ, 30 వ సలహాల విషయంలో శ్రీ పురుషోత్తమదాస్ టండన్ మహోదయులు (పార్లమెంటు సభ్యుడు) వెల్లడించిన అభిప్రాయాలను చదివే అవకాశం నాకు కలిగింది. ఈ విషయాన్ని గురించి ఆయన ప్రకటించిన

---

† ఉపసంఘం అభిప్రాయం 21 వ పేజీలోని 40 వ పేరాలో వెల్లడించబడింది.

అభిప్రాయాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. అయితే, ఒక్క హిందీభాషకే గాక యితర భారతీయ భాషలన్నింటికీ ఒకే ఉచ్చారణానుగుణమైన లిపి, స్వదేశ, విదేశ ప్రవీణులతో సంప్రతించి (కొన్ని విద్యాసంస్థలు రూపొందించిన చుక్కలు, గీతల (బాదరబందీ లిపికి బదులుగా) రూపొందించేపక్షంలో, వీటిని రోమన్ లిపిలోకి మార్చేటందుకు, నేను అంగీకరిస్తాను. ఇందువల్ల ముద్రణ సౌలభ్యం, ప్రజలలో సమైక్యభావం సిద్ధించగలవు. ప్రస్తుత సందర్భంలో ఈ విషయ ప్రసక్తి లేనందున జాతిశ్రేయస్సు దృష్ట్యా, అధికార కార్యకలాపాలన్నింటికీ దేవనాగరి అంకెలను యిప్పుడే వాడుకలోకి తేవడం ఎంతో ప్రయోగం.

ఈ ఉపసంఘం నివేదికలోని 52 వ అంశం సంగతి చూద్దాం. ఈ విషయంలో కూడా వర్గప్రయోజనాల కోసం జాతీయశ్రేయస్సు త్యాగంచేయబడింది. మనోవాక్కాయ కర్మలచే, ప్రజలందరూ ఒకటిగా వ్యవహరించే సమైక్య భారతదేశం త్వరలో అవిర్భవించాలన్న ఆశయానికి నేను కట్టుబడియున్నందున అట్టి చర్యలను నేను హర్షించజాలను. ఆదిలో మేము సూచించిన "త్వరలో చర్యలు", "సత్వర చర్యలు" అన్న మాటలకు బదులు "సముచిత చర్యలు" అన్న పదాలను వుపయోగించడంలో ఈ ఉపసంఘంలోని అధిక సంఖ్యాకుల అభిప్రాయంలోని విజ్ఞతయేమిటో నేను అర్థం చేసుకోలేకపోతున్నాను. మేము మొదట్లో సూచించిన పదాలు రాష్ట్రపతికి సిఫార్సులుచేయాలని పార్లమెంటు మాకు ఇచ్చిన ఆదేశం దృష్ట్యా ఎంతో ఉచితమైనవనీ, న్యాయమైనవనీ యిప్పటికీ మా యొక్క, మా మిత్రులయొక్క విశ్వాసం. పశ్చిమ బెంగాలు, మద్రాసు రాష్ట్రాలలోని ఒక వర్గంవారి అభిప్రాయాలను సానుభూతితో పరిశీలించి, వాటికి ఈ ఉపసంఘం ఎంతో ఉత్సాహాన్ని చూపింది. హిందీ మాతృభాషకాని ప్రాంతాలు అవేనుమా అన్న ధోరణిలో ఈ ఉపసంఘం తన కార్యకలాపాలను కొనసాగించింది. హిందీ మాతృభాషకాని రాష్ట్రంలో పుట్టిపెరిగిన నేను పైవైఖరిని హర్షించజాలను. ఈనాడు భారత జాతీయ ఐకమత్యానికి చిహ్నమైన అశోకచక్రం ఒరిస్సాలో (నా రాష్ట్రంలో) అనేక శతాబ్దాల క్రిందట కళింగప్రజల ఆత్మబలిదానం, శౌర్యాలఫలితంగా, అశోకచక్రవర్తి "చండాశోకుడు" నుంచి "ధర్మాశోకుడు" గా మారి నప్పుడే సృష్టించబడింది. ఆ పద్ధతిలోనే నా అభిప్రాయాలనూ, వైఖరినీ తీర్చిదిద్దుకుని, ఒరిస్సా పుత్రుడుగా జాతీయ ఐకమత్యాన్ని పెంపొందించడానికి నా చేతనైన సేవచేయడానికి ప్రయత్నించాను. స్వతంత్ర సమైక్య భారతదేశంలోని ఒరిస్సా రాష్ట్రవాసిగా, స్వరాష్ట్రాభిమానం తక్కువైగాక, మాతృదేశంపట్లగల ప్రేమతో, మన మందరం తీసుకున్న ప్రతిజ్ఞను నెరవేర్చడంలో ఉడుతభక్తిగా సేవచేయడానికి మాత్రమే ఈ భిన్నాభిప్రాయ ప్రకటనను సమర్పిస్తున్నాను.

"కింబహునావిత్తు"

ప్రఫుల్ల చంద్ర భంజ్ దేవ్

---

# శ్రీ పురుషోత్తమదాస్ టండన్, శ్రీ సేత్ గోవిందదాస్‌ల

## ప్రత్యేకాభిప్రాయ ప్రకటన

ఈ ఉపసంఘంలోని అధిక సంఖ్యాకులు తయారుచేసిన నివేదిక మాకు సంతృప్తికరంగా లేదు. కొన్ని అంశాలను గురించి మా అభిప్రాయాలను ఒక ప్రత్యేక ప్రకటనద్వారా తెలుపాలనీ, ఆ ప్రకటన ఈ ఉపసంఘ నివేదికలో ఒక భాగంగావుండాలనీ మా అభిప్రాయం.

భారత రాజ్యాంగం అమలులోకి వచ్చినప్పటినుంచీ భారత ప్రభుత్వ భాషావిధాన నిర్వహణను మేము ఆతురతతో, ఆశతో గమనిస్తూ వచ్చాము. కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో వాడుకచేసే భాషను ఇంగ్లీషునుంచి హిందీకి మార్పు చేయడానికి అనువైన పరిస్థితులు కల్పించడంలో వివేకంతో వ్యవహరించలేదన్న అభిప్రాయం మాకు కలిగింది.

రాజ్యాంగం అమలులోకి వచ్చి దాదాపు తొమ్మిదేళ్లు పూర్తికావస్తున్నాయి. ఇంగ్లీషు, దేశంలో కొలది మందికే పరిచితమైవున్న భాష అయినప్పటికి ఢిల్లీలోను ఇతర పెద్ద పట్టణాలలోనూ, ముఖ్యంగా రాష్ట్ర రాజధానీ నగరాలలోనూ పౌర సాంఘిక వ్యవహారాలకు సంబంధించిన బహిరంగ సభలలోనూ, యితరత్రాను ఇంగ్లీషుకే అగ్రస్థానం వుంటున్నది. అందువలన పరిపాలనా నిర్వహణలోను, ప్రణాళికా రచనలోను, అభివృద్ధి కార్యకలాపాలలోను ఇంగ్లీషు వాడుక చేసే వర్గం నిర్వహించే కార్యకలాపాలపట్ల ప్రజా బాహుళ్యంలో నిర్లక్ష్య ఉపేక్షా భావాలు ఏర్పడ్డాయి. కేంద్ర ప్రభుత్వ విధానాలను రూపొందించే బాధ్యతగలవారు జాతీయోత్సాహ శక్తిని ప్రేరేపించడంలో భాషకుగల శక్తిని గుర్తించినట్లయితే ఈ పరిస్థితి ఏర్పడేదికాదు. . ఏర్పడినా దీర్ఘకాలం వుండేదికాదు. ఇప్పుడుకూడ ఈ ఉపసంఘం కేంద్ర ప్రభుత్వం కల్పించిన వాతావరణ ప్రభావానికి లొంగి ఇంగ్లీషు భాషకు అనుకూలంగా సిఫార్సులు చేసింది. కేంద్ర రాజ్యాంగంలో ప్రభుత్వ అధికార భాషగా అంగీకరించబడిన హిందీ భాషను వాడుకలోకి తేవడానికీ, అభివృద్ధి చేయడానికీ ఈ ఉపసంఘం చేసిన సిఫార్సులు మొత్తం మీద అసంతృప్తికరంగానూ, అడ్డు తగిలేవిగానూ ఉన్నాయి. ప్రస్తుత పరిస్థితులలో మార్పులను సూచిస్తూ అధికార భాషా విచారణ సంఘం చేసిన కొన్ని ముఖ్యమైన సిఫార్సులు మితి మీరిన జాగ్రత్తతోనూ, పాత సిద్ధాంతాలకు కట్టుబడి వున్నందున, ఈ ఉపసంఘం వాటి ప్రాముఖ్యాన్నికూడా తగ్గించి వేసింది.

అధికార భాషా విచారణ సంఘం, పార్లమెంటు అధికార భాషోపసంఘం చేసిన కొన్ని సిఫార్సుల విషయంలో మా అభిప్రాయాలను యీ క్రింద పొందు పరుస్తున్నాము:—

### పరిపాలనా వ్యవహారాలకు వాడుక చేయవలసిన భాష

మొట్టమొదట అధికార భాషా విచారణ సంఘం సిఫార్సులలోని 21-వ అంశాన్ని పరిశీలిద్దాం. కేంద్ర ప్రభుత్వం తాలూకు ఏ వ్యవహారంలోగాని ఇంగ్లీషు భాషను వాడుకచేసే విషయమై నిర్బంధం విధించాలని తాము సిఫార్సు చేయమని ఆ అంశంలో వున్నది. ఈ ఉపసంఘంయొక్క మెజారిటీ నివేదిక ఆ సిఫార్సును ఆమోదించింది. దీనితో మేము ఏకీభవించలేకున్నాము. కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన కొన్ని విషయాలలో ఇంగ్లీషు భాష వాడకాన్ని కొనసాగించడం న్యాయ విరుద్ధమూ, అర్థ రహితమూ. ఆ విషయాలకు సంబంధించినంతవరకూ ఇంగ్లీషు భాష వాడకంపై నియమం విధించడం చాలా అవసరం. కేంద్ర ప్రభుత్వం తాలూకు వివిధ శాఖలూ, రైల్వేలు, స్వయం నిర్ణయాధికారం గల సంస్థలు, అర్ధ స్వయం నిర్ణయాధికారంగల సంస్థలు తాలూకు నాల్గవ తరగతి సిబ్బందీ విషయం పరిశీలిద్దాం. ఈ సిబ్బంది దేశమంతటా విస్తరించివున్నారు. ఈ నాల్గవ తరగతి సిబ్బందికి పంపే లేఖలూ, వర్తమానాలూ అన్నీ విధిగా ఇంగ్లీషులోనే వుంటాయి. ఒక ఉద్యోగి తన విధులను అలక్ష్యం చేశాడనీ, లేక పాటించలేదనీ ఆరోపణలు

చేయబడిన సందర్భంలో, ఆ ఉద్యోగికి పంపే ఆరోపణల పత్రం ఇంగ్లీషులో వుంటుంది. ఆ ఉద్యోగి తన సంజాయిషీని కూడా ఇంగ్లీషులోనే యివ్వాలి. ఈ తరగతి సిబ్బందికి విద్యాగంధం తక్కువ. బహు కొద్ది మందికి తప్పితే ఇంగ్లీషు తెలియదు. కనుక ఆ పద్ధతిని అనుసరించడం అన్యాయం. నాల్గవ తరగతి సిబ్బందికి పంపే లేఖలూ, వర్తమానాలూ అన్నీ ఆ ఉద్యోగి ఏ రాష్ట్రానికి చెందిన వాడైతే ఆ రాష్ట్ర ప్రభుత్వ భాషలోగాని హిందీలోగాని వుండాలని వెంటనే ఆదేశాలు పంపాలని మేము సిఫార్సు చేస్తున్నాము.

ఇదే విధంగా కేంద్ర ప్రభుత్వ శాఖలు వ్యక్తులకు పంపే అన్ని లేఖలూ—ఇంగ్లీషులో ఉత్తరాలు వ్రాసిన వ్యక్తులకు తప్ప—ఆ రాష్ట్రీయ భాషలోగాని హిందీలోగాని వుండాలి. ఏ కేంద్ర ప్రభుత్వ శాఖకైనా వ్యక్తులుగాని, సంస్థలుగాని, హిందీలోగాని, రాష్ట్ర ప్రభుత్వ భాషలోగాని లేఖలుగాని వర్తమానాలుగాని పంపితే వాటికి జవాబులుకూడా హిందీలోగాని, ఆయా రాష్ట్ర ప్రభుత్వ భాషలలోగాని వుండాలి. ఇంగ్లీషులో మాత్రం ఎన్నడూ వుండకూడదు.

మన దేశం ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలంటే విదేశాలలోని మన రాయబారులు ఆయా దేశాల పాలకులకుగాని, అధినేతలకుగాని సమర్పించే అధికార లాంఛన పత్రాలు ఎల్లప్పుడూ హిందీలో వుండాలనీ, ఎన్నడూ ఇంగ్లీషులో వుండకూడదనీ మా అభిప్రాయం.

ఇక 22-వ అంశాన్ని పరిశీలిద్దాం. అధికార భాషను ఇంగ్లీషునుంచి హిందీకి మార్పు చేసేందుకు భారత ప్రభుత్వంలోని వివిధ శాఖలకు మార్గదర్శకంగా తేదీలు, దశలనూ సూచిస్తూ అధికార భాషా విచారణ సంఘం తయారు చేయాలన్న క్రమ పట్టికలోకూడిన కార్యాచరణ పథకానికి సంబంధించిన విషయాలు యిందులో వున్నాయి. భారత ప్రభుత్వం ఏ విధమైన తాత్కాలిక కార్యాచరణ పథకం తమకు అందచేయలేదనీ, అందువల్ల ముందుగా అవసరమైన సన్నాహ చర్యలను మాత్రమే సూచించామనీ, అయితే ఈ కార్యాచరణ పథకాన్ని రూపొందించే బాధ్యత ప్రభుత్వానికే వదలి వేశామనీ అధికార భాషా విచారణ సంఘం తెలియచేసింది.

అధికార భాషగా హిందీని క్రమంగా ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం తమ కార్యాచరణ పథకాన్ని తయారుచేసి, ఈ ఉపసంఘానికి పంపాలనీ ఉపసంఘం సభ్యులు దానిని పరిశీలించి తమ తమ ప్రతిపాదనలను సూచించగలరనీ ఈ ఉపసంఘ సమావేశాలలో అనేక మంది సభ్యులు అనేక సందర్భాలలో కోరారు. ఈ ఉపసంఘ కార్యాలయంవారు ఈ ఉపసంఘం అధ్యక్షుని పర్యవేక్షణ క్రింద అట్టి కార్యాచరణ పథకాన్ని తయారుచేసి, ఈ ఉపసంఘానికి అందచేయాలని కూడ అర్థించడం జరిగింది. ఈ ఉపసంఘం అధ్యక్షుడే కేంద్ర దేశీయాంగ మంత్రి గనుకను, ఆ శాఖకు అధికార భాషను ఇంగ్లీషునుంచి హిందీలోకి మార్చడానికి సంబంధించిన కార్యకలాపాలతో సహజంగా సంబంధం వుంటుంది కాబట్టి, ఆ శాఖ ఉపయోగానికి ఒక పథకం అవసరం. అయినా ఈ ఉపసంఘానికి ఏ పథకమూ అందచేయలేదు. అధికార భాషా విచారణ సంఘానికిగాని, పార్లమెంటు అధికార భాషోప సంఘానికిగాని కార్యాచరణ పథకాన్ని సమర్పించ డానికి ప్రభుత్వం అనిష్టత చూపడం దురదృష్టకమైన విషయం. దీనినిబట్టి ప్రణాళికా బద్ధమైన ఏ కార్యక్రమానికి ముందు వాగ్దానం చేయడం ప్రభుత్వానికి యిష్టం లేదని తెలుస్తున్నది.

ఈ ఉపసంఘ నివేదికలోని ఇరవై ఎనిమిదినుంచి ముప్పైవరకూ గల అంశాలను, 54-వ పేరా (మూడవ అధ్యాయం, ప్రథమ భాగం, 4-వ సెక్షన్) లోని అంశాలను పరిశీలిద్దాం. వాటిలో హిందీ వాడుక చేయవల్సిన అంకెల స్వరూపాన్ని గురించి ఉన్నది.

రాజ్యాంగ పరిషత్తు దేవనాగరి లిపితోకూడిన హిందీ భాషను కేంద్ర ప్రభుత్వ అధికార భాషగా నిర్ణయిస్తూ ఇంగ్లీషు అంకెలు వాడాలనడం బాగుండలేదు. అనేక శతాబ్దాలుగా వాడుకలో వుంటూ, ప్రఖ్యాతి చెందిన ప్రాచీన కాలపు సంస్కృతపు అంకెలకు బదులు, అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న భారత దేశపు అంకెలని తాము పేరు పెట్టిన ఇంగ్లీషు అంకెలనే వాడాలనడం దూరదృష్టిలేని చర్య అని మేము మొదటినుంచీ భావించాము. ప్రాచీన కాలపు అంకెలు ఒక్క సంస్కృతం, హిందీ భాషలలోనేగాక, మరాఠీ, గుజరాతీ, పంజాబీ భాషలలోను, సంస్కృతానికి సన్నిహితంగావున్న యితర భాషలలోనుకూడ బహు శతాబ్దాలుగా వాడుకలో వున్నాయి.

అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న భారత దేశపు అంకెలని చెప్పబడే వాటిని ఆమోదిస్తూ, రాజ్యాంగం అమలులోకి వచ్చినప్పటినుంచీ 15 సంవత్సరాలవరకూ, కేంద్ర ప్రభుత్వ ఏ అధికార కార్యకలాపాలకైనా ఆ అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న భారత దేశపు అంకెలతోపాటు దేవనాగరి అంకెలను వాడుక చేయాలంటూ ఉత్తర్వు చేయవచ్చునని రాజ్యాంగంలో నిర్దేశించబడింది. ఆ 15 సంవత్సరాల తర్వాత పార్లమెంటు ఒక చట్టంద్వారా నిర్ణీత కార్యకలాపాలకు దేవనాగరి అంకెలను వాడుక చేయడానికి వీలు కలిగించాలి. హిందీలో వ్రాసిన కేంద్ర ప్రభుత్వ వ్యవహార పత్రాలలో ఇంగ్లీషు అంకెలను అంతర్జాతీయ అంకెలన్న పేరుతో ప్రవేశ పెట్టమనడంవల్ల కలిగే నష్టాన్ని ఈ రక్షణ క్లాజు కొంతవరకూ తగ్గించింది. దాదాపుగా, ఈ 9 సంవత్సరాలలోనూ అసలు జరిగినదేమిటంటే, భారత ప్రభుత్వ హిందీ ప్రచురణలు పెక్కుంటిలో దేవనాగరి అంకెలను వాడుక చేయడం. అయితే కొన్ని శాఖలు మాత్రం తమ హిందీ ప్రచురణలలోనైతం ఇంగ్లీషు అంకెలనే వాడుక చేశాయి.

అంకెల విషయంలో ప్రజాభిమతం ఏమిటో తెలుసుకోడానికి హిందీ రైల్వే గైడు చక్కటి ఉదాహరణ. రాజ్యాంగం అమలులోకి వచ్చిన కొలదికాలం తర్వాత రైల్వే అధికారులు హిందీలో తొలిసారిగా రైల్వే గైడును ప్రచురించినప్పుడు, రాజ్యాంగంలో అందుకు సంబంధించిన తొలి నిబంధనను అంటిపెట్టుకుని, రక్షణ క్లాజును, ప్రజల కోర్కెనూ నిర్లక్ష్యంచేసి దేవనాగరి అక్షరాలనూ, రైళ్ల వేళలు తెలుపు అంకెలకు మాత్రం ఇంగ్లీషు అంకెలను వాడుక చేశారు. ఇందువల్ల హిందీ వచ్చి ఇంగ్లీషు రాని అనేక మంది ప్రజలకు అది వుపయోగపడలేదు. ఇంగ్లీషు తెలిసిన వారికి ఇంగ్లీషు గైడు వేరే వుండనేవున్నది. హిందీ, మరాఠీ భాషలు వచ్చినవారి వాడుకకోసం దేవనాగరి అక్షరాలతో తయారు చేసిన యీ రైల్వే గైడు ఇంగ్లీషు అంకెల వాడకం కారణంగా నిరుపయోగమైనది. రైల్వే అధికారులు ఆ విషయాన్ని గుర్తించి ఆ తర్వాత ప్రచురించబడిన హిందీ రైల్వే గైడులో ఇంగ్లీషు అంకెలకు బదులు దేవనాగరి అంకెలనే వాడారు. ప్రస్తుతం యీ పద్ధతే అనుసరించబడుతున్నది. హిందీ రైల్వే గైడు యిప్పుడు ప్రజాభిమానాన్ని చూరగొనడమేగాక, దానికి గిరాకీ హెచ్చింది.

రైల్వే శాఖ, కేంద్ర ఆర్థిక శాఖ పార్లమెంటులో ఏటేటా ప్రవేశ పెట్టే పెద్ద పెద్ద బడ్జెటు సంపుటాల హిందీ ప్రతులలో దేవనాగరి అంకెలను వాడుకచేసి సక్రమ పద్ధతిని గుర్తించినట్లు వ్యక్తం చేశారు.

హిందీ ప్రచురణలు ఇంగ్లీషులోవున్న వాటికి కేవలం అనువాదాలైనప్పుడు వాటిలో ఇంగ్లీషు అంకెలను ఉపయోగించడంలో ఎంత మాత్రం అర్థం లేదు.

1965-వ సంవత్సరంవరకూ, లేక పార్లమెంటు చట్టం ద్వారా మరో విధంగా నిర్ణయించేటంతవరకూ, గణగణన, సాంకేతిక విషయాలకు సంబంధించిన అంకెల వ్యవహారమంతా ఇంగ్లీషు అంకెలలోనే కొనసాగవలసి ఉంటుంది. అటువంటప్పుడు వాటికి సంబంధించిన హిందీ అనువాదాలలో ఇంగ్లీషు అంకెలను వాడడం అర్థరహితమేగాక ఇంగ్లీషు తెలియని వారికి అవి అర్థం కానందున ఆ ప్రచురణల ప్రయోజనం సన్నిగిలడానికి దారి తీస్తుంది.

1965-వ సంవత్సరం తర్వాత ఇంగ్లీషు అంకెలు, దేవనాగరి అంకెలు వాడడానికి సంబంధించిన యావత్తు సమస్యనూ అప్పటి పరిస్థితుల దృష్ట్యా పునఃపరిశీలించాలని మా అభిప్రాయం.

## శాసనాలలో ఉపయోగించవలసిన భాష

ప్రభుత్వ చట్టాలలో ఉపయోగించవలసిన భాషకు సంబంధించిన 33-వ, 34-వ అంశాల విషయంలో పార్లమెంటులో ప్రవేశపెట్టబడే అన్ని బిల్లులూ 1965-వ సంవత్సరంవరకూ ఇంగ్లీషులోనే వుండవలసి వున్నందున పార్లమెంటులో ప్రవేశ పెట్టేటప్పుడు న్యాయశాఖ* ఆమోదం పొందిన వాటి హిందీ అనువాదాలనుకూడ జత చేసి పంపాలని మా సలహా. ప్రజోపయోగం కోసమేగాక, తగినంత ఆంగ్లభాషా జ్ఞానం లేని పార్లమెంటు సభ్యులకు ఆ బిల్లులలోని నిబంధనలు తెలియడానికికూడా యిది ఎంతో అవసరం.

---

* ఉపసంఘం అభిప్రాయం నివేదికలోని 37, 38 పేజీలలోనూ; 22, 23 పేజీలలోని 44, 45 పేరాలలోను యివ్వబడింది.

పార్లమెంటు చట్టాలన్నీ దాన్ని సరిగా హిందీలోకి అనువాదం చేయవలసి వున్నది. పై సలహానుసరించి బిల్లులన్నింటినీ పార్లమెంటులో ప్రవేశపెట్టే నాటికి హిందీలోకి అనువదించి వున్నట్లయితే ఇంగ్లీషులోవున్న చట్టంతో పాటు, ఆ చట్టం యొక్క అధికార హిందీ అనువాదంకూడ లభ్యంకాగలదు.

కేంద్ర శాసన సభ చేసిన శాసనాలలో కొన్నింటికి కేంద్ర న్యాయ శాఖ ఇదివరకే అనువాదాలను తయారు చేయించింది. ఈ అనువాదాలకు మూల శాసనంతో సమానమైన అధికారాన్ని కల్పించడానికి తక్షణమే చర్యలు తీసుకో వాలని మా సలహా. సర్వ శాసన గ్రంథంయొక్క అధికార ముద్రగల హిందీ అనువాదం మూడు సంవత్సరాలలోగా సిద్ధం కావాలి. మా సలహాలను అమలు జరపడానికి కేంద్ర న్యాయ శాఖలోని హిందీ విభాగాన్ని పటిష్ఠం చేయాలి.

## న్యాయస్థానాల భాష

ముప్పైఐదు నుంచి ముప్పైతొమ్మిది వరకూగల అంశాల విషయంలో ఈ ఉపసంఘం చెప్పిన దానికి యీ క్రింది దానిని చేర్చాలని కోరుతున్నాము. సాక్ష్యాలను ఇంగ్లీషులోకి అనువదించే పద్ధతికి స్వస్తి చెప్పి, న్యాయాధిపతుల అనుమతితో న్యాయవాదులు హిందీలో వాదించడానికి అవకాశం కల్పించి, యితర దరఖాస్తులూ, అఫిడవిట్లూ హిందీ భాషలో దాఖలు చేయడానికి అనుమతించాలని హిందీ రాష్ట్రాలలోని హైకోర్టులను కోరాలి. తద్వారా ఆ హైకోర్టులు హిందీ వాడడానికి దారి చూపగలవు. సుప్రీం కోర్టు, హైకోర్టుల ముఖ్యమైన తీర్పులకు అధికార ముద్రగల హిందీ అనువాదాలను తయారు చేయడానికి త్వరలో ఏర్పాట్లు జరగాలి.† ఈ పని కేంద్ర న్యాయశాఖ అజ్మాయిషీ క్రింద న్యూ ఢిల్లీలోని ఒక కేంద్ర కార్యాలయానికి అప్పగించాలి.

## ప్రభుత్వోద్యోగాలకు పోటీ పరీక్షలు

ప్రభుత్వోద్యోగాలకు సంబంధించిన పరీక్షలలోను సైనిక శిక్షణ తరగతులలోను హిందీ వాడకాన్ని గురించి కొన్ని మాటలు చెప్పదల్చాము.

అధికార భాషా విచారణ సంఘం తమ సలహాలలోని 51-వ అంశంలో పోటీ పరీక్షలకు వాడుక చేసే భాష సాధారణంగా విద్యా వ్యవస్థలలోని బోధనా భాష అయివుండాలని సూచించింది.

ఈ సూత్రాన్ని అందరూ ఆమోదించాలని మేము భావిస్తున్నాము. ఈ సలహాను వదలి వేయాలని ఈ ఉప సంఘం నివేదికలో వెల్లడించిన అభిప్రాయంతో మేము ఏకీభవించము.

52, 53 అంశాల విషయంలో శిక్షణ సంస్థల ప్రవేశ పరీక్షలకు ప్రస్తుతానికి హిందీ, ఇంగ్లీషు రెండూ పరీక్షా భాషలుగా వాడుక చేయాలనీ, ఒక పరీక్షా పత్రానికి లేక అన్ని పరీక్షా పత్రాలకు ఆ రెండు భాషలలో ఏదో ఒకటి అభ్యర్థి ఎంచుకునే సౌకర్యంవుండాలనీ ఈ నివేదికలో వెల్లడించబడిన అభిప్రాయాన్ని మేము ఆమోదిస్తున్నాము. శిక్షణ సంస్థలలో బోధనాభాషగా కొంత కాలంవరకూ ఇంగ్లీషు ఒకటే వుండాలని చేసిన సలహాతో మేము ఏకీభవింప జాలము. అయితే శిక్షణలో కొన్ని విషయాలకు లేక అన్ని విషయాలకు హిందీని బోధనాభాషగా ప్రవేశపెట్టడానికి ఉచితమైన చర్యలు తీసుకోబడగలవు, అని ఒక ఊరడింపు సూచన చేశారు. ఆ "ఉచిత" అన్న మాటకు ముందు "త్వరలో" అన్న మాటను చేర్చాలని మేము సూచించాము. అయితే మా సూచనను అంగీకరించలేదు. దీనినిబట్టి ఆ సూచనకు ఎంత విలువ యివ్వబడిందో స్పష్టమౌతున్నది. ఇంగ్లీషు వీలైనంత దీర్ఘకాలం బోధన భాషగా వుండాలని వారు గట్టిగా వాంఛిస్తున్నారు. ఇది, దూరదృష్టిలేనటువంటి, అభ్యుదయ విరోధకమూ, దేశ ద్రోహకరమూ అయినటువంటిన్నీ వైఖరి అని మేము భావిస్తున్నాము. ఈ శిక్షణ సంస్థలలో చేర్చుకునే విద్యార్థులలో ఎక్కువమంది వయస్సు 15, 18 సంవత్సరాల మధ్య వుంటుంది. వారు చదువుకొన్న ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల్లో బోధన

---

† ఈ ఉపసంఘం అభిప్రాయం 38, 39 వ పేజీలలోను, 23 వ పేజీనుండి 25 పేజీవరకుగల 46 మొదలు 50 వరకు ఉన్న పేరాలలోను వివరింపబడింది.

భాష తమ ప్రాంతీయ భాష అయివుంటుంది. వారికి ఇంగ్లీషు భాషా జ్ఞానం చాల తక్కువ. కనుక, ఇంగ్లీషు ఒక్కటే బోధన భాషగా వుండాలని పట్టు పట్టడంలో అర్థం లేదు. ఈ శిక్షణ సంస్థలలో ప్రధాన బోధన భాషగా హిందీని వెంటనే స్వీకరించాలనీ ఇంగ్లీషును ప్రత్యామ్నాయ బోధనా భాషగా కొంతకాలం వరకూ ఉంచితే ఉంచవచ్చుననీ మా అభిప్రాయం.

54, 58 అంశాలకు సంబంధించిన అఖిల భారత ఉద్యోగాలకు కేంద్ర ప్రభుత్వ 'ఉన్నతోద్యోగాలకూ అభ్యర్థులను ఎన్నుకొనడానికి జరిపే పోటీ పరీక్షలలో పరీక్షా భాషగా ఇంగ్లీషుతో'పాటు ప్రత్యామ్నాయపరీక్షా భాషగా హిందీనికూడా, ముందుగా కొంత వ్యవధి యిచ్చి అప్పటినుంచీ ప్రవేశ పెట్టాలని అధికార భాషా విచారణ సంఘం (28 నెలల క్రింద) ఇచ్చిన సలహాను వెంటనే అమలు జరుపవలసింది. ఈ సలహాన్ని అమలు జరుపకుండా యింకా వాయిదా వేయడం సబబుకాదు. ఎందువల్లనంటే గడచిన 4 సంవత్సరాలలోను అనేక విశ్వవిద్యాలయాలలోని హెచ్చుమంది విద్యార్థులు హిందీ లేక తమ ప్రాంతీయ భాష పరీక్షా భాషగా పట్టభద్రులైనారు. వారి అంగ్ల భాషా జ్ఞానం పోటీ పరీక్షలలో పరీక్షా పత్రాలకు ఇంగ్లీషులో సమాధానం వ్రాయగలిగినంతగా లేదు. ఇందులో ఉన్నత పరీక్షలకు ప్రస్తుతానికి ఇంగ్లీషును పరీక్షాభాషగా వుంచే పక్షంలో, హిందీ భాష వుండాలని కోరే విద్యార్థులకు ఆ ప్రత్యామ్నాయ సౌకర్యం కల్పించడం వారికి కనీస న్యాయాన్ని కల్పించుటకు అవసరం.

ఈ పరీక్షలకు పరీక్షాభాషగా ఇంగ్లీషు ఉండాలనీ, కొంత కాలం తర్వాత హిందీని ప్రత్యామ్నాయ పరీక్షా భాషగా ప్రవేశపెట్టవచ్చుననీ ఈ ఉపసంఘం సభ్యులలో అధిక సంఖ్యాకుల అభిప్రాయం. ఇది న్యాయరహితమేగాక బోధనభాషగా ఇంగ్లీషుకు బదులు హిందీని కోరే విద్యార్థులపట్ల విచక్షణను చూపడముగూడా కాగలదని మా అభిప్రాయం. ఇంగ్లీషుతోపాటు హిందీని ప్రత్యామ్నాయ పరీక్షా భాషగా స్వీకరించాలని మేము చేసిన సూచనను హెచ్చు మంది సభ్యులు అంగీకరించలేదు. హిందీని ప్రత్యామ్నాయ పరీక్షా భాషగా వాడుక చేయకుండా వాయిదా వేసి "కొంత కాలం" తర్వాత అనుమతించాలని చూస్తున్నారు. యిది 1959 సెప్టెంబరులో జరుగనున్న పరీక్షలతోపాటు హిందీని కూడా పరీక్షా భాషగా ఉపయోగించడానికి అనుమతించాలనీ, యిందుకు సంబంధించిన ప్రకటన 1959 మార్చిలో జరగాలనీ మేము నిర్దిష్టంగా సూచించాము.

హిందీ విద్యార్థులకు యితర భాషలు మాతృభాషలుగాగల విద్యార్థులతో సమస్థాయి కల్పించడానికి ఈ పరీక్షలలో సమాన ప్రమాణాలుగల రెండు ప్రశ్నపత్రాలు తప్పని సరిగా వుండాలనీ, ఒకటి హిందీలోనూ, రెండవది అభ్యర్థి కోరుకునే మరొక ఆధునిక భారతీయ భాషలోనూ ఉండాలన్న సూచనను అంగీకరిస్తున్నాము.

## హిందీ మంత్రిత్వశాఖ ఏర్పరచాలని సూచన

అధికార భాషా విచారణ సంఘం, ఈ ఉపసంఘం, మేమూ చేసిన సూచనలను ఆలస్యంలేకుండా అమలు జరపాలంటే అవసరమైన భాషావిషయికమైన మార్పులను దశలవారీగా ప్రవేశపెట్టే విషయాన్ని శ్రద్ధగా కొనసాగించాలంటే ఒక ప్రత్యేక మంత్రిత్వ శాఖను నెలకొల్పడం అవసరం. ఈ మంత్రిత్వశాఖ యితర మంత్రిత్వశాఖల కార్య కలాపాలను సమన్వయ పరచుకొని వ్యవహరించాలిగాని వాటికి లోబడి పనిచేయ కూడదు. ఏ కారణం చేతనైనా హిందీ మంత్రిత్వ శాఖను ప్రత్యేకంగా నెలకొల్పడం సాధ్యం కాకపోతే అవసరమైన ఈ సంస్కరణలను అమలు జరపడానికి హోంశాఖ మంత్రిత్వశాఖ, లేక విద్యా మంత్రిత్వశాఖ ఆధ్వర్యవం క్రింద స్వయం నిర్ణయాధికారాలుగల ఒక సంస్థను ఏర్పాటుచేయాలి. అప్పుడు అధికారభాషను ఇంగ్లీషునుంచి హిందీకి మార్చే కార్యక్రమం 1965 నాటికిగాని, ఆ తర్వాత ఒకటి రెండేళ్లకుగాని పూర్తిగా అమలుజరపడానికి వీలవుతుంది.

న్యూ ఢిల్లీ, 
5-12-58

పురుషోత్తమదాస్ టండన్,
గోవిందదాస్.

న్యూ ఢిల్లీ, డిసెంబరు 3, 1958.

## శ్రీ ఫ్రాంక్ ఆంతొనీ భిన్నాభిప్రాయ సూచన

నివేదిక అంతటిపైన భిన్నాభిప్రాయం ప్రకటించక తప్పనిసరి అయినందుకు నేను చాలా విచారిస్తున్నాను. ఈ ఉపసంఘ సమావేశాలలో నేను పాల్గొన్నందుకు లాంఛనంగామాత్రమే ఈ నివేదికపై సంతకం చేశాను. పండిత పంత్ అధ్యక్షతను ఈ ఉపసంఘం రూపొందించిన నివేదికపైన నేను ప్రధానమైన అభిప్రాయభేదాలు తెలియజేయవలసి రావడంతో నా విచారం మరింత ఎక్కువైంది. అనుపమానమైన సౌజన్యము, కార్యనిర్వహణదక్షత, సహనమూ గలిగిన పంత్‌జీలాంటి వ్యక్తి ఈ ఉపసంఘానికి నాయకత్వం వహించకపోతే, అసలు యిట్టి సమగ్రమైన నివేదిక వెలువడివుండేది కాదని చెప్పడానికి సాహసిస్తున్నాను.

## రహస్య సమావేశాలు

ఈ ఉపసంఘ సమావేశాలు రహస్యంగా జరగడాన్ని నేను తీవ్రంగా వ్యతిరేకించిన సంగతి ఇక్కడ స్పష్టం చేయక తప్పదు. దేశంలోని బహు కొద్దిమంది ప్రజలకు మాత్రమే—ఆ మాటకొస్తే బహు కొద్దిమంది శాసనసభ్యులకు మాత్రమే—రాజ్యాంగంలోని అధికారభాషకు సంబంధించిన అసాధారణనిబంధనలు తెలుసు. ఈ పార్లమెంటరీ ఉపసంఘం రాజ్యాంగంలోని 344-వ ఆర్టికిల్ 4-వ క్లాజుని అనుసరించి ఏర్పాటు చేయబడింది. రాజ్యాంగం ఈ సలహా సంఘానికి విలక్షణమైన అధికారాలనిచ్చింది. ఈ ఉపసంఘం పార్లమెంటు ఉభయసభలచేత ఎన్నుకోబడింది. లోక్ సభనుంచి 20 మంది సభ్యులూ, రాజ్య సభనుంచి 10 మంది సభ్యులూ ఈ ఉపసంఘానికి ఎన్నికైనారు. పార్లమెంటుచేత ఎన్నుకోబడినప్పటికి యిది సామాన్యమైన పార్లమెంటు ఉపసంఘంకాదు. పార్లమెంటు ఉపసంఘాలు తమ నివేదికను పార్లమెంటుకు అందచేయవలసివున్నది. పార్లమెంటు ఆ నివేదికను కొంతదిగాగాని, పూర్తిగాగాని మార్చివేయవచ్చు. అయితే ఈ పార్లమెంటు ఉపసంఘం తన నివేదికను పార్లమెంటుకు అందచేయవలసిన బాధ్యతలేదు. ఈ నివేదిక పార్లమెంటుకి సమర్పించడం ఆకస్మికసంఘటన మాత్రమే. ఈ అంశాన్ని నేను పార్లమెంటులో ప్రస్తావించినమీదట పండిత పంత్ కేవలం తన ఉదారతవల్లమాత్రమే రాష్ట్రపతి అనుమతిని పొంది ఈ నివేదికను పార్లమెంటుకి నివేదించారు. అసలువరిస్థితి ఏమంటే పార్లమెంటు మామూలుప్రకారం ఈ నివేదికపై చర్చ సాగించినా, దానిలో ఏ సిఫార్సునూ మార్పుచేయడానికిగాని, నిజానికి ఆ నివేదికలోని ఒక్క మాటనయినా సవరణ చేయడానికిగాని పార్లమెంటుకి అధికారం లేదు.

రాజ్యాంగ నిర్ణయానుసారం ఈ నివేదికను నరాసరి రాష్ట్రపతికి పంపవలసివున్నది. ఈ నివేదిక ననుసరించి ఆదేశాలను జారీచేయడానికి రాష్ట్రపతికి సంపూర్ణమైన, నిర్నిబంధమైన అధికారం వున్నది. అంటే, నిజానికి అతి ప్రధాన సమస్యఅయిన అధికారభాషకు సంబంధించి ఏమి చేయవల్సింది, ఏమి చేయరానిదీ నిర్ణయం చేసేది ఈ చిన్న ఉపసంఘమే నన్నమాట.

ఇట్టి ప్రత్యేక పరిస్థితులున్నందువల్లనే, ఈ ఉపసంఘ సమావేశాలను బహిరంగంగా జరపడం అవసరమేకాక, కర్తవ్యమనికూడా నేను గట్టిగా చెప్పాను. అప్పుడు, మనం జరిపే సమాలోచనలూ, చేసే క్లిష్టమైన నిర్ణయాల విషయంలో ప్రజలవిశ్వాసాన్ని పొందడానికి అవకాశముంటుంది. సమావేశాలు రహస్యంగా జరగాలని అధికసంఖ్యాక సభ్యులు నిర్ణయించడంతో, ఈ ఉపసంఘం చుట్టూ ఒక అవాస్తవిక వాతావరణం ఏర్పడిందని నా అభిప్రాయం. ఈ ఉపసంఘ సమావేశాలలో వెల్లడించబడిన పలువిధములైన అభిప్రాయాల సంగతి దేశానికి తెలియదు. దేశంలోని వివిధప్రాంతప్రజల అభిప్రాయాలను తెలుసుకొనడానికి ఈ ఉపసంఘసభ్యులకు అవకాశంలేదు. ఏతావతా తేలిందేమంటే ఈ రహస్య సమావేశాలలో సుమారు 20 మంది వ్యక్తులు తెరవెనుక కూర్చుని దేశమంతటికీ ప్రధానమైన అతి వివాదగ్రస్తమైన సమస్యను పరిష్కరించడానికి తలపెట్టారు.

## కఠిన ప్రవర్తన

అధికార భాషా విచారణ సంఘం సలహాలనే పరిశీలించవలసి వున్నప్పటికీ, అధికారభాషకు సంబంధించిన అంశాలనూ, అధికార భాషా విచారణ సంఘం చర్చించని అంశాలనూకూడా పరిశీలించడానికి ఈ ఉపసంఘానికి స్వేచ్ఛ వున్నదని నా అభిప్రాయం. ఆ విధంగా, రాజ్యాంగంలోని 351-వ ఆర్టికిల్ ననుసరించి హిందీభాషకూడా ఆంగ్ల* పారిభాషిక పదాలను వినియోగించుకుని తద్వారా వివిధరూపములుగల భారతీయ సంస్కృతిని ప్రతిబింబింపచేయుడానికి పరిపూర్ణమైన భావప్రకటనా సాధనంగా ఉపకరించేందుకు ఆంగ్లభాషను రాజ్యాంగంలోని 8-వ షెడ్యూలులో చేర్చాలన్న సలహాలోని ఔచిత్యాన్ని ఈ ఉపసంఘం తప్పనిసరిగా పరిశీలించవలసిందని నేను భావిస్తున్నాను. దానికి బదులుగా నా ప్రతిపాదన ఈ ఉపసంఘం అధికారాలకు, పరిశీలనావకాశాలకు అందుబాటులో లేదనిచెప్పి నా ప్రతిపాదనను తృణీకరించారు.

అదేవిధంగా, తటస్థభాషగా హిందూస్థానీ భారతదేశ అధికారభాషగా వుండాలన్న గాంధీజీ కోర్కెను పరిశీలించాలని నేను చేసిన సూచననుకూడ ఈ ఉపసంఘం త్రోసిపుచ్చింది.

ఈ ఉపసంఘం అధికార భాషా విచారణ సంఘం సిఫార్సులపట్ల అనుచితమైన సంకుచిత వైఖరిని అనుసరించినదనికూడా నేను అభిప్రాయపడ్డాను. విచారణసంఘం సిఫార్సులు మినహాగా యితరవిషయాలేవీ పరిశీలించ కూడదన్న అపోహతో ఈ ఉపసంఘం పనిచేసింది. ఈ విధంగా ఈ ఉపసంఘ కార్యకలాపాలు అధికార భాషా విచారణ సంఘం సిఫార్సులవల్ల నిష్కారణంగా నిర్వీర్యమైపోయాయి. అధికార భాషా విచారణ సంఘ సభ్యుల నియామకాన్ని గూర్చి, ఆ సంఘం నిష్పాక్షిక స్వభావాన్నిగూర్చి ముఖ్యంగా హిందీ మాతృభాష కాని రాష్ట్రాలవారు తీవ్రంగా విమర్శించారు.

ఈ ఉపసంఘ కార్యక్రమంలోని ప్రధానమైన లోపం, దేశంలోని వాతావరణం బాగా మారినప్పటికీ, హిందీ భాషను బలవంతంగా ప్రవేశపెట్టడంపట్ల వ్యతిరేకత హెచ్చు ప్రాంతాలకు వ్యాపించినప్పటికీ, మరే యితర సాక్ష్యాన్ని తీసుకొనడానికీ ఈ ఉపసంఘం నిరాకరించడం. హిందీ అధికారభాషగా వుండరాదని పశ్చిమ బెంగాల్ శాసనసభ చేసిన ఏకగ్రీవ నిర్ణయాన్ని ఈ ఉపసంఘం తృణీకరించింది.

### ఈ ఉపసంఘంచేసిన ప్రధాన సూచన మొత్తంమీద ఈ ఉపసంఘం హిందీని ప్రవేశపెట్టడానికి 1965-ను గడువుగా పెట్టినట్టే

అధికారభాషగా హిందీని వాడుకలోకి తేవడానికి మొత్తంమీద 1965-నే గడువు సంవత్సరంగా ఈ ఉపసంఘం నిర్ణయించింది. ఈ ఉపసంఘంచేసిన ముఖ్య సూచన ఇది :—

"ఇంగ్లీషుకి బదులు, హిందీని పూర్తిగా వాడుకలోకి తెచ్చేతేదీ ఈ కార్యక్రమ పరాకోటిని సూచిస్తుంది. అంతేగాని అది మరొక దశకాదు. కనుక, ఆ తేదీని ఈ కార్యక్రమానికి అవధిగా పరిగణించకూడదు. ఈ సమస్యను పరిష్కరించే విధానం ఆచరణ సాధ్యమయినది, మార్పు కూర్పులకు అవకాశంగలదీ కావాలి. 1965 వరకు కేంద్రప్రభుత్వ వ్యవహారాలలో ఇంగ్లీషే ప్రధాన అధికారభాషగాను, హిందీ రెండవ అధికారభాషగాను ఉండాలి. 1965 తరువాత హిందీ ప్రధాన అధికారభాషగాను, ఇంగ్లీషు రెండవ అధికారభాషగాను ఉండాలి.† ఏయే కార్యకలాపాలలో ఇంగ్లీషును వాడవలసినదీ పార్లమెంటు శాసనంద్వారా నిర్ణయిస్తుంది. ఆ విధంగా అవసరమయినంతకాలం ఇంగ్లీషు వాడుకలో ఉంటుంది."

---

* ఎనిమిదవ షెడ్యూలులో పేర్కొనబడని యితర భాషలనుంచి పైతం పదజాలాన్ని హిందీభాష స్వీకరించడానికి 351 వ ఆర్టికల్ ప్రకారం లోగడ అనుమతి లభించింది. ఈ నివేదిక తృతీయాధ్యాయంలోని 27 వ పేరాలో, ఆంగ్ల పారిభాషిక పదాలనుగాని అంతర్జాతీయ పారిభాషిక పదాలనుగాని వాడుకచేయడం, అనుసరించడం, 351 వ ఆర్టికల్‌లోని సాధారణ నిబంధనలకు అనుగుణంగానే వున్నవని స్పష్టంచేయబడింది.

† ఈ సంఘం నివేదికలోని 12 వ పేజీలో, 23 వ పేరాలో "ఉంటుంది" అన్నమాట ఉపయోగించబడింది.

"1965 నుంచీ హిందీ ప్రధాన అధికారభాషగాను," అన్నమాటలు నిస్సందేహంగా హానికరమైనవేగాక సహజంగా దారుణమైన ప్రాధాన్యం గలవిగా ఉన్నాయి. పై సూచనలోని ఈ మాటలు 1965-వ సంవత్సరంనుంచీ హిందీ ప్రధాన అధికారభాషగా వుండగలదని ఈ ఉపసంఘం భావిస్తున్నదని స్పష్టం చేస్తున్నాయి. ఈ సూచనలోని ప్రారంభవాక్యాలలోని పదజాలం గడువు నిర్ణయం విషయంలో పరిస్థితుల కనుగుణమైన, ఆచరణ యోగ్యమైన దృక్పథాన్ని అనుసరించాలని సూచించగా, "1965-వ సంవత్సరంనుంచీ హిందీ ప్రధాన అధికారభాషగాను" అన్నమాటలు హితకరమైన ఈ ప్రాథమిక దృక్పథాన్ని త్రోసివేస్తున్నాయి. స్పష్టమైన అర్థం ఏమిటంటే, ఈ సూచనవలన 1965-వ సంవత్సరంనుంచీ హిందీ యథార్థంగా ప్రధాన అధికారభాషగా వుండగలదని, ఇంగ్లీషు స్థానంలో అధికారభాషగా వుండగలదని ఊహిస్తూ ఇంగ్లీషు స్థానంలో అధికార భాషగా హిందీని వాడడానికి 1965 గడువుసంవత్సరంగా చేసిన నిర్ణయాన్ని యీ ఉపసంఘం అంగీకరించినదన్న విషయం సుస్పష్టం. ఈ ఉపసంఘం చేసిన ఆ సూచన దేశంమొత్తానికి, అందులో ముఖ్యంగా హిందీ మాతృభాషకాని ప్రాంతాలకు విపరీత విప్లవాత్మకమైనది. ఈ సూచన ప్రకారం 1965 సంవత్సరంనుంచీ ఇంగ్లీషు స్థానంలో హిందీని వాడుకలోకి తేవడానికి అవసరచర్యలను తీసుకోవాలని రాష్ట్రపతి ఆదేశిస్తారు.

మొట్టమొదటి విషయం. యిటీవలి గౌహతీ సమావేశంలో ఇంగ్లీషు బదులు హిందీని ప్రవేశపెట్టడానికి 1965 గడువు సంవత్సరంగా ప్రభుత్వం పరిగణించబోదని కాంగ్రెసు చేసిన వాగ్దానానికి ఈ సూచన భంగకరంగా వున్నది. యింతకంటె ఆందోళనకరమైన విషయమేమనగా, ఈ సూచన రాజ్యాంగంలోని 343-వ ఆర్టికల్‌ను భంగపరుస్తున్నది. 343-వ ఆర్టికల్‌లోని 3-వ క్లాజులో యీ క్రింది విషయం స్పష్టం చేయబడినది. "పైన చెప్పబడిన 15 సంవత్సరాల గడువు తర్వాతకూడ చట్టరీత్యా నిర్దేశించబడే కార్యకలాపాలకు ఆంగ్లభాషను వాడుకచేసే అవకాశాన్ని పార్లమెంటు చట్టరీత్యా కల్పించవచ్చును." రాజ్యాంగంలోని ఈ నిబంధన ప్రకారం 1965-వ సంవత్సరం తర్వాతకూడ ప్రస్తుత స్థితే కొనసాగాలని పార్లమెంటు నిర్ణయం చేయవచ్చునని స్పష్టమౌతున్నది. అంటే 1965 తర్వాతకూడా ఇంగ్లీషు ప్రధాన భాషగా వుండాలని పార్లమెంటు నిర్ణయించవచ్చును. అయితే, పార్లమెంటు అధికారాన్ని రద్దు చేయడానికీ, పెడమార్గాన్ని పట్టించడానికీ, ఈ ఉపసంఘం స్వయం దత్తాధికారాన్ని సృష్టించుచున్నది.† ఈ ఉపసంఘం సూచనల ప్రకారం, పార్లమెంటు ఏమి భావించినప్పటికీ, 1965 తర్వాత అధికారభాష విషయంలో ప్రస్తుతస్థితి కొనసాగడానికి వీల్లేదు. 1965-వ సంవత్సరం తర్వాతకూడా ప్రధాన అధికారభాషగా ఇంగ్లీషునే నిలిపివుంచేడానికి పార్లమెంటుకుగల అధికారాన్ని తొలగించివేయడానికి ఈ ఉపసంఘం ప్రయత్నిస్తూంది. నా దృష్టిలో ఈ ఉపసంఘం చేసిన ఈ సూచన అక్రమ అధికార వినియోగానికి ప్రత్యక్ష నిదర్శనం. ఈ సూచన కాంగ్రెసు పక్షం యిటీవలచేసిన వాగ్దానానికి భంగకరమేగాక, పార్లమెంటుకు మాత్రమే గల రాజ్యాంగ అధికారాలను అపహరించడానికీ, రద్దుచేయడానికీ జరిగిన ప్రయత్నం.

## బహు జాతి సిద్ధాంత ప్రమాదం

ఈ ఉపసంఘం ఈ నివేదికద్వారా హానికరమైన బహుజాతి సిద్ధాంతాన్ని క్రొత్తగా తెచ్చిపెట్టింది. ఈ నివేదిక లోని ఒక భాగంలో ఈ ఉపసంఘం యిలా తెలియజేసింది. "లోగడ పేరాలలో పేర్కొన్నటువంటి రాజ్యాంగంలో నిర్దేశించిన పరిష్కార పథకం సమగ్రమైన, సర్వవ్యాప్తమైన ప్రణాళిక. రాజ్యాంగ పరిషత్తు ముందువెనకలను జాగ్రత్తగా పరిశీలించి ఈ పథకాన్ని రూపొందించింది. దేశంలోని వివిధ భాషావర్గాల మధ్య గరిష్ఠ సామాన్యాభిప్రాయాన్ని వ్యక్తం చేసే యీ పరిష్కార పద్ధతికి వ్యతిరేకంగా రాజ్యాంగ పరిషత్తులో ఎవరూ వోటుచేయలేదు. అధికార కార్యకలాపాలకు హిందీతోపాటు యితర జాతీయభాషలను వాడుకచేయడానికి అది అవకాశాన్ని కల్పించింది.

† "1965 వ సంవత్సరంనుంచి హిందీ ప్రధానభాష అయినప్పుడు" అన్న క్లాజు 343 వ ఆర్టికలో పేర్కొన్న రాజ్యాంగంలో నిర్దేశించిన పరిష్కారాన్ని వ్యక్తం చేస్తున్నది. 1965 వ సంవత్సరం తర్వాతకూడా పార్లమెంటు చట్ట రీత్యా నిర్దేశించే కార్యకలాపాలకు అవసరమైనంతకాలం ఆంగ్ల భాషను వాడుకచేయవచ్చని ఈ ఉపసంఘం సిఫార్సుచేసింది. 343-3 వ ఆర్టికల్ చట్టరీత్యా నిర్దేశించే కార్యకలాపాలను 1965 తర్వాతకూడ ఆంగ్లాన్ని వాడుకచేయడానికి పార్లమెంటుకు అధికారం యివ్వగా ఈ సంఘం మాత్రం యీ అంశాన్నిగురించి విశిష్టమైన సిఫార్సు చేసింది.

ఈ నివేదిక మరొక భాగంలో యీ ఉపసంఘం యిలా పేర్కొన్నది. "హిందీకి, తదితర జాతీయభాషలకు మధ్య సంఘర్షణ ఉత్పన్నమయ్యే అవకాశమేలేదు."

ఈ ఉపసంఘ నివేదికలో ఉపయోగించిన భాష రాజ్యాంగంలో స్పష్టంగా పేర్కొనబడిన న్యాయశాస్త్ర సంబంధమైన ఆదేశాలకు విరుద్ధంగావున్నదని నేను భావిస్తున్నాను. దీనికి మించిన మరొక నష్టం ఏమంటే, బహుజాతి సిద్ధాంతాన్ని అధికారుల మనస్తత్వంలోకి ప్రవేశపెట్టడం. జాతీయభాషా సిద్ధాంతాన్ని రాజ్యాంగం బుద్ధిపూర్వకంగా తిరస్కరించింది. బహుభాషా సిద్ధాంతం దృష్ట్యా, హిందీకంటె ప్రాచీనమైనవీ, పరిపుష్టమైనవీ అనేక భాషలున్నందున జాతీయభాషా ప్రస్తావన తీసుకురావడం, ఆ భావను దేశమంతటా "జాతీయ" అన్న మాటకుగల పూర్తి అర్థంలో ప్రవేశపెట్టడమేనని మన రాజ్యాంగ నిర్మాతలు గుర్తించారు. భాషా సమస్యకు రాజ్యాంగం నిర్దేశించిన సమగ్ర ప్రణాళిక కేంద్ర ప్రభుత్వ కార్యకలాపాలకు ఒక అధికారభాష, వివిధ రాష్ట్రాల అధికార కార్యకలాపాలకు వివిధ అధికారభాషలు ఉండాలని మాత్రమే నిర్ధారణచేసింది. ఈ సంఘం "జాతీయ" అన్న మాటను వాడడం అశాంతికరమూ, అశుభసూచకమూ అనక తప్పదు. హిందీకి "రాష్ట్రీయ భాష" లేక "జాతీయ భాష" అని పేరు పెట్టడానికి 1950 వ సంవత్సరంనుంచీ వీరహిందీవాదులు వత్తిడి చేస్తూనేవున్నారు. "అధికార" అన్న పదం వారికి సంతృప్తికలిగించలేదు. దేశమంతటికీ హిందీని జాతీయభాషగా చేయడానికి తలపెట్టిన ఈ ఉద్యమం హిందీ మాట్లాడని రాష్ట్రాల ప్రజలు దీనిని తప్పనిసరిగా ప్రతిఘటించేట్టుచేసింది. ఎనిమిదవ షెడ్యూలులోని భాషలను "జాతీయ" భాషలుగాపేర్కొని వారి ప్రతికూలతను ఉపశమింపచేయడానికి ఇప్పుడు ప్రయత్నిస్తున్నారు.

ఎనిమిదవ షెడ్యూలులో పేర్కొన్న భాషలలో దేనినీ, సాంకేతికంగా చూచినా, న్యాయశాస్త్ర దృష్ట్యాచూచినా జాతీయభాష అనడానికి వీల్లేదు. "జాతీయ" అన్న విశేషణం వాడడానికి ఒక కనిష్ఠ లక్షణం అవసరం. దేశంలో ఏదో ఒక ప్రాంతానికి మాత్రం పరిమితమై, దేశమంతటా వాడుకలోలేని భాషను, శబ్దశాస్త్రప్రకారం "జాతీయ" భాష అనడానికి వీల్లేదు. ఇంతేగాక భాషకు సంబంధించిన ప్రస్తుత పరిస్థితిలో ఈ మాటను ప్రయోగించడంవల్ల అనేక తీవ్ర ప్రమాదాలకు గురికావలసివస్తుంది. హిందీని జాతీయభాష† అనడానికి వ్యతిరేకించిన హిందీ మాతృభాషకాని ప్రాంతాల వారిని సంతృప్తిపరచడానికి ఆ మాటను వాడాలన్నది స్పష్టంగా తెలుస్తున్నది. ఇది వీరహిందీవాదులను శాంత పరుస్తుంది. "జాతీయ" అన్న పదం ఉపయోగించడంవల్ల దేశమంతటకీ హిందీని చుట్టబెట్టడానికి తమకు హక్కు ఏర్పడిందని యిప్పుడు వారంటారు.

మరొక తీవ్రమైన అభ్యంతర మేమిటంటే, కొన్ని భారతీయ భాషలకే "జాతీయ" అన్న పదాన్ని ఉపయోగించడం. ఇది రాజ్యాంగం 8 వ షెడ్యూలులో పేర్కొనని భాషలు మాట్లాడే లక్షలాది భారతీయులను నిష్కారణంగా అవమానపర్చడం. సింధీలు, ఆదిమవాసులు, భారతదేశంలోని గూర్ఖాలు, నాగజాతివారు యింకా యితరులు—అనేక లక్షలమందికి వారి వారి భాషలున్నాయి. వారి భాషలు వారికి అత్యంత ప్రియమైనవి. ఈ లక్షలాది మందికి యిప్పుడు వారి భాషలు జాతీయ భాషలు కావని చెపుతున్నారు. వీరహిందీవాదుల పదజాలంలో చెప్పాలంటే వారు జాతీయతను కోల్పోయిన భారతీయులు, జాతీయత లేని భాషలు మాట్లాడేవారు. ఆ భాషలకు వొక విధమైన ఉప జాతీయతా ప్రతిపత్తిని కల్పిస్తూ ఈ ఉపసంఘం, వారికి నోటీసు యిస్తున్నదన్న మాట.

కేవలం ఎనిమిదవ షెడ్యూలులో చేర్చిన భాషలకు "జాతీయ" అన్న విశేషణం తగిలించడం పూర్తిగా న్యాయ విరుద్ధం. అట్టి వివరణగాని, అట్టి ప్రతిపత్తినిగాని రాజ్యాంగం ఎన్నడూ ఉద్దేశించివుండలేదు. హిందీ భాష హిందుస్థానీనుంచీ ఎనిమిదవ షెడ్యూలులో పేర్కొన్న యితర భాషలనుంచీ రూపాలనూ, నుడికారాలనూ స్వీకరించ వచ్చునని రాజ్యాంగంలోని 351-వ ఆర్టికిల్‌లో కేవలం సూచించబడింది. ఈ భాషలను ఎనిమిదవ షెడ్యూలులో చేర్చడంలో హిందీ ఆ భాషలతో సంబంధం కలిగివుండడానికి ఆ భాషలనుంచి పదాలు తీసుకుంటుందని మాత్రమే అర్థం. ఇప్పుడు ఉప జాతీయతా స్థాయికి నెట్టబడిన లక్షలాది యితర భారతీయులు మాట్లాడే భాషలకు వ్యతిరేకంగా ఈ భాషలకు "జాతీయ" భాషల ప్రతిపత్తిని కల్పించాలని ఎన్నడూ ఉద్దేశించలేదు.

---

†ఈ సంఘ నివేదికలోని "జాతీయ భాషలు" అన్న మాటలు ఎనిమిదవ షెడ్యూలులో పేర్కొన్న భాషలకు మాత్రమే ఉపయోగించలేదు.

ఈ "జాతీయ" అన్న విశేషణాన్ని అక్రమంగా ప్రయోగించడంవల్ల జరిగిన మరొక ఘోరమేమంటే హిందీ ఏ విధంగానైనా "జాతీయ" భాషగా పేర్కొన్నబడాలన్న హిందీవాదుల కోర్కెను సంతృప్తిపరచడంకోసం ఈ ఉప సంఘం ద్విజాతి సిద్ధాంతాన్నికాదంటూ బహుజాతి సిద్ధాంతాన్ని అంగీకరించింది. ఈ సంఘం సూచనం ప్రకారం భాషలు పద్నాలుగువుంటే జాతులుకూడ అన్నీ వుండాలి. నా అభిప్రాయంలో భాషా ప్రాతిపదికపై జరిగిన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ, బహుజాతి సిద్ధాంతానికి మొదటి నైవేద్యం. పద్నాలుగు భాషలను జాతీయ భాషలుగా పరిగణించడం ఈ సిద్ధాంతానికి అధికార రీత్యా అర్పిస్తున్న మరొక నైవేద్యం. హిందీని బలవంతాన రుద్దడంవల్ల దేశం జాతీయంగా భిన్నభిన్నమై అనేక ఖండాలు ఏర్పడడానికి దారి తీస్తుందని నా దృఢ విశ్వాసం.

## ఉద్యోగార్థులకు హిందీలో అర్హత

కేంద్ర ప్రభుత్వ శాఖలకు చెందిన స్థానిక కార్యాలయాలలోని రైల్వే తంతి తపాల శాఖ, రాబడి పన్ను శాఖ కార్యాలయాలలో సహాయకోద్యోగాలకు అభ్యర్థుల నియామకాల విషయంలో "శాశ్వతమైన ద్విభాషా సిద్ధాంతాన్ని రూపొందించాలని అధికార భాషా విచారణ సంఘం యిచ్చిన సలహాను ఈ ఉపసంఘం ఆమోదించింది. అంటే, అట్టి ఆఫీసులలో లోపలి పనులకు హిందీ భాషనూ, ఆయా ప్రాంతాలవారితో జరిపే లావాదేవీలకు ఆయా ప్రాంతీయ భాషలను ఉపయోగిస్తారని అర్థం." కేంద్ర ప్రభుత్వోద్యోగాలలో కొత్తగా చేరే వారికి హిందీ భాషలో తగుమాత్రం ప్రవేశం అర్హతగా నిర్ణయిస్తే చాలనీ, అయితే యీ విషయాన్ని చాల ముందుగానే అభ్యర్థులకు తెలియజేసి భాషా పరిచయార్హతను తక్కువ స్థాయిలో నిర్ణయించాలనీ, అది కొరతగావుంటే ఉద్యోగంలో చేరిన తర్వాత శిక్షణపొంది ఆ కొరతను భర్తీ చేసుకోవచ్చునీ కేంద్ర ప్రభుత్వం నిర్ణయిస్తే సరిపోతుందని" అధికార భాషా విచారణ సంఘం యిచ్చిన సలహానుకూడ ఈ ఉపసంఘం ఆమోదించింది. "తగినంత ముందుగానే తెలియచేసే పక్షంలో" అన్న మాటలతో యుక్తమైన రక్షణను కల్పించడానికి ప్రయత్నం జరుగగా 1965-వ సంవత్సరంనుంచీ హిందీ ప్రధాన అధికార భాష కాగలదని ఈ సంఘం చేసిన ప్రముఖ సూచన సహాయకోద్యోగాలకుసైతం ఈ అభ్యర్థులను తీసుకునేటప్పుడు జరిపే హిందీ పరీక్షకు సంబంధించిన ముందు షరతు 1965 సంవత్సరానికి ముందునుంచే అమలు జరపబడడం తప్పని సరి చేస్తున్నది. ఇందువల్ల విధిగా కలిగే ఫలితం ఏమంటే, హిందీ మాతృ భాషకాని ప్రాంతాలలోసైతం కేంద్ర ప్రభుత్వం తాలూకు రైల్వేలు, తంతి తపాల శాఖల స్థానిక కార్యాలయాలలో ఉద్యోగులను నియమించేటప్పుడు ఆ ప్రాంతాలలో నివసిస్తున్న హిందీ మాతృ భాషగా గలవారికే ఎక్కువ అవకాశం ఉంటుంది. మూడవ భాషగాకూడా హిందీని తమ పాఠశాలల్లో నిర్బంధంగా ప్రవేశ పెట్టడానికి కొన్ని రాష్ట్రాలు నిరాకరించిన సంగతి అందరెరిగినదే. అందువల్ల, కేంద్ర ప్రభుత్వం తాలూకు సబార్డినేటు ఉద్యోగాలకు పోటీ చేసే అభ్యర్థులకు వచ్చే ఐదు లేక పది సంవత్సరాలలో హిందీలో కొద్ది ప్రవేశం మాత్రం లభించవచ్చు. ప్రత్యేకంగా ఈ షరతును విధించడం వల్ల, వచ్చే ఒకటి రెండు సంవత్సరాలలో కాకపోయినా విధిగా 1965 కు పూర్వం ఈ షరతును అమలు జరపడం తథ్యం కాబట్టి, హిందీ మాతృ భాషకాని అభ్యర్థులు కేంద్ర ప్రభుత్వ శాఖలకు† చెందిన సహాయకోద్యోగాలకు నియమించబడే అవకాశం క్రమంగా తగ్గిపోతుంది.

## శిక్షణ సంస్థలలో ద్విభాషా, బహు భాషా సిద్ధాంతాలు

జాతీయ రక్షణ ఎకడెమీలోను, దానిని పోలిన ఇతర శిక్షణ సంస్థలలోను ప్రవేశానికి కోటా పద్ధతిని అనుసరించాలని అధికార భాషా విచారణ సంఘం వెల్లడించిన అభిప్రాయంతో ఏకీభవించ జాలమన్నది ఈ ఉపసంఘం చేసిన హితకరమైన సూచనలలో ఒకటి. అయితే అఖిల భారతోద్యోగాలకు అభ్యర్థులను నియమించే విషయంలోకూడ కోటా పద్ధతి వుండాలన్న దానికంటె ఈ సూచన ఎక్కువ అభ్యంతరకరమైనది కాదు.

హిందీని బలవంతంగా రుద్దడంవల్ల హిందీ మాతృభాష కాని ప్రజల సహజ వ్యతిరేకతను తగ్గించే మార్గం కోసం జరుగుతున్న నిరంతర అన్వేషణలో దేశాన్ని భిన్నభిన్నం చేయగల రాజీ మార్గాలన్నీ సూచించబడుతున్నవి. అధికార

† ఈ సిఫార్సులను ఈ నివేదికలోని 13 వ, 14 వ, 15 వ సిఫార్సులతోను 22 వ, 23 వ పేరాలతోను సరిచూచుకొని చదువుకోవాలి.

భాషా విచారణ సంఘం సిఫార్సుచేసినట్లుగా అఖిల భారతోద్యోగాలకు, రక్షణశాఖలో ఉద్యోగాలకు కోటా పద్ధతిని అమలు జరిపే పక్షంలో జాతీయ సమైక్యభావం, ఏక జాతి సిద్ధాంతం అంటూ చేస్తూన్న వటనలను నిలిపివేయవచ్చును. కాని, ఈ ఉపసంఘం ఆ సిఫార్సును న్యాయంగా తిరస్కరించింది. అఖిల భారతోద్యోగాలలోనూ, రక్షణ శాఖోద్యోగులలోనూ ఉద్యోగాలకు కోటా పద్ధతిని ప్రవేశపెడితే బహు జాతి సిద్ధాంతాన్ని మరొకసారి అంగీకరించినట్లే అవుతుంది.

రక్షణశాఖకు చెందిన శిక్షణ సంస్థలలో ప్రవేశ పరీక్ష ప్రాంతీయభాషలలోనూ, బోధనకు సంబంధించిన అన్ని, లేక కొన్ని విషయాలకు ఇంగ్లీషుతోబాటు హిందీనికూడ బోధనా భాషగా ప్రవేశపెట్టాలనీ ఈ ఉపసంఘం చేసిన సూచన హిందీని బలవంతంగా అమలుపరచడానికి జరుగుతున్న వత్తిడి పెరగడంవల్ల కలుగుతున్న ఆకమకకు ప్రబల నిదర్శనం. రక్షణ శాఖోద్యోగార్థులకు శిక్షణ యివ్వడంలో ద్విభాషా సిద్ధాంతాన్ని ప్రవేశపెడితే ఉత్తరోత్తరా ఈ కీలకోద్యోగాలలోని సిబ్బందిలో తీవ్రమైన, విషాదకరమైన భాషా విద్వేషాలు విధిగా ఏర్పడగలవు.

ముందుగాని వెనుకగాని, బహుశః ముందుగానే (1965-వ సంవత్సరంనుంచీ ప్రధాన అధికారభాషకాగలదన్న ముఖ్య సూచన దృష్ట్యా) హిందీ, ఆంగ్లభాషలు రక్షణశాఖలకు చెందిన శిక్షణ సంస్థలలో ఒకదాని సరసను మరొకటి బోధనా భాషలు కాగలవని ఈ కమిటీ సూచనకు అర్థం. ఆచరణలో యిందువల్ల కలిగే ప్రత్యక్ష ఫలితం సువిదితం. ఈ ఫలితాలు కేవలం వినోదకరమైనవి మాత్రమే అయితే దేశం ఆనందించవచ్చును. కాని యివి తప్పనిసరిగా వినత్కారమైనవి. రక్షణశాఖకు చెందిన శిక్షణ సంస్థలలోనే రెండు వర్గాల శిక్షణార్థులుంటారు. ఒక వర్గంవారికి ఆంగ్లంలోనూ, రెండవ వర్గంవారికి హిందీలోను శిక్షణ ఇస్తారు.† రక్షణశాఖల సిబ్బందికూడా హిందీ వాలాలూ, ఇంగ్లీషు వాలాలు అన్న రెండు వర్గాల క్రింద విభాగించబడతారు. సాయుధదళాలను భాషా విషయకంగానేగాక మానసికంగా కూడా ప్రతికూలవర్గాలుగా విభజించడానికి యిది అంకురార్పణ అన్నమాట. ఇందువల్ల తీరని అపకారం జరుగుతుంది. ఇంతకు మించిన ఘోరవిపత్తుకూడా సంభవించగలదని నేను ముందుగానే చెప్తున్నాను. రక్షణ సంస్థలలో రెండు బోధనాభాషల ఏర్పాటు ఆచరణ సాధ్యమని మనం అంగీకరిస్తే, హిందీభాషను తిరస్కరించిన బెంగాలు రాష్ట్రంవంటి హిందీ మాతృభాష కాని అనేక ప్రాంతాలలో యీ వ్యతిరేకత తీవ్రం కావడంతో, ఆ సంస్థలలో బహు బోధనాభాషలను ప్రవేశపెట్టాలన్న దుర్భరమైన కోర్కెకు తప్పనిసరిగా దారితీయగలదు. వాంఛనీయమూ, ఆచరణ యోగ్యమూ కానప్పటికీ, రక్షణ సంస్థలలో బోధనాభాషలక్రింద 14 లేక అంతకుమించిన భాషలను ప్రవేశపెట్టడానికి చిట్టచివరకు ప్రభుత్వం విధిగా అంగీకరించవలసివస్తుంది. ఇట్టి పరిస్థితులలో రక్షణశాఖలో ఐకమత్యం అనేది ఛాయామాత్రంగానైనా వుంటుందనుకుంటే అంతకుమించిన ఆత్మవంచన మరియొకటి ఉండబోదు.

## అఖిల భారతోద్యోగాలకు, కేంద్ర ఉన్నతోద్యోగాలకు అభ్యర్థుల ఎన్నికకు ద్విభాషా, బహు భాషా సూత్రాలు

ఈ ఉపసంఘం యీ క్రిందివిధంగా సిఫార్సు చేసింది. "ఈ సమస్యకు సంబంధించిన అన్ని అంశాలను జాగ్రత్తగా పరిశీలించినమీదట పరీక్షాభాషగా యిక ముందుకూడ ఇంగ్లీషే వుండాలనీ, ప్రత్యామ్నాయభాషగా హిందీని స్వీకరించవచ్చునీ, కొంతకాలం తర్వాత అవసరమైనంతవరకూ అభ్యర్థులు తమ ఇష్టానుసారం ఇంగ్లీషుగాని, హిందీగాని పరీక్షాభాషగా కోరుకునే ఏర్పాటుచేయాలనీ ఈ ఉపసంఘం నిర్ణయించింది. రాష్ట్రాలవారీ కోటా పద్ధతిలేకుండా పరీక్షా భాషలుగా ప్రాంతీయభాషలను ప్రవేశపెట్టడం సాధ్యమయే పక్షంలో ఆ పద్ధతిని సూత్రప్రాయంగా అంగీకరించడానికి ఈ ఉపసంఘానికి అభ్యంతరం లేదు." ఏ విధంగా చూచినా, ఈ సిఫార్సు దేశవిచ్ఛిత్తికి దారితీయడమే కాగలదు. ప్రభుత్వ వ్యవహారాలు సక్రమంగా సాగడానికీ, ఏక జాతీయతాభావాన్ని పెంపొందించడానికి ఈ అఖిల భారతోద్యోగ వ్యవస్థ ప్రధాన ఉపకరణంగా ఉంటూంది. అఖిల భారతోద్యోగాలకు అభ్యర్థులు ఒకే బోధనభాషద్వారా శిక్షణపొంది ఉద్యోగాలకు

---

† కొంతకాలం వరకూ ఆంగ్లభాషను వాడుకలోవుంచడం అవసరమనీ, అయితే బోధనకు సంబంధించిన అన్ని కళాశాలకూ లేక కొన్ని కళాశాలకు హిందీని బోధనా భాషగా ప్రవేశపెట్టడానికి ఉచితమైన చర్యలు తీసుకోవాలని ఈ ఉపసంఘం అభిప్రాయం, బోధనాభాష ఏదైనా బోధింపబడే విషయాలు అందరికీ సమానంగానే వుంటవి.

నియమించబడినందువల్లనే యిది సాధ్యమైంది. బహు బోధనాభాషలలో శిక్షణపొందిన వారితో అఖిల భారతోద్యోగ వ్యవస్థ నడపవచ్చుననడం అసంభవం. హిందీ, ఇంగ్లీషు, రెండూ ప్రత్యామ్నాయభాషలుగా వుంటాయని ఈ ఉపసంఘం చెప్పుతున్నది. సైనిక శిక్షణ సంస్థలలో ప్రత్యామ్నాయ బోధన భాషలను గురించి నేను పైన వివరించిన విషయాలు దీనికి మరీ బాగా వర్తిస్తాయి. అఖిల భారతోద్యోగ వ్యవస్థ సిబ్బంది హిందీ వాలాలు, ఇంగ్లీషు వాలాలుగా విభజించబడతారు. భాషా విషయకంగా విద్వేషం, అసూయ, పగ తప్పనిసరి కాగలవు.

ఆచరణలో సాధ్యమైతే ప్రాంతీయభాషలను పరీక్షా భాషలుగా అంగీకరించవచ్చునని సూత్రప్రాయంగా అంగీకరించి, ఈ ఉపసంఘం ఘోరమైన తప్పు చేసింది. ఆచరణ సాధ్యం అన్న ప్రసక్తే ఈ సమస్యకు లేదు. హిందీని ప్రత్యామ్నాయభాషగా అంగీకరించేందుకు హిందీ భాషావాదులు బలవంతపెట్టినట్లే ప్రధాన ప్రాంతీయ భాషావాదులు ఆ భాషలన్నింటినీ అఖిల భారతోద్యోగాలకు పరీక్షా భాషలుగా చేయాలని పట్టుపడతారు. అప్పుడు అఖిల భారతోద్యోగుల నియామకం, బహు భాషల ప్రాతిపదికపై జరగాలి. "అఖిల భారత" అన్న పదాన్ని అప్పుడుకూడ వుంచుకున్నట్లయితే ఏక జాతి సిద్ధాంతం వారసత్వరీత్యా మనకు సంక్రమించనదనీ దానిని పరిక్షించుకునే శక్తిగాని దూరదృష్టిగాని మనకు లేకపోయినదని ఇది వ్యక్తం చేస్తుంది.

భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్విభజనవల్ల పెచ్చుపెరిగిన విచ్ఛిన్నకరభావాలను ఉపశమింపచేయడానికిగాను అఖిల భారతోద్యోగ వ్యవస్థలు మరికొన్ని వుండాలనీ, వివిధరాష్ట్రాల సిబ్బందిని పరస్పరం మార్చుకుంటూ ఉండాలనీ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం సిఫార్సు చేసిన సంగతి మనకు జ్ఞాపకం వుంది. అఖిల భారతోద్యోగులను ఒకసారి గనుక వివిధభాషల ప్రాతిపదికపై నియమించినట్లయితే యిక ఉద్యోగులను పరస్పరం మార్పుచేసుకునే ప్రసక్తే వుండదు. ప్రతి ఉద్యోగి తన స్వంతరాష్ట్రానికి తిరిగి వెళ్లవలసి వుంటుంది.

మరొక అనివార్యమైన విషయం అభ్యర్థులకు మార్కులువేయడంలో సంభవించే పోటీ. కొన్ని విశ్వ విద్యాలయాలలో సంస్కృతభాషను తీసుకొన్న అభ్యర్థులకూ, పర్షియన్‌భాష తీసుకున్న అభ్యర్థులకూ మార్కులు వేయడంలో పోటీ పడుతున్న సంగతి మనమెరిగే వున్నాము. బోధనాభాషగా హిందీని ప్రవేశపెట్టినతోడనే, హిందీ అభ్యర్థులు రాజకీయంగా తమకుగల ప్రాబల్యంతో వీలయినన్ని ఎక్కువ మార్కులు వేయించుకోడం ప్రారంభిస్తారు. మార్కులువేసే పద్ధతిని ప్రమాణీకరించడానికి ప్రయత్నం చేద్దామా, అది కేవలం ఫార్సుక్రింద తయారవుతుంది. భాషకు సంబంధించిన విషయాలలోకూడ ఆశ్రిత పక్షపాతం పరిపాటి అయిపోతుంది. హిందీ, ఇంగ్లీషు, భాషల మధ్యనైనా ప్రమాణీకరణపద్ధతి అమలుజరపడం సాధ్యంకాజాలదు. ఈనాడు విశ్వవిద్యాలయాలనుంచి హిందీ డిగ్రీలు పుచ్చుకుని బయటకు వస్తున్నవారు సామాన్యంగా పనికిమాలిన శుంఠలని నిజాయితీపరులైన విద్యావేత్తలే అంగీకరిస్తున్నారు. ఇంగ్లీషు బోధనాభాషగా విద్యాభ్యాసం చేస్తున్న తోటివిద్యార్థుల విద్యాప్రమాణాలస్థాయికి చేరుగానైనా రావడానికి, అందుకు తోడ్పడే అసంఖ్యాకమైన గ్రంథాలుగాని, విషయపరిజ్ఞానంగాని హిందీ విద్యార్థులకులేవు. మొదట్లో బోధనా భాషగా హిందీని ప్రవేశపెట్టడంతోటే, జరిగేదేమిటంటే, ఇంగ్లీషు బోధనభాషగా విద్యార్హతలను పొందినవారు ఉన్నతోద్యోగాలలో చేరడానికి ప్రస్తుతం నిర్ణయించబడిన ప్రమాణాలను యించుమించుగా అందుకోగలుగుతారు. హిందీలో చదువుకొని ఉద్యోగాలకువచ్చే అభ్యర్థులు విద్యావిషయకంగా నేమి, మేధాశక్తి విషయంలో నేమి, ఆంగ్లంలో మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణులైనవారికి తీసి కట్టుగా తయారవుతారు. మిడిమిడి జ్ఞానంగల ఈ హిందీ ఉద్యోగులవల్ల ఉన్నతోద్యోగులలో యింతవరకూగల ఉన్నతప్రమాణాలు, శక్తిసామర్థ్యాలు నామరూపాలు లేకుండాపోతాయి. బహు బోధనభాషల ప్రాతిపదికపై అఖిల భారతోద్యోగులను తీసుకోడం ప్రారంభంకాగానే, ఆ ఉద్యోగాల అఖిల భారతస్థాయి అంతరించిపోతుంది. ప్రమాణాలు పడిపోతాయి.

ద్విభాషా సిద్ధాంతం విషయంలో యింతకుమించిన అభ్యంతరం మేమిటంటే, హిందీ అభ్యర్థి అనివార్యంగా న్యాయసమ్మతంగాని అధిక ప్రయోజనాలను పొందుతాడు. అట్టి అభ్యర్థి తన మాతృభాషలో పోటీపరీక్ష వ్రాస్తాడు. ఇతరులు పరభాషలో పోటీపరీక్ష వ్రాస్తారు. ఇట్టి విపరీతమైన ప్రయోజనాలూ, దానితోపాటు హిందీ రాష్ట్రాలకు కేంద్రంలోగల రాజకీయ ప్రాముఖ్యం ఫలితంగా అఖిల భారతోద్యోగార్థులు హిందీ ప్రాంతాలవారి ఆధీనంలో ఉండకతప్పదు.

సమానావకాశాలకల్పన సిద్ధాంతం ఛాయా మాత్రంగానైనా కన్పించదు. హిందీ మాతృభాషకాని రాష్ట్రాలలోని పట్టభద్రులు, పోస్టు గ్రాడ్యుయేట్ల నిరుద్యోగసమస్య మరింత తీవ్రమై పోతుంది. జాతీయాకరణ విస్తరిస్తున్నందున ఉద్యోగ అవకాశాలన్నీ ఆచరణరీత్యా కేంద్రప్రభుత్వంయొక్క అదుపులో ఉంటాయి. బోధనభాషగా హిందీని సత్వరం ప్రవేశపెట్టడంతో కేంద్రోద్యోగ వ్యవస్థలు కొత్తగా యేర్పడిన ఈ అదృష్టవంతుల వర్గంవారికి మాత్రమే ఉద్యోగాల వేటకు క్రీడారంగంగా తయారవుతాయి.

## సుప్రీం కోర్టులోను, హైకోర్టులలోను హిందీ భాష

సుప్రీం కోర్టుకూ, హైకోర్టులకూ ఒకే భాష వుండాలని ఈ ఉపసంఘం చేసిన సిఫార్సు మన న్యాయ వ్యవస్థయొక్క, న్యాయశాఖయొక్క సమగ్రతనూ పరిపూర్ణతను పరిష్కరించడానికి చేయబడిన ఏకైక సూచన. ఈ విధంగా సిఫార్సు చేయడానికిగల కారణాలనుకూడా ఈ ఉపసంఘం పేర్కొన్నది. ఒక హైకోర్టుకు చెందిన అడ్వకేట్లు మరొక హైకోర్టులోనూ, సుప్రీం కోర్టులోనూ వాదించడానికి హాజరవుతారు. ఆ కారణంగా ఒక విధమైన అఖిల భారత న్యాయవాదుల వ్యవస్థ రూపొందింది. ఒక్కొక్క ప్రాంతంలోని హైకోర్టు ఒక్కొక్క భాషలో వ్యవహరిస్తూంటే యీ పద్ధతి కొనసాగడం అసంభవమని ఈ ఉపసంఘం అంగీకరించింది. చాలా హైకోర్టులు సుప్రీం కోర్టు ఉపయోగించే భాషకు భిన్నమైన భాషను ఉపయోగించే పక్షంలో సుప్రీం కోర్టు జడ్జీలను నియమించడం కష్టమైపోతుందనీ ప్రముఖ న్యాయవాదులనుంచి సుప్రీం కోర్టు జడ్జీలను ఎంచుకుంటారు కాబట్టి యిబ్బందులు తప్పవనీ ఈ ఉపసంఘం పేర్కొన్నది. హైకోర్టులలోనూ, సుప్రీం కోర్టులలోనూ హిందీ ప్రవేశపెట్టడానికి అంగీకరించేవరకూ ఆ రెండింటిలోనూ ఇంగ్లీషు భాషనే వాడుకచేయాలని ఈ ఉపసంఘం సూచించింది. ఈ ఉపసంఘంయొక్క కడపటి సిఫార్సు దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ హిందీని జాతీయ భాష చేయాలన్న సంకల్పంవల్ల ఉత్పన్నమైన పరస్పర విరుద్ధమైన భావనా విధానాలకు అద్వితీయమైన నిదర్శనం.

అధికార భాషా విచారణ సంఘం చూపిన మార్గాన్ననుసరించి, ఇంగ్లీషుకు ఉద్వాసన చెప్పడానికి ఈ ఉప సంఘం పేర్కొన్న రెండు ముఖ్య వాదాలు యివి: 1. ఇంగ్లీషు విదేశ భాష. 2. అనేక రాష్ట్రాలు తమ అధికార భాషగానూ, విశ్వవిద్యాలయాల భాషగానూ ప్రాంతీయ భాషలను ప్రవేశపెట్టినందువ, ఆ రాష్ట్రాలవారు ఇంగ్లీషు భాష ద్వారా తమ కార్యకలాపాలను సమర్థంగా నిర్వహించుకోడం ఆచరణలో సాధ్యంకాదు. హైకోర్టులలోనూ† సుప్రీం కోర్టులోనూ హిందీని అంతిమంగా ప్రవేశపెట్టాలని ఉద్దేశిస్తూ ఇంగ్లీషుకు బదులు భాషను ప్రవేశపెట్టడానికిపైన తాము పేర్కొన్న కారణాలను విస్మరించింది. హిందీ మాతృభాషకాని ప్రజలకు ఇంగ్లీషుకంటే హిందీయే ఎక్కువ పరాయి భాష, రెండువందల సంవత్సరాలపాటు ఇంగ్లీషు భాషకు అలవాటుపడినందువ దేశంలోని విద్యావంతులందరికీ అది సుపరిచితమైన వ్యవహార భాషగా పరిణమించింది. విశ్వవిద్యాలయాలు పాఠ్య విషయాలను ప్రాంతీయ భాషలో బోధించేటప్పుడు, ఆ రాష్ట్రాల ప్రజలు ఇంగ్లీషులో సముచిత ప్రమాణాలను సాధించలేదన్న వాదం హిందీ భాషకు మరింత ఎక్కువగా వర్తిస్తుంది.

అయినప్పటికీ హిందీ మాట్లాడని ప్రజలు తమ విద్యావ్యవస్థకు ఇంగ్లీషుకంటె ఎక్కువ పరాయి భాష అయిన హిందీ భాషను నేర్చుకొని, ఆ పరాయి భాషద్వారా న్యాయధిపతులుగానూ, న్యాయవాదులుగాను అర్హతలను పొందాలని ఈ ఉపసంఘం ఆశిస్తున్నది. మన న్యాయశాస్త్రం ఆంగ్లో-శాక్సను న్యాయశాస్త్రంమీద ఆధారపడి వున్నప్పటికీ, ఇంగ్లీషు విద్యాభ్యాసంచేసిన మన న్యాయవాదులకు ప్రపంచ న్యాయశాస్త్రంలో ప్రవేశం వున్నప్పటికి, వాటన్నింటినీ వదలిపెట్టి, న్యాయవిద్య, న్యాయ శాస్త్రం, కనీసం న్యాయ నిర్వహణకు అవసరమైన పారిభాషిక పదజాలం కూడా లేని పరాయి భాషద్వారా తగిన అర్హతలు సంపాదించుకోవాలనికూడ హిందీ మాతృభాషకాని ప్రజలకు సూచిస్తున్నారు. తద్వారా భారత దేశంలోని న్యాయవాదులయొక్క, న్యాయాధిపతులయొక్క ప్రపంచ విస్తృత విజ్ఞానాన్ని మధ్య భారత్

† అన్ని ప్రాంతాలలోని హైకోర్టులు యిచ్చే తీర్పులు, డిక్రీలు, ఉత్తర్వులు హిందీలోనే ఉండాలని అధికారభాషా విచారణ సంఘం సలహా యిచ్చింది. కాని యీ ఉపసంఘం తమ హైకోర్టులలో తీర్పులు, ఉత్తర్వులు, డిక్రీలతోసహా అన్ని కార్యకలాపాలకు తమ తమ అధికార భాషలను ఉపయోగించుకొనే స్వేచ్ఛ రాష్ట్రాల కివ్వాలని సిఫార్సుచేసింది.

మాజీ హైకోర్టు తీర్పులకు పరిమితం చేయమంటున్నారు. ఐకమత్యమూ ఆత్మ గౌరవాల పేరిట, ప్రపంచ ప్రఖ్యాతి చెందిన మన న్యాయశాఖ, న్యాయవాదులు న్యాయ వ్యవస్థలపై ఈ వినాశకర చర్యను అమలు జరపాలని దేశాన్ని కోరు తున్నారు. ఎప్పటికైనా యీ ఘోర ప్రమాదం సంభవిస్తే మాజీ సంస్థానాలలో మాదిరిగా ఇటు న్యాయాధిపతులూ, అటు న్యాయవాదులూ సంశయాస్పద ప్రమాణాలను తెచ్చి పెడతారనడంలో ఎట్టి సందేహంలేదు.

## హిందీ భాషా వ్యాప్తికి, వికాసానికి కేంద్రప్రభుత్వ కృషి

రాజ్యాంగంలోని 351వ ఆర్టికిల్‌లోని ఆదేశానుసారం హిందీని అధికార భాషగా ప్రవేశపెట్టడానికి సౌకర్యాలు కల్పించే బాధ్యతను యిప్పుడు ప్రభుత్వమే స్వయంగా స్వీకరించాలని ఈ ఉపసంఘం సిఫార్సు చేసింది. ఇందు నిమిత్తం స్వచ్ఛంద సంస్థలకు కేంద్రప్రభుత్వం ధన సహాయం, తదితర సహాయాలు చేస్తుంది. సమర్థమైన సంస్థలు లేని సందర్భంలో కేంద్ర ప్రభుత్వమే అవసరమైన సంస్థలను నెలకొల్పుతుంది. ఇతర ప్రముఖ భారతీయ భాషల వారిని సంతృప్తి పరచడానికిగాను వివిధ భాషల సాహిత్యాధ్యయనానికి యిదేవిధమైన ప్రోత్సాహం ఇవ్వాలని ఈ సంఘం సూచించింది. ఇతర భారతీయ భాషల విషయంలో తెచ్చిపెట్టుకొన్న ఈ ఆదరణ భావం ఆచరణలోకి రాకుండా కేవలం భావనా పరిస్థితిలోనే నిలిచిపోవలసి వస్తుంది. ఈ సంఘం చేసిన సిఫార్సు ప్రకారం ఇప్పటికి తగిన పారిభాషిక పదజాలం, శైలి లేనటువంటి హిందీభాషకు పుష్టిని చేకూర్చడానికే, నిఘంటువులను, పదకోశాలనూ తయారు చేయడానికీ, సాంకేతిక, న్యాయ పారిభాషిక పదకోశాలను రచించడానికీ, ఒక రాష్ట్రంలోనయినా పరిపాలనా నిర్వహణకు ఉపయోగపడే శక్తి లేనటువంటి హిందీ భాషలో ఈ దేశం యావత్తు పరిపాలననూ హిందీలో నిర్వహించే మహత్తర బాధ్యతను నిర్వ హించడానికీ, వచ్చే కొలది సంవత్సరాలలో కొన్నివందల కోట్ల రూపాయలను ఖర్చుపెట్టడానికి కేంద్ర ప్రభుత్వానికి ఈ ఉపసంఘం అధికారం యిస్తున్నది. ఆకలి బాధతో అలమటిస్తున్న, నిరక్షరాస్యులైన మన లక్షలాది ప్రజలకు తిండి, బట్ట, విద్యా సదుపాయాలు సమకూర్చడానికి అత్యవసరమైన ఈ ధనాన్ని ఒక వర్గం రాజకీయవాదుల గొంతెమ్మ కోర్కెలను తీర్చడానికి ఈ విధంగా దుబారాగా ఖర్చుచేయవలసి వున్నది. పన్నులు చెల్లించే వారిలో నూటికి 90 మంది యిచ్చిన ధనాన్ని, ముఖ్యంగా హిందీ మాతృభాషకాని ప్రాంతాల ప్రజల ధనాన్ని ఒక అల్ప సంఖ్యాక వర్గానికి చెందినటువంటి దేశంలో అతి కొద్ది ప్రాంతానికి పరిమితమై వున్నటువంటి భాషను అభివృద్ధి చేయడానికి ఎందుకు ఖర్చు పెట్టాలని అధిక సంఖ్యాక ప్రజలు ప్రశ్నించడంలో ఎట్టి తప్పూలేదు. ఈ ఉపసంఘం భారత దేశంలోని వివిధ భాషల మధ్య తీవ్రమైన విచక్షణ చూపే దేశ వ్యాప్తమైన జాతీయప్రయోగం చేయడానికి అనుమతించడమేగాక ప్రాధాన్య క్రమాన్నికూడా ఘోరంగా తారుమారు చేసింది. హిందీ మాతృభాషగాగల రాష్ట్రాలు దేశంలోని యితర ప్రాంతాలకుకూడా హిందీని రుద్దబెట్టాలని తీవ్రమైన కోర్కెలతోవుంటే మొట్టమొదట తమ రాష్ట్రాలలోనే హిందీభాషా ప్రయోజనాలను సార్థకంచేసి, ఆ తర్వాత ఆ భాషను వ్యాప్తిలోకి తేవడానికీ, దేశంలోని యితర ప్రాంతాలవారిచే దానిని ఆమోదింప చేయ డానికీకాగల ధనసంబంధమైన బాధ్యతలను స్వీకరించాలి.

## గత 8 సంవత్సరాల విషాదానుభవం దృష్ట్యా భాషా పరిస్థితి సమీక్ష

ఈ ఉపసంఘ సమాలోచనల ప్రారంభంలోనే నా పరిస్థితిని నేను వివరించాను. హిందీభాషపట్ల నాకు వ్యక్తిగత ద్వేషం ఏమీలేదని తెలియచేశాను. హిందీ మాతృభాషగాగల మధ్యప్రదేశం నా స్వరాష్ట్రం. పాఠశాలా విద్యార్థి దశలోనే హిందీని రెండవ భాషగా అభ్యసించాను. దేవనాగరి లిపిలో హిందీని నేను చదువగలను. వ్రాయ గలను. అంతకుమించి హిందీ భాషలో చక్కగా మాట్లాడగలను. హిందీ భాష సహాయంతోనే న్యాయవాద వృత్తిద్వారా ధనార్జన చేశాను. ఆంగ్లో—ఇండియనుల విద్యా వ్యవహారాల అంతరాష్ట్రీయ బోర్డు అధ్యక్షుడుగా దాదాపు 20 సంవత్స రాలపాటు, దేశం మొత్తంమీద అన్ని ఆంగ్లో-ఇండియన్ పాఠశాలలలోను హిందీని నిర్బంధంగా ప్రవేశపెట్టడానికి హెచ్చు బాధ్యత నాదే. ఆంగ్లో- ఇండియన్ పాఠశాలలలోని హిందీ పాఠ్య గ్రంథాలు దేశమంతటిలో అత్యుత్తమమైనవని నా విశ్వాసం. కాని గత ఎనిమిది సంవత్సరాలలోనూ నేను గడించిన అనుభవం దృష్ట్యా నేను, హిందీ భాషావాదులలో అసహనమూ, దురాశ హెచ్చుపెరగడంవల్ల నేను, మత ప్రసక్తిలేని ప్రజా స్వామ్యాన్ని ఈ నవహిందీ మత ప్రసక్తిలేని ప్రజాస్వామ్యాన్ని నమ్ముకు చేయగలదని, తద్వారా దేశం ఛిన్నభిన్నమై మైనారిటీ భాషలు సర్వనాశనం కాగలవని నా దృఢ

విశ్వాసం. రాజ్యాంగ పరిషత్తులోని అనేకమంది సభ్యులు, నా వలెనే, ఎక్కువగా భయపడుతూనే, రాజ్యాంగంలో హిందీకి స్థానం కల్పించడానికి అంగీకరించారు. ఇది గాంధీజీ సూచించిన విస్పష్ట విధానాన్ని త్రోసిపుచ్చడమౌతుంది. గాంధీజీ నిర్దుష్టమైన వివేచనాశక్తి గలిగిన వ్యక్తి అవడంవల్ల ఏ భారతీయ భాష అయినా అధికార భాష కావాలంటే అది యించుమించుగా తటస్థ భాష అయివుండాలని ఆనాడే గుర్తించారు. ఈ కారణంవల్లనే గాంధీజీ బుద్ధి పూర్వకంగానే హిందీనికాదని హిందూస్థానీ అధికార భాష కావాలని ప్రతిపాదించారు. "హిందీ" అన్న పదాన్ని వాడుకచేసినంత మాత్రానే అభివృద్ధి నిరోధకశక్తులు ఆ అవకాశాన్ని చేజిక్కించుకొని దానిని మత దురభిమానుల భాషగా తయారుచేస్తారని అగ్రశ్రేణి నాయకులకు నా భయ సందేహాలను వెల్లడించాను. కడచిన ఎనిమిది సంవత్సరాల అనుభవం నా భయ సందేహాలు నిరాధారాలు కావని రుజువుచేసింది.

ఈ నాడు, ఉత్తర భారత దేశంలో 'హిందీ' మత చిహ్నమని బాహాటంగా తెలిసిన విషయమే. "హిందీ, హిందూ, హిందుస్థాన్" అన్నది హిందీ రక్షాసమితి ఉద్యమ నినాదం. ఈ నినాదం ఉత్తర, మధ్య భారత దేశంలోని హిందీ వాదుల మనస్తత్వాన్ని వ్యక్తం చేస్తుంది. ప్రముఖ హిందీ వాదులతో కొంతసేపు మాట్లాడితే, హిందీ సామ్రాజ్య వాదం, భాషోన్మాదంవారి కళ్లల్లో కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి. హిందీ భాషను ఆరాధించని వారందరూ హిందీ వాదుల దృష్టిలో దేశభక్తులు కాకపోగా జాతీయతలేని భారతీయులు. వారి ఉద్దేశంలో హిందీ భాష దేశభక్తికి మారుపేరు. అది వారి దృష్టిలో భారత జాతీయతకు చిహ్నం.

ఈ భాషాసమస్య యావత్తు రాజకీయ వేత్తలచేత, పునరుద్ధరణ వాదులచేత భ్రష్టం చేయబడింది. ఆంగ్లేయుల మీది ఆగ్రహాన్ని హిందీవాదులు ఇంగ్లీషు భాషపైకి మళ్లించారు. పాకిస్థాన్‌పట్ల మనకు సహజంగా కలిగిన ఆగ్రహావేశాలను ఉర్దూ భాష పైకి తిప్పడంలో వీరు కృతకృత్యులయ్యారు. ఇది భాషకు, భాషా పరిణామానికి సంబంధించిన సమస్య కాదు. ఈ నాడు హిందీ మతానికేకాక రాజకీయ ప్రాబల్యానికికూడ చిహ్నం. హిందీ మాట్లాడే ప్రజలు తాము కలలుకంటున్న హిందీ సామ్రాజ్యానికి యజమానులన్నట్లుగా హిందీభాషావాదులు మాట్లాడడం, వ్యవహరించడం యిప్పుడే మొదలు పెట్టారు. ఈ నవహిందీ సామ్రాజ్యవాదం యొక్క ప్రధాన లక్షణాలైన అసహనం, దురాక్రమణ వైఖరి, అతిశయాలను స్థూలంగా వెల్లడించడానికి ప్రయత్నించాను.

హిందీ వాదులు హిందీ భాషపట్ల ప్రేమకంటె, యితర పోటీభాషలపై గలద్వేషంతోనే యీ విధంగా వ్యవహరిస్తున్నారు. ఇంగ్లీషుపై ద్వేషం మొట్ట మొదటిది. ఆ విద్వేషాన్ని అరికట్టే అదృష్టం 1954 లో నాకు లభించింది. ఇంగ్లీషును నాశనం చేయాలన్న లక్ష్యంగల హిందీ సామ్రాజ్యవాదం, బొంబాయి ప్రభుత్వం ఆంగ్లో—ఇండియన్ పాఠశాలలకు జారీచేసిన ఉత్తర్వునుంచి ప్రారంభమయింది. ఆంగ్లో—ఇండియన్ పాఠశాలలలో ఇతర కులాలవారికి ఆంగ్లం బోధించకుండా చేయడానికి బొంబాయి ప్రభుత్వం తల పెట్టింది. ఆంగ్లభాషా బోధనకు నాడి కేంద్రాలైన ఈ పాఠశాలలను రూపుమాపడమే ఆ ఉత్తరువు లక్ష్యం. హిందీ మాతృభాషకాని ప్రాంతాల ప్రజలు రెండు పరాయి భాషలలో అనగా హిందీ, ఇంగ్లీషు భాషలలో ఏదో ఒక దానిని కోరుకోవలసి వస్తే, సహజమైన విలువ కలిగినట్టి, ప్రపంచ విజ్ఞాన సాహిత్యాలకు పట్టుకొమ్మ అయినటువంటి ఇంగ్లీషు భాషనే కోరుకుంటున్నారనీ, అందువల్ల ఇంగ్లీషుభాషను మొట్టమొదట నాశనం చేయాలన్న సంకల్పం బొంబాయిలోని భాషోన్మాదులకుకూడా కలిగింది. ఇప్పుడు వీరహిందీవాదులుకూడా ఇదే భావంలో ఉన్నారు.

భాషా పక్షపాతంలేని ప్రధాన మంత్రిసైతం ఈ విషయంలో నాకు సహాయం చేయలేక పోయారు. అదృష్టవశాత్తు, స్వతంత్రాధికారాలుగల న్యాయస్థానాలే నాకు శరణ్యమైనాయి. హిందీ దురభిమానంతో ఆంగ్లో—ఇండియన్ పాఠశాలలపై చేసిన దాడిని కోర్టుల ద్వారా నిరోధించ కలిగాను.

హిందీ సామ్రాజ్య వాదం, హిందీ మాట్లాడే రాష్ట్రాలలోని అల్పసంఖ్యాక భాషావర్గాల వారు ఆత్మ గౌరవంతో జీవించడానికి వీల్లేకుండా దుర్భరపరిస్థితులను కల్పిస్తున్నది. ఉర్దూ భాషపై యీ విధమైన విద్వేష

ప్రదర్శనకు, అధికార హిందీ పదజాలంలో ఉత్తరోత్తరా ఒక ఉర్దూ పదంకూడ ఉండరాదని † ఢిల్లీ కార్పొరేషను భాషా సంఘం యిటీవల చేసిన నిర్ణయమే నిదర్శనం. హిందీ భాష యితర భాషలలో ఉర్దూ హిందూస్తానీలనుంచి పదాలను తీసుకోవాలనీ, అప్పుడే ఆ భాష వైవిధ్యంతోకూడిన భారతీయ సంస్కృతిని వ్యక్తం చేయడానికి ఉత్తమ సాధనం కాగలదని రాజ్యాంగంలోని 351-వ ఆర్టికిల్‌లోని ఆదేశసూత్రం పేర్కొన్నప్పటికీ, హిందీ భాషలో బహు కాలంగా చలామణిలోవున్న ఉర్దూ, పర్షియన్ పదాలను ఏరివేసే కార్యక్రమంలో కేంద్రప్రభుత్వంకూడ చేరిందని చెప్పడానికి విచారిస్తున్నాను.

నేను పేరుపెట్టిన ఈ నవహిందీ ఒక భాషగాగాక ఎగతాళీగా తయారవుతోంది. భాషా సంస్కర్తలమని చెప్పుకొనేవారు, కొత్త మాటలను, పదజాలాన్నీ సృష్టించడానికి స్వయంగా పూనుకొన్న నిఘంటుకారులూ, చేస్తున్న తీవ్ర కృషి ఫలితంగా హిందీ మాతృభాషగాగల రాష్ట్రాలలోసైతం "హిందీ" అంటే హేళన ఎక్కువైంది. దురదృష్టవశాత్తు, కేంద్ర ప్రభుత్వంకూడ ఈ హాస్యాస్పద భాషా తంత్రానికి దోహదంచేస్తున్నది. రైల్వేసైను బోర్డులూ, ప్రభుత్వ కార్యాలయాల పేర్లూ, లోక్ సభలోని నోటీసులూ, జీవంలేని పదజాలంనుంచి ఏరి తెచ్చిన అనేకాక్షర శబ్దాలతోనూ లేక నవ హిందీ పదజాలం సృష్టికర్తలు చిత్రవధ చేసిన పదాలతోనూ నిండివుంటున్నాయి. ఈ నవ హిందీ లోగడ హిందీ చదువుకొన్నవారినిసైతం నిరక్షరాస్యులుగా మార్చి వేస్తున్నది. ప్రఖ్యాత విద్వాంసుడైన ఆదివాసుల నాయకుడు శ్రీ జైపాల్‌సింగ్ (పార్లమెంటు సభ్యుడు) ఆదిమవాసుల తరఫున మాట్లాడుతూ, ముండారి భాష (సంతాలీ, హో, ఖారియాల మాతృభాష) మాట్లాడేవారి సంఖ్య కాశ్మీరీ, అస్సామీస్, ఒరియా భాషలు మాట్లాడే ప్రజల సంఖ్యకంటె ఎక్కువైనా, రాజ్యాంగంలో ఆదిమవాసులకు చెందిన ఒక్క భాషకూడ పేర్కొనబడలేదని అన్నారు. ఆదిమ వాసుల భాషలను హతమార్చడానికి రాష్ట్ర ప్రభుత్వాలు చెయ్యరాని పనులు చేస్తున్నాయి. సంతాలీలు, ఒక శతాబ్దంపాటు రోమన్ అక్షరాలను వుపయోగించేవారు. వీటిలో అనేక గ్రంథాలుకూడ వున్నాయి. స్వాతంత్రంవచ్చిన తర్వాత ధ్వనులను ఉత్పత్తి చేయడానికి శక్తిలేనటువంటి దేవనాగరి లిపిని వుపయోగించాలని బీహారు ప్రభుత్వం పట్టుపట్టింది. బీహారు ప్రభుత్వం హిందీ మాతృ భాషగాగల రాష్ట్ర ప్రభుత్వమన్న మాట మర్చిపోకూడదు.

షెడ్యూల్డు కులాలవారికి హిందీవల్ల కులబానిసత్వం, అధః పతనం చిరస్థాయి కాగలదని ఒక ప్రముఖ అఖిల భారత షెడ్యూల్డు కులాల నాయకుడు నాతో చెప్పాడు. ఆయన దృష్టిలో హిందీ కులతత్వానికి చిహ్నం. షెడ్యూల్డు కులాలవారు హిందీ భాష మాత్రమే మాట్లాడునంత కాలం కుల విచక్షణకు సంబంధించిన అన్ని అమర్యాదలకూ, అవమానాలకూ వారు గురికాక తప్పదు. ఇంగ్లీషు భాష తమను యుగాలనాటి సంకెళ్లనుంచి తప్పించడానికి తోడ్పడే సాధనాలలో ఒకటని అయనే అన్నారు. ఇంగ్లీషు మాట్లాడే షెడ్యూల్డు కులాలవారు హిందీ శాశ్వతంగా నిరాకరించే సమత్వాన్ని స్వేచ్ఛనూ వెంటనే పొంద గలుగుతారు. హిందీ పరిరక్షకులమని చెప్పుకునేవారు పంజాబులో చేస్తున్న పనులు చాల ఆందోళన కలిగిస్తున్నాయి. అనేక రాష్ట్రాలలో వాడుకలోవుంటూ, జాతీయ భాషగా ప్రవేశపెట్టబోతూన్న హిందీకి రక్షణ అవసరమైందా? నేను లోగడ చెప్పినట్లు పంజాబులో ఎవరో కొంతమంది మతగురువులూ, పండితులూ, మరికొంత మందీ తప్ప హిందువులందరూ ఉర్దూ, పంజాబీలే మాట్లాడతారు. ఈ నవ హిందీ సామ్రాజ్య వాదం వత్తిడి ఫలితంగా హిందీ గాని, దేవనాగరి లిపిగాని యింతకు ముందెన్నడెరుగని అధిక సంఖ్యాక ప్రజలను వ్యతిరేక ఉద్యమంలో పాల్గొనమని బలవంతంపెడుతున్నారు. తమిళులు, తెలుగువారూ, బెంగాలీలు, తదితరులూ హిందీని నేర్చుకు తీరాలని పట్టుబట్టే వీరహిందీ వాదులు, తీరా తామే ఒక ప్రాంతీయ భాషను నేర్చుకోవలసి వచ్చేసరికి మళ్లీ తమ సిద్ధాంతాన్నే కాదంటున్నారు. హిందీ మాట్లాడే ప్రజలు పంజాబీని నేర్చుకోడమంటే దుస్సహ్య మంతటి బాధాకరమైన విషయమనీ ఈ హిందీ రక్షకులంటారు. హిందీ మాతృభాషకాని ప్రాంతాలపై హిందీని రుద్దడానికి వారు చెప్పే వాదాలను యీ సందర్భంలో వారు విస్మరిస్తున్నారు.

ఆయా ప్రాంతాలలో పాదుకొని పోయిన ప్రాంతీయ భాషలను ఎదుర్కొనే శక్తి హిందీకి ప్రస్తుతానికి లేదు. ఆంగ్లో-ఇండియన్లు, ముస్లిములు, సిక్కులు, ఆదిమవాసులు తదితరుల భాషలపై ప్రస్తుతం ప్రదర్శించబడుతున్న అసహనం, ఆధిక్యభావాలు, హిందీ జాతీయ భాష అయిన తర్వాత హిందీ మాతృభాషకాని అన్ని భాషా వర్గాలవారిపైనా యిదేవిధంగా ప్రదర్శించబడతాయని నా విశ్వాసం.

---

† ఢిల్లీ కార్పొరేషను భాషాసంఘం అట్టి నిర్ణయమేదీ చేయలేదు.

అభివృద్ధి నిరోధక పద్ధతుల వల్లా, హిందీ మాతృ భాషకాని అనేక లక్షల మంది ప్రజలు పడుతున్న యిక్కట్ల వల్లా, ఈ సమస్యను తిరిగి పూర్తిగా సమీక్షించాలని మన ప్రజలలో అధిక సంఖ్యాకులు కోరుతున్నారు. ఈ కారణంగానే భాషా సమస్యయొక్క సంగ్రహ సమీక్షనూ, అట్టి సమీక్షయొక్క అవసరాన్ని, దాని ఆవశ్యకతకుగల కారణాలనూ యీ క్రింద పొందు పరుస్తున్నాను :

## హిందీకి అనుకూలంగా వాదనలు

హిందీని రాష్ట్రీయభాష లేక జాతీయభాషగా దేశమంతటికి చుట్టబెట్టడానికి హిందీ వాదులు చేసే ముఖ్యమైన వాదనలను పరిశీలిద్దాము. ఈ సంఘం ఈ వాదనలలో పెక్కింటిని తమ నివేదికలో పేర్కొన్నది.

## రాజ్యాంగ నిబంధనలు పవిత్రమైనవి

అంతిమంగా హిందీ అధికార భాషకాగలదని రాజ్యాంగంలో నిర్దేశించబడినందున, ఆ నిబంధనను పవిత్రంగా భావించాలన్న ధోరణిని ఈ ఉపసంఘం వ్యక్తపరిచింది. అయినప్పటికీ, దేశంలో అనేక లక్షలమంది ప్రజలు రాజ్యాంగం తయారుచేయబడిన ఎనిమిది సంవత్సరాల తర్వాత రాజ్యాంగంలోని ప్రస్తుత నిబంధనలను విశేషంగా గుర్తిస్తూనే ఆచరణలో తమకు కలిగిన అనేక అనుభవాల దృష్ట్యా ఆ నిబంధనలను వ్యతిరేకిస్తున్నారు. దేశం నిస్సందేహంగా రాజ్యాంగానికి కట్టుబడివుండవల్సిందే. అయితే రాజ్యాంగాన్ని మార్పు చేయడమన్నది ప్రత్యక్ష సత్యం. రాజ్యాంగంలో భాషకు సంబంధించిన నిబంధనలు 17-వ భాగంలో ఉన్నాయి. పవిత్రమైన నిబంధనలంటూ ఏవైనావుంటే అవి రాజ్యాంగంలోని మూడవ భాగంలో వున్నాయి. అదే ప్రాథమిక స్వత్వాలు. అయితే ప్రభుత్వానికి కలిగిన అనుభవాల దృష్ట్యా ఏడు సంవత్సరాల కాలంలో ప్రభుత్వం ఏడు సార్లు ఈ ప్రాథమిక స్వత్వాలను సవరించింది. రాజ్యాంగంలో భాషకు సంబంధించిన నిబంధనలలో ప్రాథమికమైన విషయమేదీ లేనందున, అనుభవం దృష్ట్యానూ, ప్రజల అవసరాల దృష్ట్యానూ, దేశ శ్రేయస్సు దృష్ట్యానూ భాషకు సంబంధించిన నిబంధనలను పునస్సమీక్షచేయవలసిన సమయం వచ్చింది. రాజ్యాంగాన్ని రూపొందిస్తున్న సమయంలో ప్రజలలో జాతీయోత్సాహం తార స్థాయినందుకొన్నది. పరిపాలనా నిర్వహణలో ఎదురయ్యే ప్రత్యక్ష సమస్యలనుగాని, భాషా సంబంధమైన చిక్కులనుగాని అప్పుడు ఊహించడానికికూడ అవకాశం లేదు. ఈ భాషా సమస్యను నిష్పాక్షికంగానూ ఉద్రేకరహితంగానూ పరిశీలించ గలిగేవారు వచ్చేతరం భారతీయులే. హిందీని బలవంతాన రుద్దడానికి ప్రస్తుతం తీసుకుంటున్న సత్వర చర్యలను వ్యతిరేకించడానికి యిది మరొక బలీయమైన కారణం.

## విదేశభాష ఉండడానికి వీల్లేదు

కేంద్రప్రభుత్వ అధికారభాషగానూ, కేంద్రరాష్ట్రాల ప్రభుత్వాలమధ్య వ్యవహారాలకు వాడుకచేసే భాషగానూ, ఇంగ్లీషుకు బదులుగా ఒక భారతీయభాషను వాడుకచేయడం జాతీయభావాల కనుగుణంగా ఉంటుందని ఈ ఉపసంఘం వాదం. సాధారణంగా జాతీయభాషంటూ ఒకటి ఉన్నప్పుడు విదేశభాషలకు బదులు దానినే వాడుకచేయడం సహజం. కాని భారతదేశంలోని పరిస్థితులు అసాధారణమైనట్టివి. ఈ దేశానికి జాతీయభాష అనేది లేదు.

బహు భాషలుగల భారతదేశంలో ఇంగ్లీషు వాడకానికి 200 సంవత్సరాలనుంచీ అలవాటుపడి ఉన్నందున దేశంలో అదొక్కటే తటస్థ భాష అయింది. ఇంగ్లీషుభాష దేశంలోని అన్ని ప్రాంతాల విద్యావిధానాలలోకి సమానంగా వ్యాపించింది. దేశంలో అనేక భాషలున్న కారణంవల్లనే రాజ్యాంగ నిర్మాతలు జాతీయభాషను నిర్ణయించాలన్న ఉద్దేశాన్నే వదులుకున్నారు. వివిధరాష్ట్రాలమధ్య నడిచే కార్యకలాపాలకు సాధనంగానూ, కేంద్రప్రభుత్వ అధికారభాషగానూ పనికివచ్చే ఒక భాషను నిర్ణయించడమే మనం చేయవలసిన పని. యూరప్ వెలుపలి దేశాలలో ఇట్టి బహు భాషాసమస్య లేక, ఇంగ్లీషుకు అలవాటుపడివున్న దేశాలు ఇంగ్లీషునే అధికారభాషగా స్వీకరించాయి.

ఇంగ్లీషు పుట్టుకరీత్యా నిస్సందేహంగా విదేశ భాషయినా, వాస్తవంగానూ, న్యాయంగానూ అది భారతీయభాషే. ఆంగ్లో-ఇండియనులకు ఇంగ్లీషు ప్రేమతో అభ్యసించే మాతృభాష. భారతదేశంలోని అల్పసంఖ్యాక వర్గాలలో ఒకటిగా

ఆంగ్లో-ఇండియనునుంచు పరిగణించడం రాజకీయ పన్నాగం కాకపోతే, మా మాతృభాష అయిన ఇంగ్లీషును హిందీ, తదితర భారతీయభాషలతో సమానంగా పరిగణించాలి. బొంబాయి పాతశాలల కేసులో ప్రధాన న్యాయమూర్తి శ్రీ చాగ్లా యిచ్చిన తీర్పుతో పై పరిస్థితి మన న్యాయస్థానాలు అంగీకరించాయి. ఆ తీర్పులో శ్రీ చాగ్లా యిలా అన్నారు. "రాజ్యాంగం దృష్టిలో ఆంగ్లభాషకు, భారతదేశంలోని యితర అల్పసంఖ్యాక వర్గాల భాషలకు ఏ విధమైన తేడాలేదు. రాజ్యాంగం చెప్పిన అర్థాన్నిబట్టి ఇంగ్లీషు ఈ నాడు భారతీయభాషలతో తుల్యమైనది. రాజ్యాంగం దానిని యితర భాషలతో సమానంగా గుర్తించింది. ఇతర భారతీయభాషలతో సమానమైన రక్షణకు అదీ అర్హత కలిగివున్నది. ఈ అర్థాన్నే మేము పాటించాం."

ఇంగ్లీషు, అది మాతృభాష కానివారికి పరదేశభాష కావచ్చు. ఈ దృష్టితోచూస్తే హిందీ మాట్లాడని ప్రజలకు హిందీ ఇంగ్లీషుకంటె ఎక్కువ పరాయిభాష. నేను యింతకుముందు చెప్పినట్లు హిందీ మాతృభాష కాని వారేగాక, హిందీ మాట్లాడేవారు సైతం 200 సంవత్సరాలనుంచి ఇంగ్లీషుకు అలవాటుపడి ఉన్నారు. వీరు హిందీకి అంతగా అలవాటుపడలేదు. ఇంతేగాక హిందీ మాతృభాష కాని ప్రాంతాలలో మాట్లాడే హిందీ హిందీ కానేకాదు. నవ హిందీ అంతకంటె కాదు. అది హిందూస్థానీ పదాలతో నిండిన బజారుభాష. వ్యాకరణదోషాలుగల హిందూస్థానీలో స్వల్పజ్ఞానం సంపాదించడం వేరు. హిందీ మాతృభాష కాని వారిని హిందీలో ముఖ్యంగా, కొత్తగా సృష్టించిన పదజాలము, అతి క్లిష్టమైన వాక్యవిన్యాసంగల నవహిందీలో పాండిత్యం సంపాదించమనడం వేరు. ఈ నవ హిందీ, హిందీ మాతృభాష కాని వారికి పరాయిభాషకాక, పూర్వం హిందీ మాట్లాడే వారికికూడా (నాతో సహా) అది పూర్తిగా పరాయిభాష. ప్రముఖులైన బహు భాషా పండితులు ఉర్దు సైతం విదేశభాషేనని వాదిస్తున్నారు. పూర్వం భారత దేశాన్ని జయించి, పాలించినవారు దానిని సృష్టించడమే అందుకు కారణం. భారతీయుల భావనాశక్తి భాషా సంస్కృతులపై ఉర్దూ భాషా ప్రభావం విశేషంగా కన్పిస్తున్నది. పోతే, రెండు విదేశభాషలైన ఉర్దూ, ఇంగ్లీషుభాషల మధ్యగల సాంకేతికమైన తేడా ఏమిటంటే ఇంగ్లీషు వారికంటె దీర్ఘకాలం భారతదేశాన్ని పరిపాలించిన వారిభాష ఉర్దూ. భారతీయులు ఇంగ్లీషుకంటె ఎక్కువకాలం ఉర్దూభాషకు అలవాటుపడి ఉన్నారు. హిందీకూడ అనేక దేశీయపదాలతో కూడివున్నందున దానినికూడ ముస్లిం రాజులే తమ అనుచరులకోసం సృష్టించారని కొంతమంది భాషావేత్తలు చెపుతున్నారు. హిందీభాషకు చారిత్రక, సాంస్కృతిక, సాహిత్యక సంబంధమైన పూర్వచరిత్ర లేనందున దాని పదజాలం యీనాడుకూడ తీవ్రమైన మార్పులు చెందుతూ, ఒక హిందీరాష్ట్రంలోని హిందీ మరొక హిందీ రాష్ట్రంలోని హిందీకి భిన్నంగా వుంటున్నదన్న సత్యాన్ని ప్రముఖ భారతీయభాషావేత్తలు స్పష్టంగా వివరించారు. హిందీలో అనేక ప్రసిద్ధ గ్రంథాలను రచించిన భారతీయశాస్త్ర నిపుణుడు డాక్టర్ సునీతికుమార్ చటర్జీ, యిప్పుడు రూపొందించడానికి తలపెట్టబడిన భాష హిందీ కాదని, అది "ఖడీబోలీ" హిందీ అని అన్నారు. ఈ "ఖడీబోలీ" హిందీ నిలకడలేని భాషనీ, నిజానికి హిందీ వివిధ ప్రాంతీయాల కలయికగాక రాజస్థానీ, కోశాలి, లేక అవధి, భోజ్‌పూరి, మైథిలీవంటి భాషలయొక్క కలగా పులగంకూడా ఉంది అనీ ఆయన చెప్పారు. ఇప్పుడు మనం రూపొందించడానికి ప్రయత్నిస్తున్న "ఖడీబోలీ హిందీ" 1850 కి పూర్వం లేనేలేదనికూడ డాక్టర్ చటర్జీ పేర్కొన్నారు.

మరొక ప్రముఖ భారతీయుడు హిందీకి రాజకీయపాలక సంప్రదాయాలేమీ లేవన్నాడు. భారతదేశ చరిత్ర పొడవునా హిందీ ఏ రాష్ట్రంయొక్క భాషకాదు. ఎందువల్లనంటే భారతదేశ చరిత్రలో హిందీ రాష్ట్రం అనేది యింతకుముందెన్నడూ లేదు. ఈనాడు మనం కృత్రిమమైన, అసహజమైన హిందీ రాజ్యాన్ని నిర్మించడానికి ప్రయత్నిస్తున్నాము.

సంస్కృతాన్ని హిందీతో ముడిపెట్టడం తరచుగా జరుగుతూ ఉంటుంది. భారతదేశం యొక్క అమూల్యమైన ప్రాచీన సంస్కృతినీ, భారతదేశ మతసంప్రదాయాన్ని ప్రతిబింబింపచేసే ఉత్తమమైన భాష సంస్కృతం. హిందీ భాషలో సంస్కృతపదాలు ఎక్కువగా వుండాలని కోరడం పెద్దలపేరు చెప్పుకుని బ్రతకడానికి ప్రయత్నించడంవంటిది. అభిమానసంప్రేరిత మనం ఎన్ని విజ్ఞప్తులు చేసినా, వెయ్యి సంవత్సరాలుగా అమూల్యమైన సాహిత్య సంప్రదాయాలతో, సంపూర్ణ వికాసంచెందిన భాషలుగలిగిన తమిళులు, తెలుగువారూ, బెంగాలీలు, అస్సామీలు, ఒరియాలు, కన్నడులు, తమ భాషలతో పోలిస్తే కొత్తభాష అయిన, వికాసంచెందని భాష అయిన ఈ నవ హిందీని ప్రోత్సహిస్తారనుకోడం వెర్రి భ్రమ.

## అధిక సంఖ్యాకులకు హిందీ తెలుసా ?

భారతదేశ జనాభాలో అధికసంఖ్యాకులకు హిందీ మాతృభాష కావడమేగాక దేశంలో వేరు ప్రాంతీయభాషలుగల అనేక ప్రాంతాలలోని ప్రజలకు సైతం హిందీ తేలికగా అర్థం అవుతూండడంవల్లనే హిందీ అధికారభాషగా స్వీకరించబడాలని అధికార భాషా విచారణ సంఘం యిచ్చిన సలహాను ఈ ఉపసంఘం బలపర్చింది. అధికార భాషా విచారణ సంఘం అధికార భాషా ఉపసంఘం చేసిన యీ ముఖ్యమైన నిర్ణయం పూర్తిగా నిరాధారమైనదేగాక, అర్థ రహితమైనది. అధికారభాష అవడానికి హిందీకి అర్హత ఉన్నదని నచ్చచెప్పడానికి అధికార భాషా విచారణ సంఘం చేసిన ఘోరమైన తప్పులలో అదొకటి. ప్రజలలో నూటికి 42 మందికి హిందీ తెలుసునని అధికార భాషా విచారణ సంఘం తెలియచేసింది. ఆ విషయాన్ని పైపైన పరిశీలించినా, ఆ నూటికి 42 మందిలోను అధిక సంఖ్యాకులు ఉర్దూ, హిందుస్థానీ, పంజాబీ, హిందీతో సంబంధంలేని పందలాది భాషలూ మాట్లాడేవారన్న సత్యం వెల్లడికాక మానదు. ముస్లిములకు ఉత్తర ప్రదేశంలోని హిందువులలో అధిక సంఖ్యాకులకు ఉర్దూ మాత్రమే తెలుసు. పంజాబులో శిక్కులు, హిందువులలో అత్యధిక సంఖ్యాకులకూ ఉర్దూ, పంజాబీ భాషలు మాత్రం తెలుసు. మధ్యప్రదేశంలోని హిందువులలో అధిక సంఖ్యాకులకు హిందుస్థానీ మాత్రం తెలుసు. అది ఉత్తర ప్రదేశంలో మాట్లాడే స్వచ్ఛమైన ఉర్దూ కాదు. ఉర్దూ, పర్షియన్ మాటలుగల మిశ్రమ భాష.

1951 వ సంవత్సరంలో తయారుచేసిన భాషాసంబంధమైన లెక్కలను ఒకసారి పరిశీలిస్తే హిందీ భాష మాట్లాడే ప్రజల సంఖ్య పెంచడానికిగాను ఉర్దూ, పంజాబి, హిందూస్థానీవంటి ప్రముఖ భాషలను, హిందీక్రిందకు రాని పందలాది యితర భాషలవారిని ఆ లెక్కలలో ఎంత వివరీతంగా చేర్చినది వ్యక్తమౌతుంది. ఆ అంకెలను నిష్పక్షపాతంగా పరిశీలిస్తే, దేవనాగిరి లిపిలో హిందూస్థానీని చదివేవారినికూడా హిందీవారితో చేర్చినా హిందీ తెలిసినవారు భారత దేశ జనాభాలో నూటికి 10 మందికూడ వుండరన్న విషయం స్పష్టంకాగలదు. నవ హిందీని యీ దృష్టితో పరిశీలిస్తే, మధ్యప్రదేశానికిచెందిన వాళ్ళతోసహా హిందీ మాట్లాడే విద్యావంతులైన ప్రజలకు సైతం అర్థంకాని ఈ నవ హిందీ, దేశ జనాభాలో నూటికి $\frac{1}{2}$ వంతు మందికికూడ తెలియదని వ్యక్తమౌతుంది. రాజ్యాంగంయొక్క హిందీ అనువాదకులూ, ఆకాశవాణి ప్రసారకులు యీ నవహిందీనే ఉపయోగిస్తున్నారు. సిసలైన హిందీ మాట్లాడే హిందువులు వార్తలను వినదలచినప్పుడు ఆల్ ఇండియా రేడియోనుంచిగాక రేడియో పాకిస్థాన్‌నుంచి వింటామని అంగీకరిస్తారు. భారతదేశ ప్రజలలో నూటికి రెండువంతుల మంది మాత్రమే ఇంగ్లీషు తెలిసిన వారున్నారని అధికార భాషా విచారణ సంఘం దేనినిబట్టి అంచనావేసిందో తెలియదు. మొదటి విషయం, 1951లో తయారుచేసిన భాషా సంబంధమైన లెక్కలను హిందీ మాట్లాడేవారి సంఖ్యను పెంచి, ఇంగ్లీషు మాట్లాడేవారి సంఖ్యను తగ్గించడానికి బుద్ధిపూర్వకంగా తయారుచేశారు. ఇంగ్లీషు రెండవ భాషగా ఉన్నచోట అది పరదేశ భాష కాబట్టి లెక్కలోకి తీసుకోవద్దని 1951 వ సంవత్సరపు లెక్కలు సేకరించినవారికి ఖచ్చితమైన ఆదేశం యివ్వబడింది. ఇంగ్లీషు భాషకు సంబంధించి యివ్వబడిన అంకెలు ఇంగ్లీషు మాతృ భాషగాగలవారి సంఖ్యకు మాత్రం పరిమితమై ఉన్నాయి. నా అంచనా ప్రకారం ఇంగ్లీషు చదువుకున్నవారి సంఖ్య హిందీ చదువుకున్నవారి సంఖ్యకంటె కనీసం వంద రెట్లు ఎక్కువ. మిశ్రమ ఇంగ్లీషు భాషను మాట్లాడేవారి సంఖ్యనుకూడ చేరిస్తే అది మిశ్రమ హిందూస్థానీ మాట్లాడేవారి సంఖ్యకంటె ఎక్కువ కాకపోయినా కనీసం సమానంగానైనా ఉంటుంది.

భారత రిపబ్లిక్‌లో నూటికి 42 మంది హిందీ తెలిసినవారున్నారనడం అతి విపరీతమైన రాజకీయ వంచనలలో ఒకటి.

## అధిక సంఖ్యాక ప్రజలతో సంబంధానికి హిందీ సాధనం

శ్రేయో రాజ్య స్థాపనకు సోషలిస్టు సాంఘిక వ్యవస్థల స్థాపనకు కంకణం కట్టుకున్న భారతదేశంలో అధికార కార్యకలాపాలు దేశప్రజలలో చాలా ఎక్కువమందికి తెలిసే భాషలో కొనసాగాలని అధికార భాషావిచారణ సంఘం సలహా యిచ్చింది. ఈ ఉపసంఘం దానిని బలపర్చింది. ఈ దృక్పథంలో చాలా దోషాలు స్పష్టంగా కనిపిస్తున్నవి. ప్రజా బాహుళ్యంతో సంబంధాలు ఏర్పరచుకునే విషయంలో ప్రభుత్వానికీ ప్రజలకు మధ్య భాషా సాధనంగా హిందీ పనికివస్తుందని

సూచించడం పూర్తిగా తప్పు. పాలకులు, పాలితుల మధ్య సంబంధాలు వివిధ ప్రాంతీయ భాషలద్వారానే ఏర్పడగలవు. కేంద్రప్రభుత్వ పాలకులు హిందీద్వారా హిందీ మాతృభాషగాని రాష్ట్రాల ప్రజలతో సరైన సంబంధాలు ఎన్నడూ ఏర్పరచుకోజాలరు. ఇప్పుడు అధికార రీత్యా ఉపయోగించబడుతూన్న నవహిందీ, హిందీ రాష్ట్రాలలో హిందీ మాట్లాడుతామని చెప్పుకొనేవారికికూడ సరిగా అర్థంకాదని నేను లోగడ చెప్పాను. దేశం అంతటా మిశ్రమ హిందూస్థానీ బజారుభాషగా వాడుకలో ఉన్నందువల్ల కేంద్రప్రభుత్వం ఉపయోగిస్తున్న భాష హిందీ మాతృభాషకాని ప్రాంతాల వారికికూడా అర్థం అవుతుందంటె అంతకుమించిన అసత్యం ఉండబోదు.

ఈ సందర్భంలో ఒక ముఖ్యవిషయాన్ని గుర్తించుకోవాలి. హిందీ భాష ప్రముఖ భారతీయ భాషలన్నింటిలోకి బాగా వెనుకపడి ఉన్న భాష. హిందీ మాట్లాడే ప్రజలు దేశంలోని ముఖ్యమైన భాషా వర్గాలవారందరికికంటె బాగా వెనకపడి ఉన్నారు. హిందీ మాతృభాషగాగల రాష్ట్రాలలో నిరక్షరాస్యులసంఖ్య యితర రాష్ట్రాలలో సంఖ్యకంటె అత్యధికం.

ఇంగ్లీషు చదువుకున్న కొద్దిమంది భారతీయులు స్వప్రయోజనాలకోసం ఇంగ్లీషు భాషను బలపరుస్తున్నారని కొంతమంది హిందీ వాదులు వాదిస్తున్నారు. ఈ అదృష్టవంతుల వర్గం తను అనుకూల స్థితికి భంగంకలుగకుండా చేసుకోవాలంటున్నారని హిందీ వాదులంటున్నారు. బోధన భాష ఇంగ్లీషు అయినా హిందీ అయినా విద్యావంతులెప్పుడూ అదృష్టవంతుల వర్గానికి చెందినవారె. నేను పైన పేర్కొన్నట్లు ఇంగ్లీషు చదువుకొన్న విద్యావంతుల సంఖ్య పూర్యపు హిందీ చదువుకొన్న విద్యావంతుల సంఖ్యకంటె కనీసం పదిరెట్లు ఎక్కువ. ఇంగ్లీషులో విద్యాభ్యాసం చేసిన అధిక సంఖ్యాకులు దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ సమంగావున్నారు. వారిది అదృష్టవంతుల వర్గమంటున్నప్పుడు నూటికి ½ వంతుకూడా లేని ఈ నవహిందీ విద్వాంసులకు హెచ్చు ప్రతిపత్తి ఎందుకు కల్పించాలి. వీరికి మాత్రమె నవహిందీ తెలుసు. పైగా పండితులు, మత గురువులు, యితరులుగల ఈ నూటికి ½ వంతు వర్గం దేశంలో ఒక ప్రాంతానికే పరిమితమైవుంది.

ప్రజాబాహుళ్యంతో సంబంధాలు ఏర్పరచుకొనే విషయంలోకూడా హిందీ రాష్ట్రాలు దేశంలోని అతి తక్కువ ప్రాంతానికే పరిమితమై ఉన్నాయన్న సంగతి జ్ఞాపకముంచుకోవాలి. కలకత్తాలో జరిగిన భాషా విషయక మహా సభలో రాజాజీ చూపించిన పటంలో హిందీ రాష్ట్రాలు నల్లరంగులోనూ, మిగిలిన భారత దేశం ఎర్రటి రంగులోను సూచించబడినవి. ఈ పటం వ్యక్తపరచిన విషయాలు ప్రేక్షకుల మనస్సులలో బాగా హత్తుకుపోయాయి. దేశంలోని అతి అల్ప సంఖ్యాక వర్గానికి చెందిన హిందీభాషను దేశ ప్రజలందరిమీద రుద్దడమేగాక, హిందీని దేశంలలోని అతి స్వల్ప ప్రాంతానికే పరిమితమైన భాష అని మాటలలో చెప్పజాలని విషయాన్ని ఆ పటం కళ్లకు గట్టినట్లు తెలియజెప్పింది.

ఈనాడు ఈ నవహిందీ, కల్పించిన సంఖ్యాబలం, సరి కొత్త హక్కులతో నటిస్తూ, సంస్కృతంయొక్క స్థానాన్ని అపహరించడానికి, ఉర్దూను నాశనం చేయడానికి ప్రయత్నిస్తున్నది. గాంధీజీ హితవును సైతం పెడచెవినిపెట్టి హిందూస్థానీని తిరస్కరించింది. ఈ నవహిందీ ప్రజా బాహుళ్యానికి, ప్రభుత్వానికి సన్నిహిత సంబంధ సాధనంగా ఉపకరించక పోగా పైపెచ్చు వారినుంచి దూరం కావడానికి సాధనంగా ఉపయోగపడుతుంది.

## హిందీని వ్యతిరేకించడానికి కొన్ని కారణాలు

జాతీయ శ్రేయస్సు దృష్ట్యా హిందీని వ్యతిరేకించాలని నా అభిప్రాయం. ఇంతేగాక హిందీ యీ క్రింద పేర్కొన్న అభ్యుదయ నిరోధక కలాపాలకు చిహ్నంగా క్రమంగా దేశమంతటికి వేగంగా వ్యాపిస్తున్నదని నా విశ్వాసం.

1. హిందీ మతానికి చిహ్నం: ఉత్తర భారతదేశంలో హిందీ రక్షాసమితి వారు తమ ఉద్యమ ప్రచారంలో హిందీని మత చిహ్నంగా ఉపయోగిస్తున్నారని పైనే చెప్పాను. ఈ సమితి మనుగడ, హిందీ మాట్లాడే రాష్ట్రాలపైనే ఆధారపడి వున్నది.

2. అల్ప సంఖ్యాక వర్గాలు—అధోగతికి హిందీ చిహ్నం : ముస్లింలు, శిక్కులు ఆదివాసులు, ఆంగ్లో-ఇండియనులు, మొదలైన అల్ప సంఖ్యాక వర్గాలవారిని అణచివేసే ఉద్యమానికి హిందీ చిహ్నమని లోగడనే మనవి చేశాను. హిందీ జాతీయ భాష అయితే ఈ లక్షణం ఉత్తరోత్తరా దేశమంతటికి వ్యాపించగలదని నా ఉద్దేశం.

3. హిందీని బలవంతంగా తెచ్చిపెట్టడంవల్ల కొత్తగా అదృష్టవంతుల వర్గమొకటి సృష్టి అవుతుంది. దానితోపాటు హిందీ మాతృభాషకాని ప్రజలు శాశ్వతంగా తక్కువ తరగతి పౌరులుగా దిగజారక తప్పదు. హిందీని తప్పనిసరిగా ప్రవేశపెట్టడంవల్ల హిందీ విద్యార్థికి తన మాతృభాషలోనే విద్యాభ్యాసం చేయడానికేగాక ఇంకా అనేక సౌకర్యాలు అతనికిమాత్రం అందుబాటులో ఉండడానికి అవకాశం కలుగుతుంది. హిందీ భాష మాట్లాడని విద్యార్థులు మూడు భాషా† పిశాచాలతో కుస్తీ పట్టు పట్టాలి. ఉద్యోగార్థులు, న్యాయవాదులూ, న్యాయాధిపులు కాగోరేవారూ ఒక పరభాష హిందీని నేర్చుకోవాలని బలవంత పెడతారు. ఉన్నతాశయాలుగల విద్యార్థులు ఇంగ్లీషుకుగల విలువ రీత్యా మరొక పరభాష క్రింద ఇంగ్లీషు నేర్చుకుంటారు.

4. హిందీ దేశ విచ్ఛిత్తికి చిహ్నం :—అధికార భాషగా హిందీని ప్రవేశపెట్టే కార్యక్రమం క్రమంగా దేశ విచ్ఛిత్తికి దారి తీయగలదని నా అభిప్రాయం. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని నేను పార్లమెంటులో వ్యతిరేకించినప్పుడు నా కంఠం ఒక్కటే వినిపించింది. భాష కారణంగా దేశ విచ్ఛిన్నతకు ప్రభుత్వం అంకురార్పణ చేస్తున్నదనీ, అది దేశం చిన్నా భిన్నం కావడానికి దారితీయ వచ్చుననీ నేను ప్రభుత్వాన్ని హెచ్చరించాను. మహారాష్ట్రం, గుజరాత్, పంజాబులలో ఇప్పుడు చెలరేగుతున్న ప్రత్యేక రాష్ట్రోద్యమాలను ఈ నాడు ప్రభుత్వం ఖండిస్తున్నది. ఇవి ప్రభుత్వం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి అంగీకరించడంవల్ల తత్పర్యవసానంగా సంభవించే తప్పని సరి సంఘటనలు.

రాజకీయాల ప్రాబల్యంగల హిందీ రాష్ట్రాలు చేస్తున్న వత్తిడికి లొంగిపోయి ప్రభుత్వం ఈ నాడు అధికార భాషగా హిందీని బలవంతంగా ప్రవేశపెట్టే కార్యక్రమాన్ని పడిపడిగా అమలు జరుపుతున్నది.

భారత దేశ చరిత్ర ఆటవిక వాదుల సంఘర్షణల చరిత్ర. భాషా ప్రాతిపదికపై రాష్ట్రాలను పునర్వ్యవస్థీకరించడం ఆటవిక వాదానికి ప్రథమ నైవేద్యం. అధికార భాషగా హిందీని బలవంతగా ప్రవేశపెట్టడం భారత దేశాన్ని ముక్కు ముక్కలు చేయడానికి అంతిమ చర్య. హిందీని ఈ విధంగా ప్రవేశపెట్టడం పట్ల ప్రజా ప్రతికూలత తీవ్రమౌతున్నది. హిందీ భాషోన్మాదానికి చిహ్నంగా హిందీ రాష్ట్రాలు తీసుకునే ప్రతి చర్యకూ హిందీ మాతృ భాషకాని రాష్ట్రాలు కొన్ని ప్రతికార చర్యలు తీసుకుంటున్నవి. హిందీ మాతృ భాషగాని రాష్ట్రాలు ఈ విధానాన్ని కొనసాగించే పక్షంలో భారతదేశం విడి విడి భాషా సాంస్కృతిక ఖండాలుగానూ, చివరకు అనేక జాతీయ ఖండాలుగానూ విచ్ఛిన్నంకాక తప్పదు. హిందీ రాష్ట్రాలు విశ్వ విద్యాలయాలలో బోధనా భాషను మారిస్తే హిందీ మాతృ భాషకాని రాష్ట్రాలు తమ ప్రాంతీయ భాషను బోధన భాషలుగా ప్రవేశపెడుతున్నవి. ఇదే విధంగా హిందీ రాష్ట్రాలు తమ హైకోర్టులలో హిందీ భాషను ప్రవేశపెడితే, హిందీ మాతృభాషకాని రాష్ట్రాలు ఈ ఉపసంఘం ఆశించిన దానికి విరుద్ధంగా, తమ హైకోర్టులలో ప్రాంతీయ భాషలను ప్రవేశ పెడతాయి. అఖిల భారత ఉద్యోగాల పరీక్షా భాషలలో ఒకటిగా హిందీనికూడ ప్రవేశపెట్టడంలో హిందీవాదులు కృతకృత్యులైతే, హిందీ మాతృభాషకాని రాష్ట్రాలలో తీవ్రమైన అప్రతిహతమైన ఉద్యమాలు విజృంభించి అఖిల భారత ఉద్యోగాలకు ప్రాంతీయ భాషలనుకూడా పరీక్షా భాషలుగా ప్రవేశ పెట్టడానికి కేంద్ర ప్రభుత్వం తప్పని సరిగా అంగీకరించవలసిన పరిస్థితి కల్పించవచ్చు. ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పరచడానికి అంగీకరించి, భాష పేరుతో దేశం ఛిన్న భిన్నం కావడానికి ప్రభుత్వం జాతీయతకు పోసిన విషం హిందీని బలవంతంగా ప్రవేశ పెట్టాలని ప్రభుత్వం పట్టు పట్టడం ద్వారా పోసే విషమంత హానికరమైనది కాదు.

---

† అఖిల భారత ఉద్యోగాలకు కేంద్ర ఉన్నత ఉద్యోగాలకు పోటీచేసే అభ్యర్థులందరికీ ఇంగ్లీషుతోపాటు ఒకేప్రమాణం గల రెండు పరీక్షపత్రాలు—ఒకటి హిందీలోనూ రెండవది హిందీ మినహాగా యితర భారతీయ భాషల్లో అభ్యర్థులు కోరిన భాషల్లోను ఉండాలనీ, యీ విషయం అభ్యర్థులకు ముందుగానే తెలియజేయబడాలని ఈ ఉపసంఘం సూచించింది. రాష్ట్ర విద్యా మంత్రుల సమావేశం సెకండరీ పాఠశాలలకోసం రూపొందించిన త్రిభాషా సిద్ధాంతం అన్ని ప్రాంతాలకూ సమానంగానే వర్తిస్తుంది.

5. హిందీ తిరోగమన చిహ్నం :—హిందీ యింతవరకూ తగిన పదజాలాన్ని సమకూర్చుకొన లేదు. ఇంత కన్న దారుణమైన విషయం, దాని లిపికూడా యింకా నిర్ధారణకాలేదు. బొంబాయిలో వాడుకలో వున్న హిందీ లిపి, ఉత్తర ప్రదేశంలో ఉపయోగించే హిందీ లిపి వేరు వేరు. బొంబాయినుంచి ఉత్తర ప్రదేశానికి వెళే విద్యార్థులు హిందీ అక్షరాలను నేర్చుకోవాలి.

ప్రముఖ భారతీయ భాషలైన బెంగాలీ, తమిళ భాషలకంటె హిందీ కనీసం వెయ్యి సంవత్సరాలు వెనుకబడి ఉంది. హిందీని బలవంతంగా ప్రవేశ పెట్టడమంటే మన జాతీయ జీవనం ప్రతి విషయంలోనూ దేశాన్ని వెయ్యి సంవత్సరాలు వెనక్కు మళ్లించడం అన్న మాట. హిందీని బలవంతంగా అధికార భాషగా ప్రవేశ పెట్టాలని పట్టు పట్టడం యథార్థ పరిస్థితులను గుర్తించక పోవడమే. ఈ స్పుట్నిక్‌ల యుగంలో ఎడ్లబళ్లనాటి రోజులకు తిరిగి వెళ్లమనడానికి ఎవరూ సాహసించ జాలరు.

## ప్రస్తుత స్థితిని యథాతథంగా ఉండనీయండి

భాష, సంస్కృతి, సాంఘికాచారాల విషయంలో ఏకతే జాతీయత అనుకోనడం కేవలం దురభిప్రాయం. భారత జాతీయతలోని వైవిధ్యాన్ని వాస్తవిక రూపంలో గుర్తించి స్వీకరించాలి. భాషా విధానాలను తారుమారు చేసి ఏకత్వాన్ని సాధించాలన్న వాంఛ జాతి, జాతీయతల పట్ల వక్రమైన అభిప్రాయాలవల్ల జనిస్తుంది. భాషాతత్త్వం, మతాతత్వాలపట్ల పూర్తి అజ్ఞానాన్ని అది వ్యక్తపరుస్తుంది.

అనేక పెద్ద రాష్ట్రాలలోని ప్రాంతీయ భాషలవలెనే హిందీకూడ ప్రముఖ స్థానాన్ని అలంకరించ వలసిందే. హిందీ మాతృ భాషగాగల రాష్ట్రాలకుసైతం ప్రభుత్వ వ్యవహారాలలో హిందీని ప్రవేశ పెట్టడానికి యింతవరకూ సాధ్యం కాలేదు. హిందీవాదులు హిందీని కోరడానికి ముందు అందుకు తగిన అర్హతను హిందీకి సంపాదించి పెట్టాలి. భారత దేశ సాంస్కృతిక, సాహిత్య, వైజ్ఞానిక పురోభివృద్ధికి హిందీని ప్రధాన సాధనంగా హిందీ మాతృభాషకాని ప్రజలు వారంతట వారే స్వీకరించేందుకు వీలుగా హిందీ భాషను అభివృద్ధి చేయండి. అప్పటివరకూ ఈ హిందీ భాషోన్మాదం ముందుకు సాగకుండా నిలిపి ఉంచుదాము. లేక పోతే దేశంలో ప్రస్తుతం ఉన్న ఐకమత్యం హరించి పోతుంది.

దేశంలోని విద్యావేత్తలు, విద్వాంసులు, శాస్త్రవేత్తలలోని అత్యధిక సంఖ్యాకులు ప్రస్తుత స్థితి యథాతథంగా ఉండాలని కోరుతున్నారనే నా విశ్వాసం.

అతి ప్రధానమైన ఈ భాషా సమస్యను అతి జాగ్రత్తగా పరిశీలించి, తదుపరి చర్యను, లేక చర్యలను నిర్ణయించడానికి పార్లమెంటుకు అవకాశం వచ్చేవరకు అయినా ప్రస్తుత పరిస్థితిని యథాతథంగా కొనసాగ నివ్వాలని రాష్ట్రపతికి సవినయంగా విన్నవిస్తున్నాను.

ఫ్రాంక్ ఆంతొనీ,
లోక్ సభ సభ్యుడు.
డివిజను నెం. 438.

# శ్రీ ఠాకూర్‌దాస్ భార్గవా—ప్రత్యేకాభిప్రాయ ప్రకటన

నా ఈ ప్రకటన భిన్నాభిప్రాయ ప్రకటన కాదనీ, పార్లమెంటు అధికార భాషా ఉపసంఘంవారి ముఖ్యమైన సూచనలకూ, భాషాసమస్యపట్ల ఆ ఉపసంఘం అవలంబించిన ప్రధాన దృక్పథానికి అనుగుణంగానే వున్నదనీ నా ప్రకటనను పరిశీలిస్తే స్పష్టమవుతుంది. పూజ్యులు టండన్‌జీ, నా అనుగు మిత్రుడు సేట్ గోవిందదాస్‌జీల ప్రత్యేకాభిప్రాయ ప్రకటనను పఠించే అవకాశం నాకు లభించింది. అందులో పేర్కొన్న అధిక సంఖ్యాక వర్గ నివేదికనూ, వారి ప్రకటనను చదివిన తర్వాత నా ప్రకటనను భిన్నాభిప్రాయ ప్రకటన అనడానికి వీలులేదని నాకు తోచింది. అధిక సంఖ్యాక వర్గ నివేదిక అని పేర్కొనబడే దానిలోనూ, వారి ప్రకటనలోనూ అనేక సమానాంశాలున్నందున, ఈ ఉపసంఘ నివేదిక దాదాపు ఏకగ్రీవ నివేదిక అనీ, ప్రాథమిక చర్చల ఫలితాన్ని గురించి నివేదికలో వెల్లడించిన అభిప్రాయం నిజానికి నివేదికకుకూడా వర్తిస్తుందనీ నా అభిప్రాయం. దాదాపుగా సభ్యులందరూ ఆ చర్చలలో పాల్గొన్నారనీ, వివరాల విషయంలో భిన్నాభిప్రాయాలున్నప్పటికి లక్ష్యాల విషయంలోనూ, ఈ సమస్యపట్ల అవలంబించవలసిన వైఖరి విషయంలోనూ స్థూలంగా అంగీకారం కుదిరినదనీ ఆ నివేదికలో పేర్కొనబడింది.

సిద్ధాంతాల విషయంలో ఎట్టి భిన్నాభిప్రాయాలూ లేవు. ఇక వివరాల విషయంలో, వేటికి ప్రాముఖ్యమివ్వాలన్న అంశాన్ని బట్టిచూచి భిన్నతత్త్వాలూ, భిన్నాభిప్రాయాలూగల ఇద్దరు మేధావులు ఏకాభిప్రాయానికి రావడం సాధ్యంకాదు. యోగ్యులైన మా అధ్యక్షులు గౌరవ శ్రీ పంత్‌జీ మార్గదర్శకత్వం వహించిన ఈ ఉపసంఘం జరిపిన చర్చలన్నీ సామరస్య సహకారపూర్వకమైన వాతావరణంలోనే కొనసాగాయి. ఒకప్పుడు ఈ సమస్యపట్ల దేశంలో వైరాశ్య, ప్రతికూలభావాలు ప్రబలంగా వుండేవి. యోగ్యులైన మా అధ్యక్షులు గౌరవ శ్రీ పంత్‌జీకి, హిందీ మాతృభాష కాని ప్రాంతాల ప్రతినిధులైన జాతీయ నాయకులు శ్రీ మొదలియార్, శ్రీ డాంగే, శ్రీ అతుల్యఘోష్ మున్నగు మిత్రులకూ, హిందీ మాతృభాషగాగల ప్రాంతాల ప్రతినిధులైన జాతీయ నాయకులు పూజ్య టండన్‌జీ, సేట్ గోవిందదాస్, ప్రభృతులూ ముందున ప్రకటించిన సమయోచిత అభిప్రాయాలను గౌరవిస్తూ దేశభక్తి పూర్వకంగా ఈ సమస్యను పరిశీలించినందుకు నా మనఃపూర్వక ప్రణామాలను అందచేస్తున్నాను. వివరాల ప్రాముఖ్యం విషయంలో అప్పుడప్పుడు అభిప్రాయభేదాలు వచ్చినా, అత్యవసరమైన ప్రధాన సమస్య విషయంలో ఎట్టి వివాదంగాని సందేహంగాని రాలేదు.

ఈ ఉపసంఘం సమష్టి దృక్పథంతో వ్యవహరించినందుకూ నివేదిక ద్వితీయాధ్యాయంలో ఉదహరించిన ప్రాతిపదిక దృక్పథం విషయంలో ఎట్టి భిన్నాభిప్రాయాలూ లేనందుకు దేశం సంతోషించవలసి ఉన్నది. ఈ ఉపసంఘంలోని అందరి సభ్యుల ఏకగ్రీవ దృక్పథాన్ని యిది వ్యక్తం చేస్తున్నది. ఈ నివేదికలో యింకా యిలా ఉన్నది :

> “ ఈ సమస్యకు సంబంధించిన అన్ని అంశాలను పరిశీలించినమీదట రాజ్యాంగంలో ఉదహరించిన విధంగా పట్టుబడి ఉండటం ఒక్కటే ఆచరణ సాధ్యమైన, క్షేమకరమైన మార్గమని ఈ ఉపసంఘం నిశ్చితాభిప్రాయం.

ఇక వివరాల విషయంలో కొన్ని ఆచరణ మార్గాలకు యివ్వవల్సిన ప్రాధాన్యాన్నిగురించి కొందరు సభ్యులకు భేదాభిప్రాయాలున్నా, అందులో కొన్ని అంత ప్రధానమైనవికావు. సమాధానం కుదరనివికావు. వాటిలో హెచ్చుభాగం సమాధానం కుదుర్చుకోగలిగినవే. అందులో కొన్నింటి విషయంలో పూజ్య టండన్‌జీ వెల్లడించిన అభిప్రాయాలతో నేను ఏకీభవిస్తున్నాను. వాటిలో కొన్నింటిని సంగ్రహంగా ఇక్కడ పేర్కొంటున్నాను.

21-వ అంశం విషయంలో నాల్గవ తరగతి సిబ్బందికి సంబంధించిన అభియోగపత్రాలు, వారినుండి కోరే సంజాయిషీలూ ఇంగ్లీషులోనే వున్నాయని ఉదహరించినట్లు నాకు జ్ఞాపకంలేదు. ఇంగ్లీషు తెలియని నాల్గవ తరగతి సిబ్బందికి పంపే లేఖలూ, ఉత్తరువులూ హిందీలోగాని, ఆయా సిబ్బంది తాలూకు ప్రాంతీయ భాషలలోగాని వుండాలన్న అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. వారందరి విషయంలోనూ ఒకే భాషను హిందీగాని, ఇంగ్లీషుగాని ప్రాంతీయ భాషగాని ఉపయోగించడం న్యాయంకాదు. ఎందువల్లనంటే సాధారణంగా వారు ఎక్కువ చదువు రానివారు. ప్రస్తుత పరిస్థితులలో వారివారి ప్రాంతీయ భాషలనే వాడుకచేయడం సముచితం.

విదేశాలలో రాయబారుల ఉద్యోగలాంఛన పత్రాలు జాతీయభాషలో సమర్పించడం ఇదివరకే ప్రారంభమైనదని నా విశ్వాసం. ఒకవేళ ఈ మాట నిజం కాకపోయినప్పటికీ ఆ సూచనను నేను హృదయపూర్వకంగా బలపరుస్తాను. ఈ ఉపసంఘ సభ్యులెవ్వరు దానికి వ్యతిరేకంగా లేరని నా అభిప్రాయం.

ఇరవై రెండవ అంశంలో కాలక్రమ పథకం తయారుచేసే విషయంలో ప్రభుత్వం తన అభిప్రాయాలనూ, ప్రతిపాదనలనూ అందచేయనందున అధికార భాషా విచారణ సంఘం కార్యాచరణ పథకం తయారుచేయజాలక పోయినందుకు నేను చాల విచారిస్తున్నాను. నాతోసహా అనేకమంది సభ్యులు ఎన్నోసార్లు అడిగినప్పటికీ ప్రభుత్వం ఆ పథకాన్ని రూపొందించలేదు. కేంద్రప్రభుత్వ విద్యాశాఖ ప్రారంభంనుంచీ అంటే 1951-వ సంవత్సరంనుంచీ చురుకుగా పనిచేసి తన బాధ్యతలను నిర్వహించినట్లయితే భాషాసమస్య విషయంలో ప్రస్తుత పరిస్థితి ఏర్పడి వుండేదికాదు. గతాన్నిగురించి విచారించి ప్రయోజనం లేదు. ఈ సంఘం తాలూకు కొందరు సభ్యులు యీ విషయాన్నిగురించి కొంత కృషిచేయాలని ఒకప్పుడు అనుకున్నారుగాని అట్టి పథకాన్ని తయారుచేయడానికి ప్రభుత్వం తేదీల వివరాలనూ ఆధారాలను యివ్వనందున ఆ ప్రయత్నాలు ఫలించలేదు.

ఈ పథకాన్ని, విధానాన్ని రూపొందించి అమలుజరపడానికి ప్రభుత్వానికే అధికారమున్నది. ఇకమిగిలు చేయదగినదల్లా ఆ విషయంలో కృషిని తీవ్రతరం చేయాలని ప్రభుత్వాన్ని అర్థించడం. ఈ సందర్భంలో తీసుకోవలసిన చర్యల ఆవసరాన్ని కేంద్ర దేశీయాంగ మంత్రి పూర్తిగా గుర్తించేవున్నారనీ, ఈ నివేదికలోని రెండవ అధ్యాయంలో చేసిన సూచనల కనుగుణంగా ఆయన శాయశక్తులా అనుసరించే విధానం ఉత్తమ ఫలితాలను సాధించగలదని నా నమ్మకం.

ఈ విధానం నివేదికలోని 24-వ పేరాలో స్పష్టంగా వివరించబడింది.

"అధికారభాష మార్పు క్రమేపి క్రమబద్ధమైన దశలవారీగా జరుపబడినా, ఈ మార్పును సుగమంచేసే ప్రాథమిక సన్నాహ చర్యలను అమలుజరిపే కృషిలో ఎంతమాత్రం లోపం జరగకూడదు. ఆచరణలో ఎదురయ్యే యిబ్బందులను బాగా ఆలోచించి రూపొందించిన కార్యక్రమం ప్రకారం కృషిజరిగితే, సులభంగా అధిగమించవచ్చు."

అభ్యుదయ కృషి నిర్వహణ కార్యక్రమంలో కాలప్రణాళిక నిరంతరం హెచ్చరికవంటిది. ఈ ఉపసంఘ చర్చలలో ఈ అంశానికి నేను విశేషప్రాధాన్యం యిచ్చాను. ప్రభుత్వం కాలప్రణాళికను సాధ్యమైనంత త్వరలో తయారు చేయాలన్న నా కోర్కెను పునరుద్ఘాటిస్తున్నాను.

ఈ ప్రణాళికను రూపొందించేటప్పుడు హిందీ మాతృభాషకాని ప్రజల అభిప్రాయాలను పూర్తిగా పరిశీలించి, న్యాయమైన ఆక్షేపణలకు తగిన ప్రాముఖ్యం యివ్వడం చాలా అవసరమని నేను భావిస్తున్నాను. కేంద్ర దేశీయాంగ మంత్రి పర్యవేక్షణక్రింద రూపొందే ప్రతి పథకం విషయంలో, హిందీ మాతృభాషకాని ప్రజల అభిప్రాయాలను సమగ్రంగా పరిశీలిస్తారన్న విషయం నాకు గట్టిగా తెలుసు. అందువల్ల యీ విషయంలో నాకు ఎట్టి ఆందోళనలేదు.

హిందీభాషకు ప్రత్యేక మంత్రిత్వ శాఖను నెలకొల్పాలని పూజ్య టండన్‌జీ తమ ప్రకటనలో ఒక ప్రతిపాదన చేశారు. ఈ ప్రతిపాదన హిందీ మాతృభాషగాని ప్రాంతాల ప్రజలలో ఈ నూతన భాషా కార్యక్రమాన్ని ప్రభుత్వం అకారణంగా త్వరితగతిని అమలుజరుపుతోన్నదన్న భయాందోళనలను కలిగిస్తుంది. అందువల్ల ఈ సూచనతో నేను ఏకీభవించడంలేదు. ఇందు కవసరమైన కృషిని స్థైర్యంతోనూ, ఉత్సాహంతోనూ నిర్వహించి నిర్లక్ష్యం, సోమరితనాలతో కూడిన ప్రస్తుత విధానాన్ని వదలివేయడానికి కేంద్ర దేశీయాంగ మంత్రి పర్యవేక్షణక్రింద ఒక బోర్డును నియమించాలన్న సూచనతో నేను ఏకీభవిస్తున్నాను.

అధికారభాష మార్పు 1965 నాటికిగాని ఆ తర్వాత ఒకటి, రెండు సంవత్సరాలకుగాని పూర్తికావాలని పూజ్యులైన టండన్‌జీ తమ ప్రకటనలో చేసిన సూచనతో నేను ఏకీభవించజాలను. ఆ గడువును హిందీ మాతృభాష

కాని ప్రాంతాలలోని మన మిత్రులు ఆమోదింపజాలరని నా అభిప్రాయం. ఈ ఉపసంఘంకూడ ఎట్టి గడువు తేదీని నిర్ణయించలేదు. ఎట్టి గడువు తేదీని అంగీకరించలేదు. ఈ నివేదికలో వివరించిన కారణాల దృష్ట్యా పూర్తిమార్పుకి అంత తక్కువ గడువుచాలదు. ఈ నివేదికలో వెల్లడించినట్లు 1965-వ సంవత్సరంనాటికి పూర్తిగా భాష మార్పు చేయడం ఆచరణ సాధ్యంకాదు. ఈ అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను.

అంకెల విషయంలో రాజ్యాంగంలో తీవ్రమైన మార్పు జరగాలని నేను వాంఛించడం లేదు. హిందీ అంకెలకు బదులు అంతర్జాతీయపు అంకెలను ప్రవేశపెట్టగోరే రాజ్యాంగ నిబంధనకు వ్యతిరేకంగా వోటు చేసింది, పూజ్య టండన్‌జీ ఒక్కరే. కాని ఆయన తన ప్రకటనలో రాజ్యాంగాన్ని మార్చాలని కోరనేలేదు. ఇంతవరకూ అనుసరిస్తున్న పద్ధతి యోగ్యమైనదే. కేంద్రప్రభుత్వ బడ్జెటు హిందీ ప్రతిలో అంకెలుకూడ హిందీలోనే యివ్వబడ్డాయి. ఇతర హిందీ ప్రచురణలలోకూడ అంకెలు సాధారణంగా హిందీలోనే ఉంటాయి. హిందీ రైల్వేగైడులో హిందీ అంకెలను ఉపయోగించినా పై విధంగానే ఉంటుంది. నా ఉద్దేశంలో ప్రస్తుత విధానాన్ని అనుసరించడమే వాంఛనీయం. ఒక్కొక్క ప్రచురణయొక్క స్వభావం దానికి సంబంధించిన యితర విషయాల దృష్ట్యా హిందీ అంకెలను ఉపయోగించాలా లేదా అన్న విషయాన్ని నిర్ధారణ చేయాలి.

"శాస్త్రీయ, సాంకేతిక, సంఖ్యాసంబంధమైన వ్యవహారాల ప్రచురణలకు అంతర్జాతీయపు అంకెలు ప్రత్యేకంగా తగివున్నవన్న" అభిప్రాయం చాలామంది వెల్లడించారు.

ముప్పైమూడు, ముప్పైనాలుగవ అంశాలకు సంబంధించినంతవరకూ అధిక సంఖ్యాకుల నివేదికలోని సూచనలతోగాని, ప్రకటనతోగాని నాకు భేదాభిప్రాయల్లేవు. ఇప్పుడుకూడ ఇండియన్ పీనల్‌కోడ్, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ ఎవిడెన్సు చట్టం తదితర చట్టాలు ఉర్దూలోనూ, హిందీలోను ప్రచురిస్తున్నారు. వివిధ చట్టాలను ప్రభుత్వం అనువాదం చేయిస్తున్నది. అన్ని చట్టాలూ అధికార భాషలో ప్రచురణ కావలసివున్నందున పార్లమెంటులో ప్రవేశ పెట్టే బిల్లుల విషయంలో ఆంగ్ల పాఠంతోపాటు హిందీ అనువాదాలను జతపర్చడం సముచితం. పార్లమెంటు సభ్యులలో అనేకమంది ఇంగ్లీషు భాషాజ్ఞానంలేని వారున్నారు. వారికోసమైనా యీ పద్ధతి అవసరం. పార్లమెంటు చేసిన శాసనాలన్నీ, అన్ని ప్రాంతీయ భాషలలోకి సాధ్యమైనంత త్వరలో అనువదింపచేయాలి.

ప్రభుత్వ ఉద్యోగ శాఖల విషయంలో, శిక్షణ సంస్థలలో కొంతకాలవరకూ ఇంగ్లీషు బోధన భాషగా వుండాలనీ, అన్నింటికిగాని లేక కొన్నింటికిగాని హిందీని బోధన భాషగా ప్రవేశపెట్టడానికి చర్యలు తీసుకోవాలనీ ఈ ఉపసంఘం సూచించింది. బోధన భాషగా హిందీని ప్రవేశపెట్టడానికి "త్వరలో" తగిన ఏర్పాట్లు చేయాలన్న సవరణను ఈ ఉపసంఘం ఆమోదించలేదు. "త్వరలో" అన్న మాటను అంగీకరించనంత మాత్రాన కలిగే నష్టమేదీ లేదు. ఈ విషయంలో సముచితమైన చర్యలను తీసుకోడానికి అంగీకరించ ఉండవలసింది. ఇంగ్లీషు భాషను నిలిపివేయాలనిగాని, ఇంగ్లీషు స్థానంలో హిందీని వెంటనే ప్రవేశపెట్టాలనిగాని ఎవరూ కోరడం లేదు. ఇంగ్లీషుతోపాటు ఇంగ్లీషురాని యువకులకోసం హిందీనికూడ ప్రవేశపెట్టాలనే కోరుతున్నారు. ఇదికూడ తక్షణమే జరగాలనడం లేదు. ప్రభుత్వం వీలునుబట్టి హిందీని ప్రవేశపెట్టడానికి త్వరలో చర్యలు తీసుకోవచ్చు. ప్రభుత్వం చిత్తశుద్ధితో వ్యవహరించే పక్షంలో హిందీని సాధ్యమైనంతత్వరలో ప్రవేశపెట్టగలదనడంలో నా కెట్టి అనుమానం లేదు. ప్రభుత్వానికి హిందీ మాతృభాషగా గల ప్రజల శ్రేయస్సు ఎంత ముఖ్యమో, హిందీ మాతృ భాషకాని ప్రజల శ్రేయస్సుకూడా అంత ముఖ్యమే. ఈ సౌకర్యాన్ని హిందీ మాట్లాడే ప్రాంతాలలోని తమ సోదరులకు కలిగిస్తే, హిందీ మాతృభాషకాని ప్రాంతాలవారికి కలిగే నష్టమేమీ లేదు. అది సహాయకర చర్యేగాని హానికరమైన చర్యకాదు.

ఉన్నతోద్యోగాలకు అభ్యర్థులను నిర్ణయించడానికి జరిగే పోటీ పరీక్షలలో పరీక్షా భాషగా ఇంగ్లీషుతోపాటు హిందీనికూడ సాధ్యమైనంత త్వరలో ప్రవేశపెట్టాలన్న కోర్కె న్యాయ్యమైనది. దానిని అంగీకరించవలసింది. హిందీ మాతృభాషకాని ప్రాంతాలలో అభ్యర్థులకు నష్టం కలుగకుండా చూడాలని మనం ఆందోళన పడుతున్నాము. అయితే, హిందీ మాతృభాషగాగల అభ్యర్థులను లోగడవలె యికముందు దండించరాదని కోరడం అన్యాయంకాదు. హిందీ

మాట్లాడేవారు హిందీని తమ బోధన భాషగా ప్రవేశపెట్టుకునేందుకు అనుమతించడానికి సరైన అభ్యంతర మేమిటో నాకు తెలియకుండావున్నది. ఏ అభ్యర్థుల విషయంలోనూ ఆశ్రిత పక్షపాతంగాని, వివక్షణయుగాని చూపకుండా చేయు వానికి చర్యలు తీసుకోవచ్చు.

హిందీ మాట్లాడే అభ్యర్థులు ముఖ్యంగా పంజాబులోని వెనకబడ్డ ప్రాంతమైన హరియానా, గుజరాత్‌లోను యితర వెనకబడ్డ ప్రాంతాలకు చెందిన హిందీ మాట్లాడే అభ్యర్థులు పరీక్షాపత్రాలకు ఇంగ్లీషులో సమాధానాలు వ్రాయ గాని హిందీ మాట్లాడని ప్రాంతాలలోని తోటి సోదరుల కున్నంత సమర్థత గలిగి ఉండకున్న సంగతి సుప్రసిద్ధమైన సత్యం. మరి వారిని సాధ్యమైనంత త్వరలో సమస్థాయిలోకి తీసుకురావడానికి ఎందుకు ప్రయత్నించరు ?

రోజులు మారుతున్నాయి. ఈ భాషా వివాదంవల్ల ప్రాంతీయభాషలకు లభించిన ప్రాముఖ్యం ఫలితంగా దేశంలోని అన్ని ప్రాంతాలలోను ఇంగ్లీషుకుగల ఉన్నత స్థానం తొలగిపోతుంది. రాజ్యాంగంలోని 16వ ఆర్టికల్ ప్రకారం ప్రభుత్వ ఉద్యోగాలకు యితర ఉద్యోగాలకు సంబంధించినంతవరకూ పౌరులందరికీ సాధ్యమైనంత త్వరలో సమానావకాశాలను కల్పించవలసివున్నది. ఇతర పౌరులకు తమకంటె ఎక్కువ సౌకర్యం కలిగించారనిగాని, అధికావకాశాలు లభింపచేస్తున్నారనిగాని ఏ భారత పౌరుడూ అనుకునేందుకు మనం సాధ్యమైనంతవరకూ అవకాశం యివ్వకూడదు. ఉత్తమమైన పద్ధతి ఏమంటె అభ్యర్థులందరూ తమ మాతృభాషలో సమాధానాలు వ్రాయడానికి అవకాశం కల్పించడం. ఈ సౌకర్యం కల్పించబడేవరకూ, ఇంగ్లీషులోనే సమాధానాలు వ్రాయాలని పట్టుపట్టి ఎవరినీ దండించరాదు.

భాషా సామరస్యం అధికార ప్రయోజనాలకు మాత్రమేగాక, ముందు ముందు జాతీయ సమైక్య భావాన్ని సాధించడానికి ఉత్తమ సాధనంకాగలదు. ప్రాంతీయ భాషలన్నీ మన జాతీయ భాషలు. వీలైనంతవరకూ వాటిని అభివృద్ధి చేయడానికి మనం శాయశక్తులా కృషిచేయాలి. ఎవరు ఏమిచెప్పినా హిందీ యావద్భారతదేశ భాషకాగలదు. వాడుకలోవున్న అన్ని ప్రాంతీయ భాషల పదాలతోనూ, భావాలతోనూ హిందీకి పుష్టిని చేకూర్చి, దేశంలోని అన్ని ప్రాంతాలవారూ దానిని ఉపయోగించుకునేట్లు చేయడానికి మనం కృషి చేద్దాము. హిందీ, ప్రాంతీయ భాషలమధ్య ఏ విధమైన శత్రుత్వంగాని, ఆధిపత్య భావాలుగాని లేవు. కేంద్ర ప్రభుత్వం దేశంలోని అన్ని ప్రాంతాలవారికి ఏ విధంగా సమానమో, అదే విధంగా హిందీకూడ అన్ని ప్రాంతాలకూ చెందిన భాష. పవిత్రమైన మన రాజ్యాంగాన్ని గౌరవించి దానిని అమలుజరపడానికి మన మందరం ఏకమవుదాము. హిందీ మాతృభాషకానివారు భాష విషయంలో ఇబ్బందులను, లోట్లనుకలిగి ఉండికూడ రాజ్యాంగాన్ని హృదయపూర్వకంగా స్వీకరించి తమ జాతీయ ప్రయోజనాన్ని త్యాగంచేసి, సహజంగా కలిగే యిబ్బందులను అధిగమించడానికి ప్రయత్నిస్తున్నారన్న నా అభిప్రాయాన్ని దాచకుండా వెల్లడిస్తున్నాను. మద్రాసు ప్రభుత్వం సమర్పించిన తర్కసహమైన నివేదికనూ, అందులో యివ్వబడిన హిందీ నేర్చుకుంటున్న విద్యార్థులకు సంబంధించిన లెక్కలనుచూచి చాల ఆనందించాను. సెకండరీ విద్యాదశలో హిందీ నిర్బంధం చేయుడానికి దేశంలోని యితర ప్రాంతాలతోపాటు వారుకూడా అంగీకరిస్తే ఎంత బాగుంటుంది ? హిందీని నిర్బంధం చేయ వలదనే, నిర్బంధంచేస్తే కలిగే విపత్ఫలితాలను వారు యిప్పుడే సాధిస్తున్నారు. అనేక వేల సంవత్సరాల విదేశ పరిపాలన తర్వాత మనకు సిద్ధించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పరిరక్షణకు స్వచ్ఛంద త్యాగాలు చేసేవారే ధన్యులు. మన జాతి శ్రేయస్సుకోసం ఐకమత్య సాధనకోసం అవసరమైతే ప్రాంతీయ ప్రయోజనాలను త్యాగంచేసి, కృషి చేయడానికి భగవంతుడు మనకు వివేకాన్నీ, శక్తినీ ప్రసాదించుగాక.

న్యూ ఢిల్లీ,
డిసెంబరు 5, 1958.

ఠాకూర్ దాస్ భార్గవా,
పార్లమెంటు ఉపసంఘం సభ్యుడు.

19. శ్రీ జై నారాయణ్ వ్యాస్, జైపూర్—రాజస్థాన్.

20. శ్రీ యం. అనంతశయనం అయ్యంగార్, డిప్యూటీ స్పీకరు, లోక్ సభ, ఢిల్లీ—మద్రాసు.

ఈ క్రింది అంశాలను గురించి ఈ కమీషన్ రాష్ట్రపతికి సిఫార్సులు చేయవల్సివున్నది.

(అ) కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో క్రమేపి హిందీ భాష ఉపయోగం.

(ఆ) కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలన్నింటిలోగాని, కొన్నింటిలోగాని ఇంగ్లీషు భాషను ఉపయోగించ రాదనే నిబంధన.

(ఇ) 348-వ ఆర్టికల్‌లో పేర్కొన్న వ్యవహారాలన్నింటిలో లేక కొన్నింటిలో ఉపయోగింపబడిన భాష.

(ఈ) కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో నిర్దిష్టమైన ఏ వ్యవహారంలోగాని, వ్యవహారాలలోగాని ఉపయోగింపబడిన అంకెలు.

(ఉ) కేంద్ర ప్రభుత్వ అధికార భాషగాను, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు మధ్య జరిగే వ్యవహారాలలో ఉపయోగించే భాషగాను, ఇంగ్లీషు స్థానే హిందీని క్రమంగా ప్రవేశ పెట్టడానికి కార్యక్రమ ప్రణాళికను కాలవివరణలో తయారు చేయడం.

2. ఈ విచారణ సంఘంవారు పై అంశాలను గురించి సలహా నిచ్చేటప్పుడు భారత దేశం యొక్క పారిశ్రామిక, సాంస్కృతిక, వైజ్ఞానిక పురోభి వృద్ధికీ ప్రభుత్వోద్యోగాల విషయంలో హిందీ మాతృ భాషకాని రాష్ట్రాల వారు వ్యక్తపరచే న్యాయమైన కోరికలను, హక్కులను వారు దృష్టిలో ఉంచుకోవాలి.

3. ఈ కమీషన్ తమ పరిశీలనలోవున్న ఏ అంశానికి సంబంధించిన దానికైనా ఉపయోగకరంగా వుంటుందని గాని, ఉచితమనిగాని భావించే పక్షంలో కేంద్ర ప్రభుత్వంనుంచిగాని, రాష్ట్ర ప్రభుత్వాలనుంచిగాని, సుప్రీం కోర్టు, హై కోర్టులు, శాసన సభలు, సంస్థలు, వ్యక్తులనుంచిగాని తమ ఉపయుక్తములగు యితర వర్గాలనుంచిగాని విజ్ఞప్తి పత్రాలను లేక సాక్ష్యాలను కోరవచ్చు.

(అ) ఈ విచారణ సంఘం తన కార్యాచరణ విధానాన్ని తానే రూపొందించు కోవాలి. సమావేశ స్థలాలు, కాలం, సమావేశాలు బహిరంగంగా జరగాలా లేక రహస్యంగా జరగాలా మొదలైన విషయాలన్నీ తానే నిర్ణయించుకోవాలి.

(ఇ) ఈ విచారణ సంఘం తాను దత్తం చేసే అధికారాలను, విధి బాధ్యతలను నిర్వహించడానికి ఆ సంఘ సభ్యులతోనే అవసరమైన ఉపసంఘాలను నియమించుకోవచ్చును.

(ఈ) తనకు అవసరమని లేక ఉచితమని తోచిన ప్రాంతాలకు అట్టి ఉపసంఘాలలో దేనినైనా పంప వచ్చును. లేక ఈ విచారణ సంఘంవారే వెళ్లి విచారింప వచ్చును.

(ఉ) ఏ ఒక్క సభ్యుడైనా సమావేశానికి తాత్కాలికంగా హాజరుకాక పోయినా, లేక సభ్యత్వ స్థానాలు ఖాళీవున్నా ఈ సంఘం కార్య కలాపాలను కొనసాగించవచ్చు.

ఈ సంఘం తాము సేకరించిన సాక్ష్యాన్ని పరిశీలించి 1956 ఏప్రిల్ 30-వ తేది దాటకుండా సాధ్యమైనంత త్వరలో రాష్ట్రపతికి తమ సలహాలు అందజేయాలి.

రాష్ట్రపతి ఉత్తర్వు పై
వి. విశ్వనాథన్
సంయుక్త కార్యదర్శి.

# అనుబంధం - II

## పార్లమెంటు అధికార భాషోపసంఘ కార్యనిర్వహణ

## నిబంధనావళి.

---

1. సంక్షిప్త శీర్షిక—ఈ నిబంధనలు "పార్లమెంటు అధికార భాషోపసంఘ కార్యనిర్వహణ నియమావళి" అని పిలువబడతాయి.

2. నిర్వచనాలు—ఈ నిబంధనలలో, సందర్భాన్నిబట్టి వేరు అర్థం అవసరమైతే తప్ప "సభ్యుడు" అనగా పార్లమెంటు అధికార భాషోపసంఘం సభ్యుడు" అని అర్థం. "కార్యదర్శి" అనగా పార్లమెంటు అధికార భాషోపసంఘ కార్యదర్శి అని అర్థం. ప్రస్తుతానికి ఆ కార్యదర్శి విధులను నిర్వహించే ఏ వ్యక్తి అయినా కావచ్చును. "ఉపసంఘం" అనగా పార్లమెంటు అధికార భాషోపసంఘం అని అర్థం. "అధ్యక్షుడు" అనగా పార్లమెంటు అధికార భాషోపసంఘం అధ్యక్షుడని అర్థం. ప్రస్తుతానికి తాత్కాలిక అధ్యక్షుడుగా వ్యవహరించే ఏ వ్యక్తి అయినా కావచ్చును.

3. సభ్యులకు ఆహ్వానాలు:—ఈ ఉపసంఘం లేక దీని అనుబంధ సంఘం సమావేశాల తేదీలనూ, సమావేశ స్థలాల పేర్లనూ కార్యదర్శి ప్రతి సభ్యునికీ తెలియపరుస్తాడు.

4. ఉపసంఘం అధ్యక్షుడు:—ఈ ఉపసంఘం ఎన్నుకొన్న అధ్యక్షుడు సమావేశానికి హాజరు కానప్పుడు, లేక సమావేశం జరుగుతూండగా అధ్యక్షుడు వెళ్లిపోవలసి వచ్చినప్పుడు అధ్యక్షుడుగా వ్యవహరించడానికి మరొక సభ్యుణ్ణెవరినైనా ఆయన నామినేట్ చేయవచ్చును. ఇతర సందర్భాలలో అవసరమైతే హాజరైన సభ్యులే ఆ సమావేశానికి అధ్యక్షుణ్ణి ఎన్నుకోవాలి.

5. కోరం: (1) ఈ ఉపసంఘ సమావేశం జరగడానికి కనీసం ఏడుమంది సభ్యులు హాజరుకావాలి.

(2) ఈ ఉపసంఘ సమావేశం జరపాలని నిర్ణయించేటప్పుడుగాని లేక సమావేశ కాలంలోగాని కోరం సరిపోక కానట్లయితే, ఈ ఉపసంఘం అధ్యక్షుడు "కోరం" అయ్యేవరకూ సమావేశాన్ని ఆపి వుంచవచ్చును లేదా సమావేశాన్ని మరొక తేదీకి వాయిదా వేయవచ్చును.

ఈ ఉపసంఘం సమావేశం వరుసగా రెండు రోజులు కోరం లేక వాయిదా పడినట్లయితే, అధ్యక్షుడు నిర్ణయించిన మరు సమావేశంలో కోరం లేకపోయినా సరే ఈ ఉపసంఘం తన కార్యకలాపాలను కొనసాగించ వచ్చును.

6. వోటింగు—ఈ ఉపసంఘ సమావేశాలలో అన్ని సమస్యలు, హాజరైన సభ్యులలో అధిక సంఖ్యాకుల అభిప్రాయం ప్రకారం, వోటింగుద్వారా పరిష్కారం చేసుకోవాలి.

7. అధ్యక్షుడి అదనపు వోటు—ఏ విషయాన్ని గురించి అయినా సభ్యుల వోట్లు సమానంగా వున్నప్పుడు అధ్యక్షుడు లేక అధ్యక్షుడుగా వ్యవహరించే వ్యక్తి అదనపు వోటు లేక క్యాస్టింగు వోటు ఉపయోగించవచ్చు.

8. (1) అనుబంధ సంఘాల నియామకం—అవసరమైన పక్షంలో ఈ ఉపసంఘం అనుబంధోప సంఘాన్ని లేక సంఘాలను నియమించవచ్చును. అట్టి అనుబంధోప సంఘాలు రూపొందించే నివేదికలు ఈ ఉపసంఘ సర్వ సభ్య సమావేశంలో ఆమోదింపబడినట్లయితే అవి ఈ ఉపసంఘ నివేదికలుగా పరిగణించబడతాయి.

(2) అనుబంధోప సంఘం కర్తవ్యాలు, విచారణీయాంశాలు ముందుగా స్పష్టంగా వివరింపబడాలి. అట్టి అనుబంధోప సంఘం నివేదికను ఈ ఉపసంఘం తిరిగి పరిశీలిస్తుంది.

(3) ఏ విషయాలనైనా విచారించడానికి ఈ ఉపసంఘం ఒక అనుబంధోప సంఘాన్ని నియమించి నట్లయితే ఆ అనుబంధోప సంఘం తయారుచేసిన నివేదికపై అనుబంధోప సంఘాధ్యక్షుడు సంతకంచేసి నిర్ణీత తేదీలోగా ఉపసంఘానికి సమర్పించాలి. ఆ నివేదిక ప్రతులు ఈ ఉపసంఘ సభ్యులందరకీ ఆ అనుబంధోప సంఘ నివేదికను పరిశీలించడానికి ఈ ఉపసంఘం సమావేశం కావడానికి ముందుగనే అందచేయబడుతాయి.

9. ఉపసంఘ సమావేశాలు—ఈ ఉపసంఘ సమావేశాలు ఈ ఉపసంఘం అధ్యక్షుడు నిర్ణయించిన రోజున, నిర్ణయించిన సమయంలో జరుగుతాయి.

ఈ సంఘాధ్యక్షుడు ఒకవేళ అక్కడ హాజరుగాలేకపోతే ఉపసంఘ కార్యదర్శి సమావేశం తేదీలను, కాలాన్ని నిర్ణయిస్తాడు.

10. (1) ఉపసంఘం రహస్య సమావేశాలు :— ఈ ఉపసంఘ సమావేశాలు రహస్యంగా జరుగుతాయి.

(2) ఈ ఉపసంఘం జరిపే సమాలోచనలు రహస్యంగా వుంచబడాలి. ఈ ఉపసంఘ సభ్యుడు గాని ఈ ఉపసంఘం వ్యవహారాలు తెలియడానికి అవకాశం ఉన్నవారుగాని ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని పత్రికలకు, లేక యితర వ్యక్తులకు ఈ ఉపసంఘ కార్యకలాపాలకు సంబంధించిన ఏ సమాచారంకాని, ఈ ఉపసంఘ నివేదికను గురించిగాని తాత్కాలిక నిర్ణయాలనుగాని, అంతిమ నిర్ణయాలనుగాని వెల్లడించరాదు.

(3) రహస్యంగా వుంచాలన్న ప్రత్యేక ఆదేశంతో పత్రాలుగాని, డాక్యుమెంట్లుగాని ఉపసంఘ సభ్యులకు సర్క్యులేటు చేసినప్పుడు అందులోని విషయాలను ఏ సభ్యుడూ భిన్నాభిప్రాయ ప్రకటనలలోగాని, పార్లమెంటులోగాని యితరత్రాగాని వెల్లడించరాదు.

11. సమావేశ స్థలాలు : ఈ ఉపసంఘంయొక్క లేక దీని అనుబంధోప సంఘాలయొక్క సమావేశాలను లనుకూలమైన చోట ఎక్కడైనా జరుపవచ్చును.

12. ఉపసంఘం చర్చలు జరిపే సమయంలో బయటివారు వుండరాదు. ఈ ఉపసంఘ సమాలోచనలను జరుపుతున్నప్పుడు ఈ ఉపసంఘంలో సభ్యులుకాని వారందరూ, ఈ ఉపసంఘ కార్యాలయం తాలూకు ఉద్యోగులూ, పత్రికా విలేఖకులు బయటికి వెళ్లిపోవాలి.

13. ఈ ఉపసంఘానికి సమర్పించబడిన ఏ పత్రము ఈ ఉపసంఘానికి తెలియకుండాను ఈ ఉప సంఘం ఆమోదం లేకుండాను ఉప సంహరించకూడదు లేదా మార్పులు చేయరాదు.

14. ఈ ఉపసంఘ సమాలోచనలన్నీ జరిగినవి జరిగినట్లుగా వ్రాసి వుంచుతారు. ఇదిగాక ఉపసంఘ అధ్యక్షుని ఆజ్ఞాయిషీ క్రింద కార్యదర్శి ఈ ఉపసంఘ సమావేశ వివరణ గ్రంథం వ్రాస్తూ ఉంటాడు. ఆ గ్రంథంలో వ్రాసిన విషయాలు మరుసటి సమావేశంలో చదివిన మీదట అధ్యక్షుడు దానిపైన సంతకం చేస్తాడు.

15. ఉపసంఘం నివేదిక—

(1) ఈ ఉపసంఘం తయారు చేసిన నివేదికపైన అధ్యక్షుడూ సభ్యులూ సంతకాలు చేస్తారు. నివేదికపై సంతకాలు చేసేటప్పుడు ఒక సభ్యుడు హాజరుకానియెడల ఉపసంఘం కార్యదర్శి ఆ సభ్యుని ఆమోదాన్నిగాని, తిరస్కారాన్నిగాని వ్రాతపూర్వకంగా తెప్పించుకుంటాడు. నివేదికపై సంతకాలు చేసే సమయంలో హాజరుకాని సభ్యుల వద్దనుంచి ఉపసంఘ కార్యదర్శి ఆ సభ్యునికి నివేదికను పంపిన తేదీనుంచి పక్షం రోజులలో జవాబు రాకపోతే, ఆయన జవాబుకోసం యిక ఎదురుచూడకుండా నివేదికను రాష్ట్రపతికి సమర్పిస్తారు.

(2) ఈ ఉపసంఘంలోని ఏ సభ్యుడైనా ఆ నివేదికలోని ఒక్క అంశంపైన లేక పెక్కు అంశాల పైన తన భిన్నాభిప్రాయాలను ప్రకటించవచ్చు.

(3) ఈ భిన్నాభిప్రాయ ప్రకటనలు సరసమైన, హుందా అయిన భాషలో ఉండాలి. ఈ ఉప సంఘ సభ్యులు వెల్లడించిన అభిప్రాయాలను గురించి భిన్నాభిప్రాయ ప్రకటనలో ప్రస్తావించరాదు. ఉపసంఘంపైన లేక సంఘ సభ్యులపైన నిందారోపణలు చేయూరాదు.

(4) భిన్నాభిప్రాయ ప్రకటనల్లో పార్లమెంటు సంప్రదాయాలకు విరుద్ధమైన అనుచితమైన పదాలు, పద సముదాయాలు, ప్రయోగాలు వున్నట్లు అధ్యక్షుడు అభిప్రాయపడితే, అట్టి పదాలను, పద సముదాయాలను, ప్రయోగాలను భిన్నాభిప్రాయ ప్రకటననుంచి తీసివేయవలసినదిగా అధ్యక్షుడు ఉత్తర్వు చేయవచ్చును.

16. పునః పరిశీలనను కోరే సభ్యుడు అధ్యక్షుని అనుమతినిపొందాలి. :—ఈ ఉపసంఘం లోగడ నిర్ణయించేసిన ఒక విషయాన్ని తిరిగి పరిశీలించాలని ఏ సభ్యుడైనా కోరాలంటే అట్టి కోర్కెను ప్రకటించడానికి ముందుగా అధ్యక్షుని అనుమతి పొందాలి.

17. శేషాధికారాలు :—ఈ నిబంధనలో స్పష్టంగా పొందుపరచబడనటువంటి అన్ని విషయాలూ, ఈ నిబంధనలను ఆచరణలో పెట్టుటకు సంబంధించిన అన్ని సమస్యలూ ఎప్పటికప్పుడు అధ్యక్షుడు నిర్దేశించిన ప్రకారం క్రమబద్ధం చేయబడతాయి.

---

## అనుబంధం—III

పార్లమెంటు అధికార భాషా విచారణ సంఘం జరిపిన సమావేశాల తేదీలూ, ఒక్కొక్క సమావేశానికి హాజరైన సభ్యుల సంఖ్యలూ వివరించే పట్టిక.

---

| | సమావేశం తేదీ | | | హాజరైన సభ్యుల సంఖ్య |
|---|---|---|---|---|
| 1. | 16–11–57 | ... | ... | 24 |
| 2. | 6– 1–58 | ... | .. | 29 |
| 3. | 7– 1–58 | ... | ... | 28 |
| 4. | 8– 1–58 | ... | ... | 28 |
| 5. | 9– 1–58 | ... | ... | 27 |
| 6. | 18– 2–58 | ... | ... | 22 |
| 7. | 10– 3–58 | .. | ... | 15 |
| 8. | 12– 5–58 | ... | ... | 24 |
| 9. | 13– 5–58 | ... | ... | 22 |
| 10. | 14– 5–58 | ... | ... | 22 |
| 11. | 14– 7–58 | ... | ... | 23 |
| 12. | 15– 7–58 | ... | ... | 23 |
| 13. | 16– 7–58 | ... | ... | 22 |
| 14. | 17– 7–58 | ... | ... | 21 |
| 15. | 18– 7–58 | ... | ... | 18 |
| 16. | 18– 8–58 | ... | ... | 17 |
| 17. | 19– 8–58 | ... | ... | 21 |
| 18. | 20– 8–58 | ... | ... | 22 |
| 19. | 21– 8–58 | ... | ... | 21 |
| 20. | 22– 8–58 | ... | ... | 19 |
| 21. | 30– 8–58 | ... | ... | 22 |
| 22. | 2– 9–58 | ... | ... | 21 |
| 23. | 4– 9–58 | ... | ... | 19 |
| 24. | 25–11–58 | ... | ... | 23 |
| 25. | 27–11–58 | ... | ... | 22 |
| 26. | 28–11–58 | ... | ... | 23 |

# అనుబంధం—IV

## భారతప్రభుత్వ దేశీయాంగ మంత్రిత్వ శాఖ

---

### భాషను గురించిన పత్రికా ప్రకటన

న్యూ ఢిల్లీ, ఆషాఢం, 23, 1880/జూలై 14, 1958.

(సభ్యులలో కొందరు కోరినందువల్ల ఈ ప్రభుత్వ ప్రకటనలోని నిర్ణయాలు దానికి సంబంధించిన వారందరికి తెలియడానికి, అమలుజరపడడానికి వీలుగా ఈ వ్రతం నకలును ఈ నివేదికకు అనుబంధంగా చేర్చాము.)

---

ఉర్దూభాష మాట్లాడే ప్రజలు తగినంత మంది ఉన్న ప్రాంతాలలో ఆ భాషను అధికారరీత్యా గుర్తించాలని కోరుతూ అంజుమాన్-ఇ-తరాకీ-ఇ-ఉర్దూ హింద్ సంస్థనుంచి అనేక విజ్ఞాపనలు వచ్చాయి. ముఖ్యంగా ఉర్దూభాషను ప్రోత్సహించడానికి ఉర్దూభాషలో బోధన, పరీక్షా సౌకర్యాలు కల్పించడానికి అనేక ప్రతిపాదనలు సూచించబడ్డాయి. ఈ విజ్ఞాపనలలోని విషయాలనుబట్టి, యితరత్రా తెలిసిన వానినిబట్టి ఈ అంశాన్ని గురించి కొన్ని అపోహలున్నాయని తేలినందున, ఈ అపోహలను తొలగించి, ఉర్దూభాష ప్రతిపత్తికి సంబంధించిన రాజ్యాంగ నిర్దేశాలను, ప్రభుత్వమూ రాష్ట్ర విద్యామంత్రుల సమావేశమూ చేసిన పలు ప్రకటనలనూ పునశ్చరణచేయడం, వివరించడం వాంఛనీయమని భావిస్తున్నాము.

2. ఉర్దూ, హిందీభాషలు అత్యంత సన్నిహితమైన భాషలు. అయినప్పటికీ ఆ రెండింటినీ యింపుమింపుగా ఒకే భాషక్రింద జమ చేయరాదు. ఉర్దూభాషకు కొన్ని విశిష్టలక్షణాలున్న మాట యథార్థం. ఉర్దూభాష సామాన్యంగా వ్రాసే లిపి విషయంలోనేగాక, సాహిత్య శైలిలోనూ, కొంతవరకూ పదజాలం విషయంలోనూ హిందీభాషకూ దానికీ తేడాలున్నాయి. విదేశ సంస్కృతుల సంపర్కంతో ఉర్దూ హిందీభాషకు రూపాంతరంగా వృద్ధి అయింది. అది ప్రధానంగా మనదేశానికి చెందిన భాష. దాని జన్మస్థానం భారతదేశం. రాజ్యాంగం ఈ ప్రాతిపదిక సత్యాన్ని గుర్తించడంవల్లనే దానిని ఎనిమిదవ షెడ్యూలులో ఉదహరించిన జాతీయభాషలలో చేర్చడం జరిగింది. ఉర్దూ అధికార రీత్యాను, రాజ్యాంగంలోనూ మన జాతీయభాషలలో ఒకటిగా గుర్తించబడినందున, జాతీయభాషలన్నింటికీ వర్తించే నిబంధనలన్నీ ఉర్దూకుకూడా వర్తిస్తాయి.

3. భారతదేశ ప్రజలలో అనేకులు ముఖ్యంగా ఉత్తర భాగంలో ఎక్కువమంది ఉర్దూ మాట్లాడుతూ, అది తమ మాతృభాషగా భావిస్తున్నప్పటికీ, ఏ రాష్ట్రంలోగాని అధిక సంఖ్యాక ప్రజలలోను, ఏ రాష్ట్రంలోని హెచ్చు ప్రాంతాలలోనూ ఈ భాష వాడుకలోలేదు. జమ్మూ, కాశ్మీరు రాష్ట్రంలో ఉర్దూ రాష్ట్రభాషలలో ఒకటిగా గుర్తించబడింది. కాశ్మీరీ దానితో ప్రధానభాష. ఆంధ్ర ప్రదేశంలోని తెలంగాణా ప్రాంతంలోకూడా ప్రధాన అధికార భాష తెలుగు అయినా, ఉర్దూ ఆ ప్రాంతానికి అదనపుభాషగా గుర్తించబడింది. ఉత్తర భారతదేశంలో ముఖ్యంగా ఢిల్లీ, పంజాబు, ఉత్తర ప్రదేశం, బీహారులలో ఉర్దూభాష నగరాలలో నివసించే అల్ప సంఖ్యాకులకు మాత్రమే పరిమితమై ఉన్నప్పటికీ, విస్తృతంగా వాడుకలో వున్నది. ప్రాచీనకాలంలో ఢిల్లీ లక్నోనగరాలు, ఉర్దూభాషకు ప్రధాన సాంస్కృతిక కేంద్రాలుగా వుండేవి.

4. సాహిత్యసంపదగల శక్తిమంతమైన భారతీయభాషగానూ, యితర కారణాలతోపాటు ఆ భాషలోని సాహిత్యం దృష్ట్యానూ ఉర్దూను ప్రోత్సహించాలి. ఉర్దూలో బోధన, పరీక్షా సౌకర్యాల విషయంలో రాష్ట్ర విద్యామంత్రుల మహాసభ కొన్ని నిబంధనలను నిర్ణయించింది. ప్రభుత్వం వాటినన్నింటినీ ఆమోదించింది.

5. ఉర్దూభాష బాగా వాడుకలోవున్న ప్రదేశాలలోనూ, ప్రాంతాలలోనూ, ఈ క్రింది సౌకర్యాలు ప్రధానంగా కల్పించాలి.

(1) తల్లితండ్రులుగాని, పోషకులుగాని ఉర్దూ తమ మాతృభాష అని ప్రకటించిన వారి పిల్లలకు ప్రాథమిక విద్యాదశలో ఉర్దూలో బోధనకు, పరీక్షల నిర్వహణకు సౌకర్యాలు కల్పించాలి.

(2) అధ్యాపకుల శిక్షణకూ, తగిన ఉర్దూ పాఠ్యపుస్తకాలు లభించేందుకు తగిన ఏర్పాట్లు చేయాలి.

(3) సెకండరీ విద్యాదశలోకూడ ఉర్దూభాషలో బోధన సౌకర్యాలు కల్పించాలి.

(4) ఉర్దూభాషలో దాఖలుచేసే పత్రాలను ఇతర భాషలలోకి అనువదించవలసిన అవసరంగాని, వేరొక లిపిలో వ్రాయవలసిన అవసరంగాని లేకుండానే న్యాయస్థానాలు, కార్యాలయాలు స్వీకరించాలి. ఉర్దూలో సమర్పించే దరఖాస్తులను, విజ్ఞప్తి పత్రాలను అంగీకరించాలి.

(5) ముఖ్యమైన శాసనాలూ, నియమ నిబంధనలూ, ప్రభుత్వ ప్రకటనలూ, ఉర్దూభాష ఎక్కువగా వాడుకలో వున్నదని నిర్దేశించిన ప్రాంతాలలో ఉర్దూలోకూడ జారీచేయాలి.

శాసనసభలలో శాసనాలు ఉర్దూభాషలో చెయ్యవలసిన అవసరంలేదు. ప్రతి శాసనాన్నీ ఉర్దూలో జారీ చేయవలసిన అవసరంకూడా లేదు. ముఖ్యమైన శాసనాలు, నియమాలు, నిబంధనలు, ప్రకటనలు ప్రజలలో ప్రచారం అయ్యే నిమిత్తం వాటినిగాని, వాటి సారాంశాలనుగాని కొన్ని నిర్దిష్ట ప్రాంతాల్లో ఉర్దూలో జారీచెయ్యాలి. అలాగే, రెండు రాష్ట్రాలనడుమ ద్విభాషా ప్రాంతాలుగా పరిగణింపబడే సరిహద్దు సీమలలో ముఖ్యమైన ప్రభుత్వప్రచురణలను ఆ రెండు భాషలలోనూ జారీచెయ్యాలి.

6. రాజ్యాంగం హిందీభాషకు అగ్రస్థానం ఇచ్చింది. పైగా, బీహారు, ఉత్తర ప్రదేశ రాష్ట్రాలకు హిందీ రాష్ట్రభాష. హిందీ ఉర్దూల మధ్య స్పర్థకు అవకాశమే లేదు. అలాంటి రాష్ట్రాలలో అవశ్యం హిందీకి ప్రముఖస్థానం ఉంటుంది. భారతదేశంలో తగినంతమంది ప్రజలు మాట్లాడుతూ ఇతర విధాల వాడుకచేస్తూన్న ముఖ్యమైన భారతీయ భాషలను ప్రోత్సహించడం ఉచితం కనుకను, ఈ విషయంలో రాజ్యాంగంచేసిన నిర్ణయం దృష్ట్యాను అభ్యాసంగా ఉర్దూ వాడుతూన్నవారు, ఆ భాషను తమ మాతృభాషగా పరిగణిస్తూన్నవారు, ఆ భాషను వాడడానికి, అభివృద్ధి చేసుకొనడానికి తగిన ప్రోత్సాహం ఇవ్వాలి. కొన్ని శతాబ్దాలనుండి ఉర్దూభాషా కేంద్రాలుగా ఉండిన బీహార్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాలకు, ఢిల్లీ నగరానికి ఇది వర్తిస్తుంది.

7. పంజాబు రాష్ట్రంలో హిందీ, పంజాబీలు రెండూ రాష్ట్రభాషలు. వాటిని వాడుకచేయడానికి ప్రాంతీయ సంధి ఒకటి చేసుకున్నారు. అందువల్ల పంజాబులో ఉర్దూభాషకు హిందీ, పంజాబీలతో సమానమైన స్థానం లేదు. అయితే ఉర్దూ ఆ రాష్ట్రంలో విస్తృతంగా తెలిసి, వాడుకలోవున్న భాష. కనుక పైన పేర్కొన్న ఐదవ పేరాలో ఉదహరించిన సౌకర్యాలను పంజాబులోకూడా కల్పించడం అవసరం.

8. వివిధభాషల విషయంలోనూ, ముఖ్యంగా ఉర్దూభాష విషయంలోనూ ప్రభుత్వవిధానం అనేకసార్లు స్పష్టంగా వెల్లడించబడినందున, ఆ విధానాన్ని పూర్తిగా అమలుజరపడం లేదన్న ఫిర్యాదు కొంతవరకూ సమంజసమనే చెప్పవచ్చును. అందువల్ల ప్రభుత్వవిధానాన్ని బాగా ప్రచారంచేసి దానిని అమలుపరచడానికి శాయశక్తులా కృషిచేయడం అవసరం. భాషాసమస్యను కొన్ని సమయాలలో మతదృష్టితో చూస్తున్నందుకూ, లేక వివిధభాషల మధ్య స్పర్థాభావంతో చూస్తున్నందుకు ప్రభుత్వం విచారిస్తున్నది. భారతదేశంలోని ప్రధాన భాషలన్నీ మనకు వారసత్వంగా లభించిన సంపదలు. వాటిలో ప్రతిభాష యితర భాషలనుంచి పదాలను పుష్కలంగా స్వీకరించుకున్నది. వాటిలో ఒక భాషతోపాటు మిగిలిన భాషలుకూడా వృద్ధి అవుతవి. మన జాతీయభాషల అభివృద్ధి దృష్ట్యానూ, ఆ భాషలమధ్య సాధ్యమైనంతవరకూ సహకార సామరస్యాలసాధన దృష్ట్యానూ ఈ సమస్యను పరిశీలించాలి.

# అనుబంధం—V

## నివేదికలో ప్రస్తావించిన అధికార భాషకు సంబంధించిన రాజ్యాంగ నిర్ణయాలు

---

### 17-వ భాగం *

### అధికార భాష

### ఒకటవ అధ్యాయం

### కేంద్ర ప్రభుత్వ అధికార భాష

343. (1) కేంద్ర ప్రభుత్వ అధికార భాష దేవనాగరి లిపితోకూడిన హిందీ భాష అయివుండాలి. కేంద్ర ప్రభుత్వ అధికార భాష.

కేంద్ర ప్రభుత్వ అధికార కార్యకలాపాలకు ఉపయోగించే అంకెలు అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న భారత దేశపు అంకెలు అయివుండాలి.

(2) ఒకటవ క్లాజులోని అంశాలతో ప్రమేయం లేకుండా, ఈ రాజ్యాంగం అమలులోకి వచ్చినది లగాయతు 15 సంవత్సరాలవరకు—రాజ్యాంగం అమలులోకి వచ్చేముందు కేంద్ర ప్రభుత్వం ఏ అధికార కార్యకలాపాలకు ఇంగ్లీషు భాష ఉపయోగిస్తున్నదో, ఆ కార్యకలాపాలన్నంటిలో—ఇంగ్లీషు భాష వాడుక చేయాలి.

పైన ఉదహరించిన గడువులోగా కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో వేటిలోనైనా ఇంగ్లీషుతో పాటు హిందీ భాషనూ, అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న భారత దేశపు అంకెలతోపాటు, దేవనాగరి అంకెలనూ వాడుక చెయ్యాలని రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా ఆదేశించవచ్చు.

(3) ఈ ఆర్టికల్‌లోని అంశాలతో ప్రమేయంలేకుండా, ఈ పదిహేను సంవత్సరాల గడువు తర్వాతకూడ పార్లమెంటు యుక్తమనుకొన్న కార్యకాలాపాలలో (1) ఇంగ్లీషు భాషనూ, (2) లేక దేవనాగరి అంకెలనూ వాడుక చేయడానికి పార్లమెంటు శాసనం ద్వారా అవకాశం కల్పించవచ్చును.

344. (1) ఈ రాజ్యాంగం అమలులోకి వచ్చిన తేదీనుంచి 5 సంవత్సరాలు పూర్తియైన తర్వాత, తిరిగి అప్పటినుంచీ పది సంవత్సరాలు పూర్తియైన తర్వాత రాష్ట్రపతి ఒక ఉత్తర్వు ద్వారా ఒక విచారణ సంఘాన్ని నెలకొల్పాలి. ఈ సంఘానికి ఒక అధ్యక్షుడూ, రాజ్యాంగం ఎనిమిదవ షెడ్యూలులో పేర్కొన్న వివిధ భాషల ప్రతినిధులుగా రాష్ట్రపతి నియమించే సభ్యులు వుంటారు. ఈ సంఘం పని చేయవలసిన విధానంకూడా ఆ ఉత్తర్వులో నిర్వచించబడివుంటుంది. అధికార భాషా విచారణ సంఘం, పార్లమెంటు ఉపసంఘం.

---

* ఈ భాగంలోని నిబంధనలు యీ క్రింది అంశాలకు సంబంధించినంతవరకూ మాత్రమే జమ్మూ, కాశ్మీరు రాష్ట్రానికి వర్తిస్తుంది :

1. కేంద్ర ప్రభుత్వ అధికార భాష. 2. వివిధ రాష్ట్రాల మధ్య, రాష్ట్రాలు—కేంద్రం మధ్య జరిగే వ్యవహారాలలో వాడుకచేసే అధికార భాష. 3. సుప్రీం కోర్టు కలాపాలకు వాడుక చేసే భాష.

(2) ఈ క్రింది అంశాలను గురించి రాష్ట్రపతికి సలహాలీయడం, అట్టి విచారణ సంఘం విధి :—

(ఉ) కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో క్రమేపి హిందీ భాషను వాడుకచేయడం ;

(ఆ) కేంద్ర ప్రభుత్వ వ్యవహారా లన్నింటిలోగాని, కొన్నింటిలోగాని ఇంగ్లీషు భాషను వాడుకచేయ రాదనే నిబంధన ;

(ఇ) 348-ఎ ఆర్టికిల్‌లో పేర్కొన్న వ్యవహారాలన్నింటిలో లేక కొన్నింటిలో వాడదగిన భాష ;

(ఈ) కేంద్ర వ్యవహారాలలో నిర్దిష్టమైన ఏ వ్యవహారంలోగాని, వ్యవహారంలోగాని వాడుకచేయవగిన అంకెలు ;

(ఉ) కేంద్ర ప్రభుత్వ అధికార భాషను గురించి, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య, వివిధ రాష్ట్రాల మధ్య జరిగే వ్యవహారాలలో వాడదగిన భాషలను గురించి విచారించవలసినదిగా రాష్ట్రపతి ఈ సంఘాన్ని కోరే యితర విషయాలు.

(3) విచారణ సంఘం రెండవ క్లాజులోని అంశాలపై సిఫార్సులు చేసేటప్పుడు భారత దేశ పారిశ్రామిక సాంస్కృతిక వైజ్ఞానికాభ్యుదయం, హిందీ మాతృ భాషకాని ప్రాంతాల ప్రజలు ప్రభుత్వోద్యోగాల విషయంలో వారి న్యాయమైన హక్కులు ప్రయోజనాలు తగిన ప్రాధాన్యం యివ్వాలి.

(4) దైష్పత్తిక ప్రాతినిధ్య సిద్ధాంతాన్ననుసరించి సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ వోటింగ్ ద్వారా లోక సభ సభ్యులనుంచి లోక సభ ఎన్నుకునే 20 మంది సభ్యులూ, రాజ్య సభ సభ్యుల నుంచి రాజ్య సభ ఎన్నుకునే 10 మంది సభ్యులూ మొత్తం 30 మంది సభ్యులుగల ఒక ఉప సంఘం ఎన్నుకోబడుతుంది.

(5) ఒకటవ క్లాజు క్రింద ఏర్పడిన విచారణ సంఘం చేసిన సిఫార్సులను పరిశీలించి, వాటిపై తన అభిప్రాయాలను వివరిస్తూ రాష్ట్రపతికి నివేదికను సమర్పించడం ఈ ఉప సంఘం విధి.

(6) 343-ఎ ఆర్టికిల్‌లోని అంశాలతో ప్రమేయం లేకుండా, 5-వ క్లాజులో ఉద హరించబడిన నివేదికను పరిశీలించిన మీదట రాష్ట్రపతి యావత్తు నివేదికను అనుసరించిగాని, లేక నివేదికలోని కొంత భాగాన్ని అనుసరించిగాని ఉత్తరువులు జారీచేస్తారు.

## రెండవ అధ్యాయం

### ప్రాంతీయ భాషలు

రాష్ట్రాధికార భాష, లేక భాషలు.

345. ఒక రాష్ట్ర శాసన సభ 346 వ, 347 వ ఆర్టికిల్లలోని నిబంధనలకులోబడి ఆ రాష్ట్ర ప్రభుత్వ అధికార కలాపాలన్నింటిలోగాని కొన్నింటిలోగాని వాడుకచేయడానికి ఆ రాష్ట్రంలో వాడుకలోవున్న భాషంలో ఒక దానినిగాని లేక కొన్నింటినిగాని, లేక హిందీనిగాని అధికార భాషగా, లేక అధికార భాషలుగా శాసనంద్వారా నిర్ణయించవచ్చు.

అయితే, రాష్ట్ర శాసన సభ శాసన రీత్యా అన్యథా నిర్ణయం చేసేటంతవరకూ, ఈ రాజ్యాంగం అమలులోకి వచ్చిననాటికి ఆ రాష్ట్రంలో ఏయే ప్రభుత్వ వ్యవహారాలలో ఇంగ్లీషు భాష వాడుకచేయబడుతూ ఉన్నదో వాటన్నింటిలో ఇంగ్లీషు భాషే వాడబడుతూ ఉంటుంది.

346. కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలలో వాడుకచేయడానికి అనుమతించబడిన భాషే, ఒక రాష్ట్రి ప్రభుత్వానికీ మరొక రాష్ట్రి ప్రభుత్వానికీ మధ్య, రాష్ట్రి ప్రభుత్వానికీ—కేంద్ర ప్రభుత్వానికీ మధ్య జరిగే వ్యవహారాలలోకూడా ఉపయోగించబడుతుంది. వివిధ రాష్ట్ర ప్రభుత్వాల మధ్య, రాష్ట్ర–కేంద్ర ప్రభుత్వాల మధ్యా జరిగే వ్యవహారాల భాష.

రెండు లేక అంతకుమించిన రాష్ట్రిలు, ఆయా రాష్ట్రిల మధ్య పరస్పర వ్యవహారాల భాషగా హిందీ అధికారభాషగా వుండడానికి అంగీకరించిన సందర్భంలో, ఆ భాషనే వారు వాడుక చేయాలి.

347. ఒక రాష్ట్రి జనాభాలో, చెప్పదగినంతమంది మాట్లాడే ఏ భాషనైనా ఆ రాష్ట్రి భాషగా పరిగణించాలని కోరే పక్షంలో, ఆ విషయాన్ని గురించి రాష్ట్రిపతి సంతృప్తి చెందితే, ఆ రాష్ట్రి మంతటాగాని ఒక భాగంలోగాని ఆ భాషనుకూడ రాష్ట్రిపతి నిర్దేశించిన కార్యకలాపాలకు అధికారభాషగా గుర్తించాలని రాష్ట్రిపతి ఆదేశించవచ్చు. రాష్ట్ర జనాభాలోని ఒక వర్గం మాట్లాడే భాషను గురించిన ప్రత్యేక నిబంధన.

## మూడవ అధ్యాయం

### సుప్రీం కోర్టులోను, హైకోర్టులలోను వాడదగిన భాష

348. (1) ఈ భాగంలో ముందురాగల నిబంధనతో ప్రమేయం లేకుండా పార్లమెంటు చట్టంద్వారా అన్యథా నిర్ణయించేవరకూ— సుప్రీం కోర్టులోను, హైకోర్టులలోనూ; శాసనాలకూ, బిల్లులకూ వాడవలసిన భాష.

(అ) సుప్రీం కోర్టులోను, అన్ని హైకోర్టులలోనూ జరిగే కార్యకలాపాలూ :—

(ఆ) ఈ దిగువ పేర్కొన్నవాటి అధికార పాఠాలు :—

(1) పార్లమెంటు ఎగువ సభలోనూ, దిగువ సభలోనూ రాష్ట్రి శాసన సభ ఎగువ సభలోనూ, దిగువ సభలోనూ, ప్రవేశపెట్టబడే అన్ని బిల్లులూ, వాటిపై వచ్చే సవరణలు—

(2) పార్లమెంటూ, రాష్ట్రి శాసన సభలూ చేసిన అన్ని శాసనాలూ, రాష్ట్రిపతి లేక రాష్ట్రి గవర్నర్లు† జారీచేసే ఆర్డినెన్సులూ—

(3) ఈ రాజ్యాంగ రీత్యా లేక పార్లమెంటు, రాష్ట్రి శాసన సభలూ చేసిన శాసనాలరీత్యా జారీచేసిన ఉత్తరువులు, నిబంధనలూ—

ఇంగ్లీషు భాషలోనే ఉండాలి.

(2) ఒకటవ క్లాజులోని సబ్ క్లాజు (అ)లోని విషయంతో ప్రమేయంలేకుండా రాష్ట్రి గవర్నరు‡ రాష్ట్రిపతి పూర్వామోదంతో, ఆ రాష్ట్రింలో ప్రధాన కార్యస్థానంగల హైకోర్టు కార్యకలాపాలకు హిందీ భాషనుగాని ఆ రాష్ట్రి అధికార కార్యకలాపాలకుపయోగింపబడే మరియే యితర భాషనుగాని వాడుకచేయవలెనని ఉత్తర్వు చేయవచ్చును.

అయితే ఈ క్లాజులోని ఏ అంశమూ ఆ హైకోర్టు యిచ్చే తీర్పులకూ, డిక్రీలకూ ఉత్తరువులకూ వర్తించకుండా వుండాలి.

(3) ఒకటవ క్లాజులోని (అ) సబ్ క్లాజులోని నిబంధనలతో ప్రమేయంలేకుండా, రాష్ట్రి శాసన సభలో ప్రవేశపెట్టబడే బిల్లులకూ, ఆమోదించబడిన శాసనాలకూ, ఆ రాష్ట్రి

†, ‡ "లేక రాజ ప్రముఖ్" అన్న మాటలు రాజ్యాంగంలో వదలివేయబడినవి. (సప్తమ సవరణ) శాసనం, 1956, ఎస్. 29 మరియు షెడ్యూలు.

గవర్నరు † జారీచేసే ఆర్డినెన్సులకూ (అ) సబ్ క్లాజులోని మూడవ పేరాలలో పేర్కొనబడిన ఉత్తరువులకూ, నియమ నిబంధనలకూ వాడుకచేయడానికి ఆ శాసన సభ ఆంగ్లేతర భాషను నిర్ణయించినట్లయితే, ఆ రాష్ట్ర గవర్నరు ‡ అధికార ముద్రతో, ఆ రాష్ట్ర ప్రభుత్వపు గెజెటులో ప్రచురించిన పైవాటియొక్క అంగ్లానువాదాలు ఈ ఆర్టికిల్‌ను అనుసరించి, ఆంగ్ల భాషలోని అధికార పాఠాలుగా పరిగణించ బడుతాయి.

భాషకు సంబంధించిన కొన్ని శాసనాలను చేయడానికి ప్రత్యేక విధానం.

349. రాజ్యాంగం అములులోకి వచ్చినప్పటినుంచి 15 సంవత్సరాల కాలంలో 348 వ ఆర్టికిల్‌లోని ఒకటవ క్లాజులో పేర్కొన్న ఏ కార్యకలాపాలకైనా వాడుకచేసే భాషకు అవకాశం కల్పించే బిల్లునుగాని, సవరణనుగాని రాష్ట్రపతి పూర్వామోదం పొందనిదే పార్లమెంటుయొక్క ఏ సభలోనూ ప్రవేశపెట్టకూడదు. 344-వ ఆర్టికిల్‌లోని 1-వ క్లాజుక్రింద నెలకొల్పబడిన భాషా విచారణ సంఘంయొక్కయు, అదే ఆర్టికిల్‌లోని 4-వ క్లాజుక్రింద నెలకొల్పబడిన అధికార భాషా ఉపసంఘంయొక్కయు సలహాలను పరిశీలించిన మీదటగాని, అట్టి బిల్లులను సవరణలను ప్రవేశపెట్టడానికి రాష్ట్రపతి అనుమతి యివ్వరు.

## నాల్గవ అధ్యాయం
## ప్రత్యేకాదేశాలు

పౌరుల విజ్ఞాపన పత్రాలలో వాడుక చేయవలసిన భాష

350. కేంద్ర ప్రభుత్వం తాలూకు ఏ అధికారికిగాని, రాష్ట్రప్రభుత్వం తాలూకు ఏ అధికారికిగాని తన సాధకబాధకాల నివారణకు పంపే విజ్ఞాపనలను కేంద్రంలోగాని, రాష్ట్రంలోగాని, ఆయా సందర్భాలనుబట్టి వాడుకచేసే భాషలలో దేనిలోనైనా పంపే హక్కు ప్రతి వ్యక్తికీ వున్నది.

ప్రాథమిక విద్యాభ్యాసానికి మాతృభాషలోనే తగిన సౌకర్యాలు.

[350-అ. ప్రతిరాష్ట్రంలోని అల్ప సంఖ్యాక భాషా వర్గాల పిల్లలకు ప్రాథమిక విద్యను వారి మాతృభాషలోనే బోధించడానికి తగిన సౌకర్యాలను కల్పించడానికి ఆ రాష్ట్ర ప్రభుత్వం, ఆ రాష్ట్రంలోని స్థానిక అధికారులు కృషిచేయాలి. అట్టి సౌకర్యాలు కల్పించడానికిగాను రాష్ట్రపతి అవసరమూ, ఉచితమూ అని భావించిన ఉత్తరువులను జారీ చేయవచ్చును.

అల్ప సంఖ్యాక భాషావర్గాలకు ప్రత్యేకోద్యోగి.

350-ఆ. (1) అల్ప సంఖ్యాక భాషా వర్గాలవారికిగాను రాష్ట్రపతి ఒక ప్రత్యేకోద్యోగిని నియమిస్తారు.

(2) రాజ్యాంగం క్రింద అల్ప సంఖ్యాక భాషా వర్గాలవారికి కల్పించబడిన రక్షణలకు సంబంధించిన అన్ని విషయాలను విచారించి రాష్ట్రపతి ఆదేశించే గడువు ప్రకారం తడవతడవకూ రాష్ట్రపతికి నివేదికలను పంపడం ఆ ప్రత్యేకోద్యోగి విధి అయివున్నది. ఆ నివేదికలన్నీ పార్లమెంటు యొక్క రెండు సభలలో ప్రవేశపెట్టడానికి, రాష్ట్ర ప్రభుత్వాలకు పంపడానికి రాష్ట్రపతి తగిన చర్యలు తీసుకుంటారు.]

హిందీ భాషా వికాసానికి సంబంధించిన ఆదేశం.

351. భారతదేశ సంకీర్ణ సంస్కృతికి సంబంధించిన సర్వరంగాలలోను భావవ్యక్తీకరణకు ఉపయోగపడగల భాషగా హిందీ భాష వికసించడానికి దోహదం చేయడం, ఆ భాషా వ్యాప్తికితగిన ఏర్పాట్లుచేయడం, హిందుస్థానీలోను, ఎనిమిదవ అనుబంధంలోని ఇతర భారతీయ భాషలలోను గల రూపాలను శైలిని పద గుంఫనలను హిందీభాషా విన్యాసానికి విరుద్ధంకాని పద్ధతిలో హిందీలోనికి కలుపుతూ, ముఖ్యంగా సంస్కృతంలోనుండి, కొంతవరకు ఇతర భాషలలోనుండి అవసరమైన పదజాలాన్ని స్వీకరిస్తూ హిందీని సర్వసంపన్నమైన భాషగా రూపొందించడం భారత ప్రభుత్వ కర్తవ్యం.

---

†, ‡ "లేక రాజప్రముఖ్" అన్న మాటలు రాజ్యాంగంలో వదలివేయబడినవి. (సప్తమ సవరణ) శాసనం, 1956, ఎస్. 29 మరియు షెడ్యూలు.

* పైన పేర్కొన్న స్థలంలోనే ఎస్. 21లో.